# రాజవాహనవిజయము.

## ప్రౌఢప్రబంధము.

కాకమాని మూర్తికవి

ప్రణీ

టీకాసహితము

1937

ద్వితీయ ముద్రణము.

ప్రకాశకులు: నందిరాజు చలపతిరావు.

మంజువాణీ ప్రెస్, ఏలూరు.

# విజ్ఞప్తి

ఈ రాజవాహన విజయ గ్రంథమును చెన్నపురి ప్రాచ్యలిఖిత గ్రంథభాండాగార మాతృకనుండి ప్రతివ్రాసి తెచ్చి 1898 సంవత్సరము జూలై మాసమున బ్రకటింపబడిన మంజువాణీ మాసపత్రికలో ముద్రించితిమి.

ప్రౌఢ ప్రబంధమగుటచే టీకాసాహాయ్యము లేక యర్థముచేసికొనుట కష్టసాధ్యమని యెంచి లఘుటీకతో బ్రచురించితిమి.

ఈకవి ప్రయోగించిన శబ్దములను సూర్యారాయ నిఘంటు కారులును, శబ్దరత్నాకర నిఘంటుకారులు, ఉదాహరణముగా గ్రైకొనియున్నారు. చిన్నయసూరి మతమునకు వ్యతిరిక్తమైన ప్రయోగములు క్వచిత్తుగా నీగ్రంథమందున్నవిగాని, ఆయాసందర్భములలో చిన్నయసూరి మతమే సంస్కరణాపేక్షితముగా గానుపించుచున్నవి.

బహులాశ్వచరిత్రయు రసవత్కావ్యముగానున్నది. భాషాపరులెవ్వరైన నాగ్రంథమును బంపినచో కృతజ్ఞతాపూర్వకముగ ముద్రించి, కాకమానిరాయని ప్రతిభను వెల్లడింతుము.

ఇప్పుడిప్పుడే ప్రజలలో మరల ప్రబంధ పఠనాసక్తి గలుగు సూచనలగపించుచున్నవి.

ఇట్లు,

ఏలూరు, 15—3—37. | నందిరాజు చలపతిరావు, ప్రకాశకుడు.

# రాజవాహనవిజయము.

---

## పీఠిక.

ఇది 5 ఆశ్వాసముల ప్రబంధము. కాకమాని మూర్తికవి ప్రణీతము. ఈతడు బ్రాహ్మణుడు. ఇంటిపేరు పెన్నేకులవారు. తండ్రి రామలింగభట్టు. తల్లి తిమ్మమాంబిక. ముత్తాత రామపండితుడు. తాత ప్రబోధపండితుడు. ఆపస్తంబసూత్రుడు. ఉభయభాషా విద్వత్కవీంద్రుడు. కవి పట్టభద్రుడు.

ఈతడు సంకుసాల నృసింహకవివలె

శా. వ్యాళీస్వాంతులకాంతు లజ్ఞ సతతైకాంతుల్ మహాచేటికా
 శ్రీలోపద్రవ నవ్యపత్రికులు భూరిప్రాజ్ఞ విజ్ఞాపనా
 వేళాకల్పిత రక్తవస్త్రులు కళావిజ్ఞాన నిర్భాగ్యు లీ
 కాళిజ్ఞాతల నేతలం బొగడుటల్ కష్టంబు లర్థార్థికిన్.

అని ఆనాటి రాజులను గూర్చిన తన యభిప్రాయమును వెల్లడించుచు 'సద్వైభవం కేశవాత్పరమ్మ'ని తన కృతులలో పాంచాలీపరిణయమును శ్రీరంగపతికిని, రాజవాహనవిజయమును శ్రీ వేంకటాచలపతికిని గృతి యొసంగెను. ఈతడు రచించిన బహుళాశ్వ చరిత్రములోని లక్ష్యములుగా జూపబడిన పద్యములు తక్క, సమగ్ర గ్రంథ మెచ్చటను లభింపలేదు.

### కవి కాలము.

సాధారణముగా కవికాలమును నిర్ణయించుటకు కవిస్తుతియు, గద్యయు, వరాంకితమొసంగియుండిన యెడల నా కృతిపతి వంశకథనమును జాల వఱకుపచరించెడివి. ఈతడు సంస్కృత కవులను, కవిత్రయమునే పేర్కొనియెను గాని, తననాటి కవులను పేర్కొనక తన తాత ముత్తాతలను పేర్కొనెను.

పంచమాశ్వాసము నందలి,

సీ. అఖిల సీమామూలమైన దుర్గమ్ముల
మ్మలికలు గల కమ్మ వెలమ దొరలు
చేతి కైదేసివేల్ శివరాయల వరాల
నెల కట్టడల పటాణీ ల్గరీబు
లూళ్ళాయములమీద హారపుత్తరవు గన్న
రాయకై జీతంపు రాయవారు
పగటిగాసంబు దప్పకయుండ దినరోజు
మాదిరి నొంటెరి జోదుమూక

గీ. మొదలుగా గల వారలు మొనకు నిల్చి
పొడిచి పేర్వాడి వీథు లేర్పడగ జేసి
గాసి గావించి యరుల జేవాసి యెదుట
జూపి నిలకేసు మూడు మెచ్చులున మెచ్చ.

అను పద్యమందలి“ శివరాయల వరాల”నుటచేత శివదేవరాయల నాటివాడని గాని, తరువాతి వాడగాని నిశ్చయించుట కాధారం మీ గ్రంథమందే లభించినది.

అచ్యుత దేవరాయల కుమారుడు మరణించిన తరువాత రంగా రాయల కొడుకు సదాశివరాయలు రాజ్యమునకు వచ్చెను. సదాశివ దేవరాయల బావమరిది యగు రామరాజాతనికమాత్యుడై యుండెను. తాళికోట యుద్ధములో 1565 లో రామరాజు మరణించెను. సేనాని వెంకటాద్రియు పడెను. ఇక మిగిలినది సేనాని తిరుమల రావు ఒక్కడే. అతడు 150 కోట్ల రూపాయిలు, నవరత్నాభరణ ములు మొదలగు బహు ధనముతో సదాశివరాయలను తోడ్కొని, అనంతపురము వద్దనున్న పెనుగొండ దుర్గమునకు పారిపోయెను.

1568 వ సంIIమున సదాశివరాయలను చంపితిరుమలరాయుడే రాజ్యమేలెను. కాని అక్కడ నిలువలేక చంద్రగిరికి వచ్చి చేరెను.

ఈ కవి 1568 సంII తరువాత సదాశివ దేవరాయల వరాలు ప్రచారములో నుండుకాలమున జీవించియుండెనని నిర్ధారణ చేయ వచ్చును.

గీ॥ అల్లసానివాని యల్లిక బిగిసొంపు
ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు
పాండురంగ విభుని పద్యంబు హరువును
కాకమానిరాయ నీకె కలదు.

అని తననుగూర్చి శ్రీరంగనాథుడు పల్కినట్టు లీకవి తనపాంచాలీ పరిణయములో జెప్పుకొనెను. అల్లసాని పెద్దన్న 1535 వఱకును, ముక్కు తిమ్మన్న 1526 వఱకును, పాండురంగ మహాత్మ్యమును రచించిన రామకృష్ణుడు గూడ కృష్ణదేవరాయల యవసాన కాలము నాటికి చిన్నవాడైయుండి యుండవచ్చును.

ఈతని కవిత్వమును గూర్చి పై ముగ్గురి కవిత్వములోని గుణము లున్నవనుటచేత నీ కవియు, వారి తరువాత 1570-80 ప్రాంతముల యందే యున్నవాడని యూహించవచ్చును.

కాకమానీ మహాగ్రామాబ్జ మిత్రుడని చెప్పుటచేతను, సరస విద్వత్కవి సార్వభౌముడని చెప్పుకొనుటచేతను, నీకవి యా యూరిలో గౌరవ జీవనముగల ప్రసిద్ధుడై యుండును. శివదేవరాయల యనంతరము విద్వత్కవి పోషకులగు రాజుల స్తమించుటచేతను, అర్హులగు కృతి నాథులు లేని కారణమునను, నరకృతి యందిష్టములేక పోవుటచేతను గూడ నీతడు తన కృతులను నరాంకితము గావించి యుండడు.

## కథా సంగ్రహము.

(ప్రథమాశ్వాసము.)

కథా సంగ్రహమును విశదీకరించిన పిమ్మట కథేతి వృత్తమును విమర్శించుట సమంజసము గదా!

మగధదేశమున కుసుమపురము గలదు. అది శత్రుదుర్నిరీక్ష్యమై లక్ష్మీవంతమై రత్నప్రభలచే చీకటిలేనిదిగా తనరారు చుండెను.

అచటి బ్రాహ్మణులు నలుమొగముల బ్రహ్మవలె దిక్కులు జూడక నేకముఖముగా వేదపాఠమును జదువుదురు. రాజులు భార్గ వుని తమ కొలువునకు రప్పింపగల సమర్థులు. వైశ్యులు నిత్యైశ్వర్య

కుబేరవిజయులు. శూద్రులు బలరామునిత్రోసి రాజని రొంపిలోఁ సైతము దుఃక్కఁజొన్నింపగల దక్షులు.

మధురాధరా రణ్యమునను, వేణికా మైచక్యమునను, భుజాలతా విలసనముచేతను, వక్షోజవారి భావములచేతను, పల్లవశ్రేణి సంపదల వారించు వేశ్యాకాంత లాపట్టణమున కలంకారముగా నుందురు.

ఆ పట్టణమున త్రాతుమసం బెతింగి జలరాశి చివుకుఁ నదాటు నశ్వములును, చటుల బృంహిత బధిరితాశా గజములగు కరటి ఘటలును చెలరేగు చుండును.

అట్టి కుసుమపురమును ప్రతాపాటోపహత కోపాసత భూపాయిత ధైర్య శౌర్య పుటభేదనుండగు రాజహంసుడుపరి పాలించు చుండును. అతని దేవేరి వసుమతి సుగుణవతి. ఆ యార్యగృహిణి తనూజాతజాతకంబున కెదురుచూచుచు క్రీడాగారంబున శయనింప నాతలోదరికి కలలో శ్రీవత్సము, శంఖచక్రములు, గద, స్వర్ణచేల ధరించిన శ్రీకృష్ణుడు సాక్షాత్కరించి, సంతానఫలంబొసంగి తిరోహితు డాయెను.

దేవేరి నిద్రలేచి మురారిహృదయ గతోద్యత్సంతోష బాష్పకళికాక్రాంత నిరంతరిత పులకగండయుగళయై, ముద్దుకృష్ణుని దివ్యసందర్శనముసంజేసి కళావికాసము నొందిన మోముదమ్మితో భర్తను మేలుకొలిపి యిట్లనియెను.

(ద్వితీయాశ్వాసము.)

ఆర్యపుత్రా ! యశోదా కిశోరము నాకు కలలో ప్రత్యక్షమై సంతాన ఫలమొసంగెనని తెల్పగావిని యావసుధేశుడు తన భార్య దౌహృదము దాల్చునని ప్రమోద భరితుడాయెను.

వసుమతీదేవి యంతర్వత్నియై సువర్ణవర్ణ పరిపూర్ణ గర్భంబు దాల్చి, యగణ్యసాద్గుణ్యంబగు నొకానొక పుణ్యవాసరంబున, బృహస్పతి, చంద్ర, శుక్రులుగల శుభలగ్నమున మన్మథ మొలకయన దగు కుమారునిగాంచెను.

ఆ రాజహంస భూజాని యాత్మజాత వార్తాకర్ణనా పూర్ణుడై యానంద బాష్పములురాల, నగరి జనులకు బహుమానంబు లొసంగి,

బాంధవాంతః కరణంబు ఫలింపగా పుట్టిన బిడ్డకు రాజవాహనుడని నామకరణం బొనర్చెను.

శుద్ధాంతవాటీ నటన్మాలాజాలము "చంద్రిమః కంపశాంద్రోళీ భావ! దయార్ద్రభావ" యనుచు జోలపాటల బాడుచు నా శిశువు లాలించుచుండిరి.

ఆ ముద్దుల మూటగట్టు శిశువు జిలిబిలి పొంగారు చెక్కుల చెక్కుతో, నిగనిగలాడు పుట్టువెండ్రుకలతో, బాలకృష్ణుని వలె పాదాంగుష్ఠములు నోట నిడికొని నెల్లరకు కనులపండువగా నుండెను.

దినదిన ప్రవర్ధమానుడగు నా రాజవాహన బాలకుడు యీడు జోడు చెలికాండ్రతో దాగుడుమూతలు, సిరిసింగనాలు, కప్పురపు గుప్పెలు, మున్నగు నాటలాడుకొనుచు ముద్దులు మూట కట్టుచుండెను.

రాజహంసుడా బాలునకు ఉత్తమ క్షత్రియోచిత విధమున నుపనయన మొనర్చి, బ్రహ్మచర్యవ్రత నిష్ఠానియమవంతుని గావించెను.

నానుదాను యౌవనము కెరలుచుండగా కరికలభములను కొమ్ములు బట్టి యాడ్చుచు, మత్తఖడ్గిని బడల్చి క్షాత్రమున, అనవద్యమగు సంగీతసాహిత్య విద్యాధిమణుడై, చక్కదనమునకుదగిన ప్రతాపముతో రణాంగణాటవీ పావకుడై యొప్పారుచుండెను.

పెండ్లియీడు వచ్చుటచేత తండ్రి యాతనికి చుట్టపునరపాలుర గుణవతిబిడ్డను వివాహమొనర్చి, యువరాజుగా నభిషేకించి, రాజనీతి యుపదేశించి, కప్పముగట్టని పాండ్యుపైకి యుద్ధమునకు బంపెను.

రాజవాహనుడు తండ్రి పనుపున బంగారు పల్యంకి నారూఢుండై గజతురగ, పదాతులు, వెంటరా, శంఖ కాహళార్భటీ ఢక్కా కాహళ డుక్కారవములు దిక్కులు పిక్కటిల్ల రణరంగమునకు వెడలెను.

రాజవాహనుని భార్యగూడ, సోదరుడు వెంటరా పల్లకినెక్కి భర్తృప్రతాపమును జూచి వినోదించుటకు బయలు వెడలెను.

ఇట్లు సమస్తసేనా పరివృతుడై, రాజవాహనుడు శత్రురాజు పట్టణ ప్రాంతమున దండుదిగి శత్రువుల గుండెలు గుబ్బురన శంఖారావము గావించి యుత్తర ధరణీభృత్తముల కోట కొత్తళము తుత్తు ముగు జేసెను.

కుంతలాధిపుని, సింధురాజును, సౌరాష్ట్రవిభుని, గాంధారుని గౌడనాయకుని, కాశీభర్తను, మత్స్యవల్లభుని జయించి వారివలన కప్పములం గైకొని శాండిల్యముని యాశ్రమమునకు బోయి, ఆ ఋషీంద్రునకు సాష్టాంగవందనం బాచరించి యాతనిచే సాహసాంకుడై ఆ ముని యాతిథ్యమున దృప్తుడై యానాడచటనే నిద్రించెను.

## తృతీయాశ్వాసము.

కొక్కొరోకో యను కుక్కుటారావమున లేచి, తన విలు విద్యా నిపుణతను జూపుటకై వచ్చి వేటాడ గోరు చెంచునాయకునితో మృగయావినోదము వేనగొని యరణ్యమునకు జనియెను.

కొంతసేపా యడవియందు వేటాడి, చెంచునాయకుని ప్రజ్ఞకు మెచ్చుకొని, విశ్రాంతికై యడవికి సమీపమున నున్న మాళవేంద్ర మానసార మహోద్యమోద్యానమున కేగెను. అప్పుడు వసంతఋతువు అరుణారుణ ప్రభలతో వసంతు నాహ్వానించు వనలక్ష్మిగా యన నచటు విహరించుచున్న రాజసుత యవంతీసుందరిని జూచెను. చూచి తలోదరుల చే విన్నందులకు తగినట్లు కనువిందొనర్చు నవంతిని గన్నంగను లకు సంతోషితస్వాంతుడై, యా యవంతీ మదవతి సఖులతో నాడు నర్మోక్తుల కులుకుచు, పుష్పాపచయశ్రమకు సానుభూతి జూపుచు, నామె సఖులతో సరసున గావించు జలక్రీడా వినోదముల కుతూహలా రుడు, కందర్పశరావిద్ధుడై యా సుందరిని జూచి తహతహ పడ జొచ్చెను.

ఆ యవంతీ లతాంగియు నీతని జూచి, మురులుకొని, "యాతని చొకారపు మోవిపై గంటుసేయు కలకంఠి భాగ్య మెట్టిదో గదా! చక్కని రాకొమరులలో చక్కనివాడు. నరులలో, సురకిన్నరు లలో, ముకుందనందన, పౌరందురులలో నీ ధరణీధరతరుణి సౌందర్యమే హృదయంగమ"మని తలంచును.

ఇట్టి సమయమున నా యవంతీ మహిళాజనయిత్రి కూతురిని జూచుటకై వచ్చి, "కృపాయతలోచనా! తగవే తగవేగన వచ్చి

తొయింత సేపాయె నపాయమే యిది. రాచపట్టి కీపాయపుటెంతి కింపగు నుపాయములే యివి, సువర్ణపుత్త్రి!" యని యంతఃపురమునకు దోడ్కొనిపోయెను. తియ్యచెఱకు చేవిడిచి, బాదెలదొడ్డికి జనుకోడెచందమున నవంతీసతి మార్మొడపెట్టి వెనుక వెనుకకు జూచుచు తల్లితో నిజగృహంబున కేగెను.

## చతుర్థాశ్వాసము.

అవంతీ సుందరిని తల్లి తీసికొనిపోగా నిట రాజవాహనుడు తాలిమిదూలి యీ సుందరిని మనసు దీరునట్లనేక విధముల వర్ణించి తరుణీమణీ వియోగభోగ సమాగత మదన వేదనాక్రాంత నిజస్వాంతుండై తహతహ పడగా చంద్రోపల వేదికా తలంబున శైత్యోపచారంబుల దేలుచుండెను.

ఇట నవంతీకాంతయును హంసతూలికా తల్పంబున నపార చింతాపారావారడోలాయమాన మానస నౌకయై, కందర్పశరాపిద్ధయై గృహారామావనికి రామామణిం దోడ్కొని చని, విరాళిమాలి మన్మథ చంద్రోపలంబనాదుల కొంత ప్రోదిపుచ్చి, ఇక్షుచాప పరితాప జాత రూప కలాపంబై యంతఃపురంబున నేకాంత చింతనుండ నా చెలి సఖులాయవంతీ కాంతకు పటీర పన్నీర నీహార పూర కర్పూర కల్హార దళంబుల జెంగావి చెలువంజలువ గావింప నంతలో ప్రభాతంబాయెను.

అవంతీ చెలికత్తె "సఖీ! రాజవాహనున కీపరితాప మెఱింగించి అతని దోడ్కొని రానా" యని పోయి మగధ నృపతిని గాంచి "మాచెలి నిన్నటివేళ నిచటనిన్ను గన్గొన్నది మొదలు విరహవ్యథ నొందుచున్నది. తగవే, నృపాలా! ఆ తరుణీమణి కొండపరతి, సుమకోదండుని మూడవ భుజంబు, దర్పకు తుర్యోద్దండ తరశక్తి. శుకవేదండుని దైయవ బలాంగము. ఆరవ శరమే. గానము సొబగులలోల తేనెలవాన, సరస్వతీ కరవీణా తానపు టుక్కు. అమృతవితానము తానై తగును. రతి మన్మథులవలె, భారతి బ్రహ్మవలె మీ యిద్దఱికిని తగును.

అని యిట్లా బాలచంద్రిక, విన్నవించిన విన్నపంబు విని నా రాజవాహనుండు ఆ బాలచంద్రికా తలోదరిని దుకూలాదుల సత్కరించి

నాల్గు మూన్నాళ్ళలో మాళవాధీశునికి నా పరాక్రమము జూపి, మీ యవంతి నాదరించెదనని చెప్పుమని పంపెను.

ఆ బాలచంద్రికవచ్చి నక్తందివాశ్రుధారాసిక్తను, నిరస్త ముక్తాహారను, గనుగొని “నీచలపట్టినట్టి పని నిశ్చలమాయెగదమ్మ, సత్య భాషా చతురుండగు నీ ప్రియుండు ద్విత్ర దివసంబులలోఁ గరుణింతు ననియెను. ఇక మరునాకుల కుల్కకుమ”ని యూరడించెను. ఆయవంతీ సుందరి సేదదేరి చిగురాకు టేకుదమ్మి దొమ్మిగా గ్రమ్మిన మిటారి దొరకటాకివలె మెఱసిపోవు చుండెను.

అట్టియెడ నమ్మాగధేశు ప్రభువు ఉద్దండ చతురంగ బలంబుల గూడుకొని మానసార మానవపాలుని మీదికిఁ గదలి యవంతీపుర ప్రాంత తటాక తటాగ్రంబున దండువిడియించెను.

అవంతీపురమున సామంత మంత్రిపురోహిత పరిజనాది సకల సన్నాహములతో పట్టాభిషేక దామాభిరామమగు మంటపాభ్యంతరమున మానసార మహీపాలుడు గొలువుండెను.

ఈ సమయమున వసుమతీ పురాధీశ్వరనందను డా చేరువకు వచ్చెనని చారులు చెప్పిరి.

ఇదివిని, మంత్రులు “రాజవాహనునకు దగిన బసలుగుదుర్చెడు. ఇతడు శౌర్యప్రతాపనిధి; తండ్రివలెగాదు తాను తప్పెరుగడు. ప్రజలకు తలలోని నాలుక”యని చెప్పిరి.

అది విని రాజు “ఔరా మాగధరాజ కుంజరము సేడహంకారుడై మానసార హరిని మేలుకొల్పవచ్చెనా ? మొండిచెట్లు చిగురించినవి కాంబోలు. అంబులపొదు లిపుడునిండినవా ? భిల్లనాయకుని రుఱచెనా”అని పల్కెను.

(పంచమాశ్వాసము.)

మానసారుడు తన కుమారుని దర్పసారుని గతిపయ పరివారుని గావించి రాజవాహనుని మీదికి బంపెను.

అలబలము తెలగోలై తలతల మని దండెల్ల హల్లకల్లోలమై పర దళముపైబడెను. మాళవ మాగధులు పరపు మార్గణములు పెక్కు రూపులై రథ ధ్వజపాళిపైబడ నవి నుగ్గునూచములై పోయెను. భటచ్ఛ

టాంగములు వ్రీలెను. మదావళి దంతకుంతములు కూలెను. పోరు ఘోరమాయెను. రణరంగమండలి కళేబరముక్త రక్తము లేరులై పారెను.

మాగధుడు చండపరాక్రమంబున భటుల గీటడగించి, ఘోటకములను గర్జించి, భద్రేభములను చెక్కలుచేసి, సైనిక శతాంగశ్రేణి నుగ్గాడి, విక్రమోదగ్రుడై నురుమాడుచుండగా మానసారుడు యుద్ధరంగమునుండి మరలెను, ఫౌజు కకావికలై దిశలపరచెను. వెన్నిచ్చి పారుచున్న మాళవ నృపతిని మగధరాజు కోటదాక తరిమి రేపు సర్వలగ్గయని ప్రకటించెను.

అప్పుడు మాళవ విభుండు తన హాజీబులను రాయబారము పంపెను. వారుపోయి "రాజాన్వయ గ్రామణీ! రాజహంసునికి క్షేమమా! మీకీ శ్రమ మెందుకు, మీరొక చీటి పంపిన దిక్పతులెల్ల గప్పములు గట్టరా? గ్రహగతి గాక మీకును మాకును గలహమేల. నీళ్ళను విడగొట్టిన, గొట్టినవారే వేరగుదురు గాని, నిశ్చైక మేయగును.

మీరు వినలేదుకాబోలు మా మానసార ప్రభుకుమార్తె అవంతీసుందరి నుబుసుపోకకు చిన్నప్పుడే, కలభాషిణీ! యెవ్వని పెండ్లాడెదవన్న మగధ నృపాలునే యని చెప్పుచుండెడిది. పంచమి రాత్రి లగ్నము సుముహూర్తము. రాజ్యమున సగభాగా కుమారికి మాప్రభువు పసుపుకుంకుమన కొసంగియున్నాడనగా రాజవాహను డానంద పంపళిత హృదయుండై యియ్యకొనెను.

అవంతీ సుందరీ సఖులు రాజునకు తలంటి అలంకరించి పెండ్లికుమారుని గావించిరి.

పణవ రవంబు, పటహ ధాంధణ్యము, మృదంగ తమ్మట ఢక్కా శ్రేణీనినదము వీరణ రాణంబులతో భూనభోంతరాళము భోరు కలిగెను.

పంజాలు, పగలువత్తులు, ఆకాశ బాణములు చేబిరుసులు, వింజామర కోపు లాకాశము నలంకరించెను

జననాథాగ్రణి మగధక్ష్మా భర్తకు పుత్రికను ధారపోసెను.

తళుకు కంకణ ఝణంఝణ నినాదములతో మత్తకాశిని నృపోత్తంసోత్తమాంగంబున తలంబ్రాలు పోసెను.

రాజవాహను డవంతీ సుందరీ కలకంఠ పీఠిని మంగళసూత్రమును గట్టెను.

సకలాగమ కావ్యకళానిధులు గ్రంథత్రయీవిధులు, సంభావింపబడిరి. నాగవల్లినాడు బంధువులు కాంచనాంబరములు, కట్నములు చదివించిరి. నృపతి కుమార్తెకు స్వర్ణఖండంబులగు గ్రామములను పసవునకొసగెను.

అంతట పల్లకి నెక్కి అవంతీకాంతతో మాగధుడు నిజగేహంబు బ్రవేశించెను. మానవ పతీంద్రు డవంతీసతితో ననవరతానందుడయ్యెను. అట్లుండి రాజవాహను డుత్తరవార్ధిని జయస్తంభంబు నిల్పి, నిజకాంతా సైన్యయుక్తుండై యాత్మపురి జేరి తలిదండ్రులు, నిజ పరిజనులు మెచ్చగా సమస్త రాజ్యపదవీసౌఖ్యంబు జెంది సుఖించుచుండెను.

## కథా విమర్శనము.

ఇందలి యితివృత్తము స్వకపోలకల్పితమువలె గానుపించుచున్నది. దీనికి సంస్కృత మాతృక కానుపించదు. సామాన్య నైసర్గిక విశేషములనే గైకొని యత్యంత రమణీయమైన కథాశరీరమునుగల్పించి సాహిత్యరసపిపాసువులకు నితాంతానందనమును సమకూర్చుటకొరకీ కాకమాని కవి జూపిన భావనాశక్తి కళావైదగ్ధ్యము యతిలోకరమ్యముగా నున్నది.

కవిత్వధార, సరళమై, శ్రావ్యమై, స్వభావమధురమై, చిత్రమై, మకరందనిష్యందతుందిలమై, యతులిత రసప్రవాహభరితమై, మనోజ్ఞముగా నున్నది.

శిల్పికళకు పార్థివపదార్థ సంచయమువలె, కవికి శబ్దసంచయము రసోత్పాదకము. ఒక విషయమును వర్ణించుటకు సామాన్యశబ్దములు సరిపోయినను, నా భావమునే వెలార్చుటకు యమకాది శబ్దాలంకారములు నుపయోగించుటచే కవిత శ్రుతిపర్వమై కవిప్రతిభ నుద్ఘాటించును.

మ. మెగమున్ మైసగమున్ సగౌర నగమున్ మేరూజ్జ్వల జ్ఞాటప
స్నగమున్ మిక్కిలి కన్నుగన్న మెుగమున్ హర్మ్యాయితానేక పా

దగముస్ గొమ్మల జిమ్మ మేల్తురగముస్ యాధోధి రాణ్ని(దితా
శుగముస్ రాజిలు రాజు మాదృశుల కిచ్చున్ శాశ్వతైశ్వర్యముల్.

క. ధీమద్భవాబ్ధి తరణికి
ధామతలత్తగణిక యవితరణికి భవన
గ్రామ గ్రాస గ్రావ
గ్రామ గ్రామణికి భరిత కౌస్తుభమణికిన్.

ఈ కవి శిల్పమున యమకాది శబ్దాలంకారములు ప్రధానోపల ములుగా వర్ణించినవి. కవి అష్టాదశవర్ణన లవకాశమును కలిగించుకొను నట్లే కథాశరీరమును సృష్టించెను,

1. పురవర్ణనము, సంతానవాంఛ, కలలో భగవత్సాక్షాత్కారము.
2. పుత్రజననము, ఆతని పెంపుసొంపు, యువరాజ్యాభిషేకము, ముని సేవ, భోజనము.
3. వేట, వనవిహారము, జలక్రీడ, అవంతీసుందరీసందర్శనము, స్త్రీపురుష విరహము.
4. యుద్ధము.
5. సంధి, వివాహము.

వర్ణనములలో పెద్దనపోలికలు, రాజవాహన శిశుపోషణములో, ముక్కుతిమ్మని ముద్దుపల్కులు, యుద్ధమున పాండురంగని పదగుంభన ముల జాడలు ప్రస్ఫుటముగా గానుపించుచున్నవి.

ఆస్తికుడై నిరంతరము విష్ణువును ధ్యానించు నీకవికి కలియుగమున ప్రత్యక్షదైవమగు వేంకటేశ్వరుడు కన్నుమోడ్చు తరిని కలలో నెదుట ప్రత్యక్షమైన సందర్భవర్ణన మపార రమణీయము.

క. ప్రత్యక్షుండై నాపై
ప్రత్యక్షర హృద్యగద్య పద్యసముద్య
త్కృత్యప్రత్యయ రచనాబ్దా
ప్రత్యక్షపఫణితింబై కృపారసమొల్కన్

నీవు కవిపట్టభద్రుడవు, నీకెవ్వరీడు,

క. కృతిలో బ్రతిపద్య చమ
త్కృతిగలుగగ బలుక నేర్చు కృతినీవు మహా
కృతిమాకొసరుచు భాషా
కృతిభారతి, కాకమాని శ్రీమూర్తికవీ

అనగా

క. ప్రతిపద్య ప్రతివాక్యో
న్నతికావ్యము రాజవాహన విజయమట యీ
కృతికిం బతి శేషాచల
పతియట నేడింతకంటె భాగ్యముగలదే

అని చింతించి శ్రీవేంకటేశ్వరుని యాశీర్వచన ప్రభావమున

చ. పలికినపల్కులెల్ల బరిపాకము దప్పక ఖండశర్కరల్
ఫలములు జున్నులుక్కెరలు పక్వములింక మనోహరంబులై
దలచిన పద్యమంతయు సుధారసమానటు, వేంకటాద్రి రా
ణ్ణిలయుని కింకిటుం గృతిఘటింపక మానుట మాకునేటికిన్.

అని గ్రంథరచనము గడంగెను.

ఈకవిది పండిత వంశము. ముత్తాత, తాతయు నుభయభాషా కవిత్వ తత్త్వనిధులు. ఈతడు కవిపట్టభద్రుడు. ఈతనికవిత్వమున,

చ. చోరున లక్ష్మియా విఖ్యాతిసొంపు, మయూరుని సౌకుమార్యమున్
భారవికాంతి సంపదయు బాణు గుణాఢ్యతర ప్రయోగమా
దారిమురారి కోమలపదంబు ప్రసాదముగల్గునట్లుగా
భారతియిచ్చుగాత! ప్రతిభారతి మత్కృతికిన్ జనుత్కృతిన్.

అని భారతిని ప్రార్థించినందుకీ కావ్యమున నాయా సొంపులు ప్రతిఫలించు ననేకఘట్టములు కానుపించుచునేయున్నవి.

కవి మంగళప్రియుడు, అవంతీ సుందరికిని రాజవాహనునికిని మైదురోజులు యథావిధిగా పెండ్లిజేయించి సంతృప్తిపడెను.

శా. కట్టె న్మంగళసూత్రిమబ్జకుల రాడ్గంధేభమాపూర్ణిమా
నిట్టీ కేందృముఖీ వతంస కలకంఠీ కంఠపీఠిం బికీ
ఘుట్టాకధ్వని పుష్పనామ బిరుదం గుంభాభహారన్ లగ
ద్ఘోట్టాణైకమృగీమదన్ స్మరకరాత్తుగ్రాంబుజ గ్రావికన్.

ఆంధ్రభాషా యావనమ్లేచ్ఛ భాషాలలనామణితో సాహచర్యము గలిగిన నా కాలమున నీకవి మాళవనాథుని రాయబారపు మంత్రులనిట్లు వర్ణించెను.

సీ. ఆగుల్భలలితంపు టంచుదోవతి కావి
దారచిట్టి పింజల కరుణ మెసగ
దళుకొంద నడుదట్టి దారు దన్నెడియింద్ర
గోపంబుపాపోసు లేపు మాప
వలిపంపు టంగిపై వలెవాటు వేసిన
పైఠాణితగటు దుప్పటి నటింప
దుగుపాటిగా వెన్క సిగనిల్పుచుట్టి న
నిడుదయంచపుపాగ నీటుగుల్క

గీ. నుభయ కటముల శ్రీముద్ర లూర్ధ్వపుండ్ర
పంగతాంగార నవయవ క్షారలోహ
తాక్షణ శ్రీలపేజీబు లపుడువచ్చి
రగణితస్థితిసాహేబు నగరికడకు.

మఱియొక ఘట్టమున,

అవంతిమహారాజనయిత్రివచ్చి పుత్రికతో

ఉ. వేయరుదెంచి కాంచి తగవే తగవేగన వచ్చి యొంతసే
పాయె నహాయమే యిది కృపాయతలోచన రాచపట్టికీ
సాయపు టింతి కింపగు నుపాయములే యివి నువర్ణపు
త్రీ యసు తోడుకొంచు జనియున్ సనయం దనయిష్టపుత్రికన్.

అని షమాస్త్రైనింటికి తీసికొనిపోవు నార్యసంప్రదాయం మిందుహృదయంగంజకముగా వర్ణితమైనది. ఈకవి పాకకళా నిపుణుడు. భక్ష్యభోజ్య

క. కృతిలో బ్రతిపద్యమును
తత్కృతిగలుగఁగ బలుక నేర్చు కృతినీవు మహా
కృతి మాకొసరుచు భాషా
కృతిభారవి, కాకమాని శ్రీమూర్తికవీ

అనగా

క. ప్రతిపద్య ప్రతివాక్యో
న్నతికావ్యము రాజవాహన విజయమట యీ
కృతికిం బతి శేషాచల
పతియట నేడింతకంటె భాగ్యముగలదే

అని చింతించి శ్రీవేంకటేశ్వరుని యాశీర్వచన ప్రభావమున

చ. పలికినపల్కులెల్ల బరిపాకము దప్పఁగ ఖండశర్కరల్
ఫలములు జున్నులుక్కెరలు పక్వములింక మనోహరంబులే
దలచిన పద్యమంతయు సుధారసమానట, వేంకటాద్రి రా
ణ్ణిలయుని కింకిటుం గృతిఘటింపక మానుట మాకు నేటికిన్.

అని గ్రంథరచనమును గడంగెను.

ఈకవిది పండిత వంశము. ముత్తాత, తాతయు నుభయభాషా కవిత్వ తత్త్వనిధులు. ఈతడు కవిపట్టభద్రుడు. ఈతనికవిత్వమున,

చ. చోరున లంక్రియా విఖ్యాతిసొంపు, మయూరుని సౌకుమార్యమున్
భారవి కాంతి సంపదయు బాణు గుణాఢ్యతర ప్రయోగమా
దారి మురారి కోమలపదంబు ప్రసాదముగల్గునట్లుగా
భారతియిచ్చుగాత ! ప్రతిభారతి మత్కృతికిన్ జయత్కృతిన్.

అని భారతిని ప్రార్థించినందుకే కావ్యమున నాయా సొంపులు ప్రతిఫలించు ననేకఘట్టములు కానుపించుచునే యున్నవి.

కవి మంగళప్రియుడు, అవంతీ సుందరికిని రాజవాహనునికిని మైదురోజులు యథావిధిగా పెండ్లిజేయించి సంతృప్తిఁ గనెను.

శా. కట్టె న్మ్రోఁగళతూత్రిమజ్జకుల రాడ్గంధేభమాపూర్ణిమా
నిట్టీ కేంద్రిముఖీ వతంస తిలకంఠీ కంఠబీఠిం బికీ
ఘుట్టాకధ్వని పువ్వునామ బిరుదం గుంభాభహీరన్ లగ
ద్ఘోట్టాణైకమృగీమదన్ స్మరకరాక్షుద్రాంబుజ ద్రావికన్.

ఆంధ్రభాషా యోవనమ్లేచ్ఛ భాషాల లనామణితో సాహచర్యము గలిగిన నా కాలమున నీకవి మాళవనాథుని రాయబారపు మంత్రులనిట్లు వర్ణించెను.

సీ. ఆగుల్భలలితంపు టంచుదోవతి కావి
                యరచిట్టి పింజల కరుణ మెసగ
    దళుకొందు నడుదట్టి దొరు దన్నెడియింద్ర
                గోపంబుపాపోసు లేపు మాప
    వలిపంపు టంగిపై వలెవాటు వేసిన
                పైతాణితగటు దుప్పటి నటింప
    దుగుపాటి గావన్నె సిగనిల్పుచుట్టి న
                నిడుదయందపుపాగ నీటుగుల్క

గీ. నుభయ కటముల శ్రీముద్ర లూర్ధ్వపుండ్ర
    పంగతాంగార నవయవ క్షారలోహ
    తాతుణ శ్రీల హేజీబు లపుడువచ్చి
    రగణితస్థితిసాహేబు నగరికడకు.

మఱియొక ఘట్టమున,

    అవంతిమహేశాజనయిత్రి వచ్చి పుత్త్రికతో

ఉ. వేయరుదెంచి కాంచి తగవే తగవేగన వచ్చి యెంతసే
    పాయె నపాయమే యిది కృపాయతలోచన రాచపట్టి కీ
    పాయపు టింతి కింపగు నుపాయములే యివి సువర్ణపు
    త్త్రీ యను తోడుకొంచుఁ జనియెన్ సనయందనయిష్టపుత్త్రికన్.

అని ఘమార్తానింటికి తీసికొనిపోవు నార్యసంప్రదాయం మిందుహృద్య సంజకముగా వర్ణితమైనది. ఈకవి పాకకళా నిపుణుడు. భక్ష్యభోజ్య

చోష్యాది భోజనప్రియుఁడు. ఈతడు రచించిన మూఁడు గ్రంథముల యందును భోజనముచేయు అరిటాకు మొదలుకొని అందువడ్డించు పదార్థములు భోజనానంతర తాంబూలాదుల వఱకును బహువిధముల రుచులూరునట్లు వర్ణించెను.

ఈతడు రచించిన బహుళాశ్వ చరిత్ర మెక్కడను లభింపలేదు. 1715 సంవత్సర ప్రాంతమున రచింపబడిన కూచిమంచి తిమ్మకవి ప్రణీత సర్వలక్షణ సారసంగ్రహంబునను 1790 ప్రాంతమున రచింపబడిన రంగరాట్ఛంద మనబడు లక్షణచూడామణీ గ్రంథమున నుదాహరణ ములుగా గైకొను నాటికి ఆంధ్ర ద్రవిడ దేశములందునున్న బహులాశ్వ చరిత్రము లభింపకుండుట శోచనీయము. శైలిదెలియుటకై సర్వ లక్షణ సారసంగ్రహములో లక్ష్యములుగా గైకొనబడిన నీ దిగువ పద్యము లుదాహరింప బడుచున్నవి.

శా. అంచున్ రాయడివన్నెరాల్ పులుఁగు ఔడాసీనులూ తల్గానం
బంచాస్యంబులుఁగల్గుపాపదొర గ్రామ్యబ్రహ్మచారుల్ దుసా
శించక్ బచ్చన వ్రాతలూడివడుమే లీక్కల్గట్టి మస్యంబు లౌ
చంచద్వాహములుంచు మంటపము పంచంజేరి విశ్రాంతుఁడై.

క. లెక్కలు పెట్టఁగ వచ్చుం
జుక్కలుదద్భక్ష్యభోజ్య చోష్యాదుల క
మ్మక్కమతి లెక్కయెక్కడి
దక్కడి యొక్కొక్కకడి వెయారులు సేయున్.

క. ఆరేసువగల చారుల్
నూరువిధంబుల రసావళుల్ వేయు వహు
ల్గాఱలు బచ్చళ్లుక్షిం
దూఱుంగాయలకు లెక్కయున్ మరి కలదే

ఇట్లు,
నందిరాజు చలపతిరావు.

శ్రీ

పరమాత్మనే నమః.

# రాజవాహనవిజయము

---

## ఇష్టదేవతాస్తవము.

(కాకమానిమూర్తి ప్రణీతము.)



శ్రీ యధరోపరిం గుచ గి
రిం గబరిం దర హాసవీటికా
చ్ఛాయల యింపుసొంపులయి
చందనకుంకుమ పత్త్రరేఖలై
యాయత కుంద చంపకములై
తగఁ గన్గొను వేంకటేశ్వరుం
డా యినగంటిచూడ్కి భుజ
నార్థితమంబు నదల్చుగావుతన్. 1

1. విష్ణుఁడు చంద్రసూర్యలోచనుఁడుగావున నాయన చూడ్కులు(చంద్ర సూర్యాతపములు) లక్ష్మీదేవ్యధర కుచ కబరులయందు వరుసగా దరహాస వీటికా చ్ఛాయలుగను చందన కుంకుమ పత్త్ర రచనలుగను కుంద చంపకములుగను శోభిల్లెననుట.

మ. మెఁగమున్ మైసగమున్ సగౌర నగమున్
మేరూజ్జ్వలజ్జూట ప
న్నగమున్ మిక్కిలి కన్నుఁగన్న మొగమున్
హార్మ్యాశ్రయితా నేక పా
దగమున్ గొమ్ములఁ జిమ్ము మేట్తురఁగమున్
యాదోధిరాణ్ణిద్రితా
శుగమున్ రాజిలురాజు మాదృశుల కి
చ్చున్ శాశ్వతైశ్వర్యముల్. 2

2. అనేకపాద్ + అగము = వటవృక్షము, శివుడు దక్షిణామూర్తిలీలయందు వటవృక్షముక్రింద సనకాది మహాఋషులకుఁ దత్త్వోపదేశముచేసెను. ఆశుగము = బాణము. గాలి త్రిపురసంహారకాలమందు శివునకు విష్ణుబాణమయ్యెను, మెఁగము = మేకము.

ఉ. సుద్దుల కన్నెకన్నుగవ
చొక్కపుఁ జెక్కులు మోవి నొక్క నై
ముద్దిడువేళ మోవికిని
మోవికొఱంతఁ దలంచివేలు పుం
బెద్దకుఁ బంచవక్త్రుఁ గని
పెంచిన మేటికిఁ బంచవక్త్రి వా
దద్దిర ! యంచునవ్వు చతు
రాస్యుఁడు మాకుఁ జిరాయు వీవుతన్. 3

3. శివుఁడు భైరవ లీలయందు బ్రహ్మయొక్క నైదవతలను ద్రుంచి నందున బ్రహ్మ సరస్వతి మొగము ముద్దుబెట్టుకొనునప్పుడా పత్తిని బంచవక్త్రుఁడు (శివుడు) ఒకప్పుడు తన లలాటమునఁబుట్టిన

సంగతిని సరస్వతికిచెప్పి మాటుచున్నాఁడు. పంచవక్త్రి = అయిదు మోములుగలది (విశేషముపాక్కులుగలది. చతురాస్యుఁడు = నాలుగు మోములుగలవాఁడు. చతురమైన వాక్కులుగలవాఁడు.)

సీ. ఇందిరామదిరాక్షి ♦ కీడాపు నీలంపు
మేడచుట్టు ప్రహారి ♦ గోడయనఁగఁ
దనచేతి కెల్లప్పు ♦ డును లోనుగా రమా
తరుణికై చిన వల ♦ త్రాడనంగ
నల మేలుమంగ స ♦ య్యాటంబునకు వైవఁ
దాల్చిన పొగడపూ ♦ దండయనఁగ
మున్నీటి కన్నియన్ ♦ పెన్నిధానంబు దూ
గఁటకు వైచిన యట్టి ♦ గొలుస నంగ
గీ. భరితకౌస్తుభ దినమణి ♦ పరిధి యనఁగఁ
దనుఘనాశ్రిత మఘవ కో ♦ దండమనఁగ
వేంకటాధీశు నురముపై ♦ వినుతిఁగనిన
వైజయంతిక మాకిచ్చు ♦ వైభవములు. 4

4. లక్ష్మికి విష్ణువక్షస్థలము నీలపుమేడగఁ జెప్పఁబడెను. పరిధి= సూర్యచంద్రులచుట్టు కట్టుగడి. విష్ణువు వక్షస్థలమందుండు కౌస్తుభ రత్నమనెడు సూర్యునకు వైజయంతి శామాలిక పరివేషముగనుండెను. కుస్తుభము = సముద్రము. అందుఁబుట్టినది కౌస్తుభము.

ఉ. అచ్చిరకఁ జన్నుద్రావుటకు
నొదల భూత్కృతిఁ జల్లుకొన్న పా
లచ్చుటఁ గ్రొన్నెలందగు సు
ధావళిదెల్పఁగ గౌరితాళి బల్

పచ్చు నిజాననంబు గను
పట్టిన మూర్ఖను దంతియంచుఁ గో
మిచ్చు గజాస్యుఁ డిచ్చు కృతి
కిష్టవచో రచనా చమత్కృతుల్ 5

5. అచ్చికన్ = కొరంతతో, వినాయకునకు శిరస్సునఁ జంద్ర శకలమున్నది. “బాలేందు శకలోత్తంసం వందేహం గణనాయ” కమ్మని యున్నందున నందలియమృతము నెత్తిపైఁజల్లుకొన్న పాలుగఁ జెప్పఁబడెను.

ఉ. చోరు నలంక్రియావిహృతి
సొంపు మయూరిని సౌకుమార్యమున్
భారవి కాంతిసంపదయు
బాణుగుణాఢ్యతర ప్రయోగ మా
దారి మురారికోమల ప
దంబు ప్రసాదముగల్గునట్లుగా
భారతి యిచ్చుఁ గాతఁ బ్రతి
భారతి మత్కృతికిం జమత్కృతిన్. 6

6. చోరుఁడలంకారములు సంగ్రహించుననియు, మయూరిని యందు సౌకుమార్య మున్నదనియు, భారవికిఁ (సూర్యునకు) గాంతి సంపదగలదనియు, బాణమునకు గుణ సంబంధంబును బ్రయోగవైచిత్ర్యంబును గలదనియు, మురారి (విష్ణువు) ఈయునకు పద్ + అంబు= పాదమందలి నీటి స్వచ్ఛత గలదనియు, స్వభావోక్తి గ్రహించుటచేఁ జోరకవికవిత యుపమాద్యలంకారభూయిష్ఠమనియు, మయూర కవికవిత సౌకుమారము అనఁగా మృదుశబ్ద భూయిష్ఠమనియు, భారవికవిత ప్రకాశంబుగలదనియు, బాణ కవిత్వంబు ప్రయోగలక్షణ సమృద్ధిగలదనియు, మురారి కవిత మృదుపదభూయిష్ఠమనియు గ్రహింపవలయును. ప్రతిభ = బుద్ధివిశేషము.

సీ. జలరాశిలంఘనో ♦ జ్జ్వల జవంబున నెవ్వఁ
డలరె మరున్మనో ♦ హరత దోఁప
లంకాహరణవేళ ♦ లలితాత్మ శౌర్యంబు
మున్నెవ్వఁ డకలంక ♦ ముగ ఘటించె
ముద్రిక నిజశిరం ♦ బునఁ దాల్చినాఁ డెవ్వఁ
డిల రామమహిజాని ♦ హితముగాఁగ
లక్ష్మణ ప్రాణాని ♦ లము నిల్పె నెవ్వాఁడు
తనదు గాత్రంబు పా ♦ వనముగాఁగ

గీ. నట్టిరఘురామ సూచనా ♦ హర్షబాష్ప
మోచనాఖండ గండాభి ♦ షేచనాంత
లోచనాంతర రుచిచారు ♦ లోచనాంతుఁ
జంద్రగిరికోట హనుమంతు ♦ సన్నుతింతు. 7

7. మరున్మనోహరత = దేవతల కింపయ్యెననియు తండ్రియగు వాయుదేవుఁడు సంతసించెననియు, అకలంకముగ = నిష్కలంకముగ ననియు, మకరరహితమైన లంకగలదిగఁ జేసెననియు. ఈ యనగాత్రము పవన సంబంధముగానఁ బ్రాణానిలంబు నిల్పెననిభావము. రఘురామ... నాంతు = రాములవారు చేయు సన్నుతులవలననైన యానందబాష్పముల యొక్క విడుచుటచేఁ దెంపులేని గండాభిషేచనంబు అవధిగాఁగల నేత్రంబులలోని కాంతిచే నందమైన కనుగొలుకులుగలవానిని.

సీ. జంభారి దంభోళి ♦ ఝళిపించి నిప్పుకల్
రాల్చిన నొకయీక ♦ రాల్చినాఁడు
జగములెల్ల నడంగఁ ♦ జరియించు నల్లని
మోపవలీలమై ♦ మోచినాఁడు

బరువు తానెఱేఁగిన ♦ శరముచుల్కఁగఁజేసి
మృడునకుఁ బుర జయం ♦ బిచ్చినాఁడు
ద్విరసనాళికివేల్పు ♦ వెరుసూటి సుధనాచి
రెల్లులో నట పార ♦ జల్లినాఁడు
గీ. పక్షమెడలింప మెడఁద్రొక్కి ♦ పట్టనంప
కట్టెపాల్సేయఁ దనుగన్న ♦ యట్టివారి
కపకృతియొనర్పసుమ్ము ♦ కృతాపరాధుఁ
బ్రోవనన్నాఁడె నను నేఁడు ♦ పులుగుఱేఁడు. 8

8. గరుత్మంతుడు నిజాపరాధుల కపకృతిచేయక యుపకారమే చేసెను. అపరాధినైన నన్ను మాత్రము రక్షింపఁడా! ఇంద్రుఁడు రెక్క తెగ వేయవచ్చినను, గాదె వేయులు మెడదొక్కుచుండినను, రుద్రుఁడు బాణముపాలుచేసినను, తనవారికి (ఉరగులకు) దేవతలు అపకృతి చేయుచున్నను, వారికి వరుసగా నొక యీక నేరాల్చెననియుఁ, గ్రిందఁబడవేయక కాద్రవేయులను మోచెననియు, రుద్రునకుఁ ద్రిపురవిజయమిచ్చెననియు దేవతలను సుధ తిరుగఁదీసికొని పోనిచ్చెననియు, నభిప్రాయము.

సీ. బలుదూది నింపని ♦ పరుపు పెంపెవ్వాఁడు
సవరించె వటప్ర ♦ శయనునకును
గదలని విరివి మో ♦ పదిమోచి భారంబు
జవికెనెవ్వాఁడు వి ♦ శ్వంభరునకు
సుత్తెవాటుల వారు ♦ లెత్తనిసొమ్ము సొం
పలరించె నెవ్వాఁడు ♦ సాంబునకును
శిబి ముఖంబున వన్నె ♦ జిగిఁజల్లు విల్లెవ్వఁ
డందిచ్చె రఘురామ ♦ హాతధనునకు

గీ. భాష్య మెవ్వఁ డొనర్చె శ ♦ బ్దంబుకొదువ
ఉడఁచెఁ బాణిని మునికిఁ గా ♦ త్యాయనునకు
జనకము సారస్వతమునాకు ♦ స్వప్నమున నొ
సంగినాఁ డెవ్వఁ డవ్వేల్పు ♦ సన్నుతింతు. 9

9. కదలనివిరివిమోపు = భూమి, జవిక = తేలికపఱిచె. సుత్తె వాటుల వారలెత్తనిసొమ్ము=సుత్తిదెబ్బచేఁ బీటలెత్తనిసొమ్ము శేషాభరణమనుట. శిఖి...విల్లు=మేరువు రామవాతధనుఁడు, శివుఁడు పూర్వమొకప్పుడు వాయువుచే మేరు వెగిరిపోకుండునట్లు శేషుఁడు, వలఁగొని కాపాడినట్లు పురాణగాథ గలదు. కాత్యాయనుఁడు = వరరుచి.

గీ. సూత్రవార్తిక భాష్యముల్ ♦ సొరిదిఁ జేసి
నట్టి పాణినివరానిఁ గా ♦ త్యాయనర్షి
శేషభోగిని సన్నుతుల్ ♦ చేయువాఁడఁ
జతురశబ్ద ప్రయోగ్యతా ♦ సంపదలకు. 10

10. శబ్దప్రయోగ చాతుర్యమునకై పాణిని, కాత్యాయనాదులను స్తుతించుచున్నాఁడు.

ఉ. శ్రీరఘురామ కావ్యకృతి
సిద్ధ విధిజ్ఞుఁ బరాశరాత్మజున్
భారవిఁ గాళిదాసు శివ
భద్రు మురారి మయూరు బిల్హణుం
జోరుని మల్హణాది సుర
సూక్తికవీంద్రులఁ గొల్చి యెంచెదన్
భారత కర్తృతాచరణు
నన్నయఁ దిక్కన నెఱ్ఱనార్యునిన్. 11

11. ప్రతిభా శ్రుతిభాషిత భారతీంద్రిలు = బుద్ధి విశేషమందును, వేదవాక్యములయందును, బ్రహ్మదేవులు, దర్శనము = శాస్త్రము.

చ. పరిబలమతి న్నుతింతుఁ బ్రతి
భా శ్రుతి భాషిత భారతీంద్రిలం
గబళిత సర్వదర్శనులఁ
గావ్యచమత్కృతి కాళిదాసు ల
న్నిబిడ తపోవిలాసులఁ దృ
ణీకృతవాదులఁ గాకమాని రా
మ బుధవిభుం బ్రబోధ సుధి
మత్ప్రపితామహునిం బితామహున్. 12

12. మూర్తికవియొక్క ప్రపితామహుఁడు రామనాథుఁడు, పితామహుఁడు ప్రబోధనాముఁడు.

దుష్టకవి నిందనము

సీ. తన వచోరచన లెం ♦ తయు నెఱింగింపఁడు
తమిని రంధ్రాన్వేష ♦ ణమున కుబ్బు
శబ్దంబు నెరపు నె ♦ చ్చటికిఁ జేరఁగరాఁడు
నలికళానిధి దర్శ ♦ నమున కులుకు
మొదలేరుపడఁ బాద ♦ ములు ప్రయోగింపఁడు
కులదీపకాసహ్య ♦ గుణములెంచు
బోధ దూరులయిండ్ల ♦ భూషణంబులుదాల్చు
సరస విద్యవిచార ♦ గరిమఁ జనఁడు

సీ. పరవినీత ప్రబంధ కూల్ ♦ భంగపఱుప
మొఱసి ప్రాసంబు చేతనే ♦ మోసపోవు
సాధుజనసూచిత పదార్థ ♦ చౌర్యరతుఁడు
మైత్రికి సమైత్రికిని ధాత్రిఁ ♦ బాత్రమగుచు. 13

13. సుకవికిని దొంగవానికిని అభేద్యము. ఎఱింగింపఁడు = శబ్ద రచన తెలియకుండునట్లు చేయును, చోరుఁడు నిశ్శబ్దముగనుండును. తమిని = కోరికతో, రంధ్రాన్వేషణము=లోపములు వెదకుట, రాత్రియందు కంతలు వెదకుట, శబ్దంబు = మాట, ధ్వని, కళానిధి=పండితుడు చంద్రుడు, దర్శనము = శాస్త్రము, చూడ్కి, మొదలేఱుపడ పాదంబులు పరిమాగింపఁడు=పద్యపాదములు సరిగానుంచఁబడవు. ముంగాళ్ళమీఁద నడచును. కులదీపకుల నసహ్యించుకొనును=దీపములుచూడ నిష్టపడఁడు. తెలివిలేనివారికడ నలంకార సత్కారమును బొందును. మెలకువ గనివారి యిండ్లసొమ్ములు దోఁచును. రసము = గుణము (శృంగారాదులు), ప్రేమ ప్రబంధములు=గ్రంథములు, కట్లు, ప్రాసము=పద్య పాద ద్వితీయాక్షరము, ఈటె. పదార్థంబులు = పదములు, అర్థములు ద్రవ్యములు.

వ. అని యిష్టదేవతా వందనంబును, శిష్టకవిజనాభినందనంబును, దుష్టకవి నిందనంబునుం గావించి యొక్క కావ్యకథనంబునకు గ్రథనంబుసమకట్టియున్న సమయంబున 14

14. గ్రథనంబు = కూర్పుట.

సీ. తన తనూరుచిపైనిఁ ♦ దగ నుల్లసిలు గుల్ల
కావినాఁ గన కాంశు ♦ కంబు దనరఁ
గరముల శంఖచ ♦ క్రింబులు భుజముల
బ్రాలిన హంస చ ♦ క్రములఁ దెలుప

మును మ్రింగిన దవాగ్ని ♦ నన వచ్చెనా నురోం
గణమునఁ గౌస్తుభ ♦ మణి వెలుంగ
నలిక పత్రాంత్యద్వ ♦ య లిఖితశ్రీల క్రిం
దటి పూలన శ్రుతికుం ♦ డలము లమరఁ
గీ. జల్లచూపుల కాంతా మ ♦ తల్లి నాదు
తల్లి యలమేలుమంగ కై ♦ దండఁ గొనుచు
బన్నగ నగాధ్యుఁ డేనింత ♦ కన్నుమోడ్చు
తరినిఁ గలలోన నెదుటఁ బ్ర ♦ త్యక్షమయ్యె. 15

15. గల్లకావి = నీరుకావి, అంశుకంబు = వస్త్రము, విష్ణువు కృష్ణావతారమునఁ గాలుచిచ్చుమింగెను. నన = చిగురు, యిట పత్రి కాంత్యఁబులకెఁటుకు వ్రాసిన శ్రీకారంబులు చెవులక్రిందనున్న పూలవలె గుండలంబు లుండును.

క. ప్రత్యక్షంబై నాపైఁ
బ్రత్యక్షర హృద్యగద్య ♦ పద్య సముద్య
త్కృత్య క్షయ రచనాబ్దా
ప్రత్యక్షమ ఫణితిఁ బైఁ గృ ♦ పారస మొల్కన్. 16

16. అబ్ద, అప్రతి, అక్షమ, ఫణితిన్ = మేఘముయొక్క అసమానమును, సహింపరానిదియు నైన ధ్వనితో.

సీ. గుణధన్యు గౌండిన్య ♦ గోత్రు నాపస్తంబ
సూత్రుని వెలనాటి ♦ గోత్రచరితుఁ
గాకమానీమహా ♦ గ్రామాబ్జ మిత్రుఁ బె
న్నేకుల వార్ధి తా ♦ రా కళత్రు

సరస విద్వత్కవి ♦ సార్వభౌముని రామ
బుధ సంభవునకుఁ బ్ర ♦ బోధ సుధికిఁ
బౌత్రుని పినరామ ♦ భద్రాగ్ర జన్ముఁడై
నట్టి శ్రీరామ లిం ♦ గాఖ్యుఁ దిమ్మ
గీ. మాంబికకుఁ బుత్త్రి సూర్య నా ♦ రాయణ ద్వ
యైక సహజన్ము నుభయ భా ♦ షా కవిత్వ
తత్త్వనిధి నన్ను మూర్తి వి ♦ ద్వత్కవీంద్రు
హర్షమునఁజూచి యిట్లని ♦ యానతిచ్చె 17

17. కాకమాని గ్రామమున ప్రఖ్యాతుఁడగు మూర్తికవి వంశ
వర్ణనము.

గీ. అనఘమణి కాకమాని రా ♦ మాహ్వయుండు
నీకు ముత్తాత, యుభయ భా ♦ షాకవిత్వ
తత్త్వనిధి ప్రబోధుండు పి ♦ తామహుఁడిఁక
నీవు కవిపట్టభద్రుండ ♦ వెవ్వరీడు. 18

18. అనఘమణి = నిర్దోషులలో శ్రేష్ఠుడు.

క. కృతిలోఁ బ్రతిపద్యచమ
త్కృతి గలుగఁగఁ బలుకనేర్తు ♦ కృతినీవు మహా
కృతి మాకొనరుచు భాషా
కృతి భారవి కాకమాని ♦ శ్రీమూర్తికవీ ! 19

19. కృతి = కవిత్వంబు నొనర్చుట, విద్వాంసుఁడు, అంకిత
మిచ్చుట. భాషాకృతి = వాగ్దేవతా స్వరూపుఁడా, భారవి- కాంతికి
సూర్యుఁడా.

క. అనినం బరమానందం
బనువొందఁగ శ్రీనిధాన ♦ మబ్బె నటంచుం
గను దెఱచి యితరులకు బ్రమొ
క్కను వెఱచి మురారి చరణ ♦ ఘటితాత్ముఁడనై. 20

20. అనిన ......శ్రీనిధానము = ఐశ్వర్యప్రుఁబాఁతు = శ్రీకివాసమైనవాఁడు వేంకటేశ్వరుఁడు.

క. ప్రతిపద్యప్రతి వాక్యో
న్నతికావ్యము రాజవాహన ♦ విజయమఁట యీ
కృతికిం బతి శేషాచల
పతియఁట నేడింతకంటె ♦ భాగ్యముగలదే. 21

21. ప్రతిపద్యప్రతి వాక్యోన్నతి = ప్రతిపద్యమునందును బ్రతివాక్యమునందును ఔన్నత్యముగలది = ఇది కావ్యవిశేషణము.

శా. వ్యాళస్వాంతు లశాంతు లజ్ఞసతతై
కాంతుల్ మహాచేటికా
శ్రీభోపద్రవ నవ్య పత్రికులు భూ
రి ప్రాజ్ఞ విజ్ఞాపనా
వేళాకల్పిత రక్తవస్త్రులు కళా
విజ్ఞాన నిర్భాగ్యు లీ
కాళత్స్నాతల నేతలం బొగడుటల్
కష్టంబు లర్థార్థికిన్. 22

22. వ్యాళస్వాంతులు = వ్యాళము = వ్యాఘ్రము దాని మనస్సువంటి మనస్సుగలవారు = ఇందువలనఁ బైకి గోవువలెనుండి

పులివలె హానిచేయువారనుట. మఱియొకటి = వ్యాళమనఁగా సర్పము దానివలె కుటిలవర్తనగల వారనియుఁజెప్పఁదగు, ఇదికాలక్ష్మాతల నేతలకు విశేషణము. క్ష్మాతలనేతలు - రాజులు - నేత్రశబ్దమునకు నేతృలు. నేతలు అనిరూపద్వయము - అజ్ఞులు = తెలియనివారు = (అపండితులు) వారితోఁగతతైకాంతులు = ఎడతెగని రహస్యాలోచన గలవారు మహా... కులు. గొప్పలైనట్టియు, చేటికానీకములై యైశ్వర్యముల నపహరించునవియైన యుపద్రవములు గలవియునైన కొత్తజాబులు గలవారు.

క. అవనీశ పిశాచస్తుతిఁ
దవులుటగాదెవ్వియిష్ట ♦ దైవమటంచున్
వివరించి "నదైవంకే
శవాత్పర" మ్మను వచనము ♦ సత్యంబగుటన్. 23

23. అవనీశ... పిశాచములు - వ్యు. పిశితమును భక్షించునవి. ఇది పృషోదరాదులలోనిది. "నదైవంకేశవాత్పరం" - కేశవునికంటె నన్యం బగు దైవములేదు. ఈ వచనము మునులొకప్పుడు వ్యాసునిఁగూర్చి ఒకచోట విష్ణువని మఱియొకచోట బ్రహ్మయని యింకొకచోట శక్తియని వేరొకచోట శివుఁడని, యిట్లు నానావిధముల వచింతువు గాన నీమాటనమ్మ వీలులేదనియు నీవు ప్రమాణముమీఁదఁ బలికినం గాని యంతకు నమ్మఁజాలమనియనఁగా వ్యాసుఁడెప్పుడాలాగుననే ప్రమాణముచేసి చెప్పెదననివారిందోడుకొని కాశీవిశ్వేశ్వరస్వామివారి యెదుటికివచ్చి రెండుభుజములుమీఁదికెత్తి పైనవ్రాసిన వచనమును సత్యమని వచించెను.

సీ. ఏదేవు కనుదోయి ♦ హిమధామ సోదరీ
కుటికా కవాటంబు ♦ కుంచెకోల
యేదేవు చరణాబ్జ ♦ మిందిరాపుత్త్రికా
కాకోదరాంగ ♦ దకూడుదంబు

ఏదేవు చేకత్తి ♦ ఋభురాజపౌత్రు భా
మకుఁ జల్లచేతుల ♦ మంత్రసాని
యేదేవు నాభి పూ ♦ వెగురు జేజేబున్వ
కొన్వెద్దఁగలయయ్య ♦ కవ్వగాడు
గీ. సేవ కేదేవుఁడొందె న ♦ ర్చావతార
మట్టి శ్రీ వేంకటాచలా ♦ ధ్యక్షునకును
బరమమూర్తికి మామక ♦ భవ్యకావ్య
కన్య కళ్యాణమొనరింతు ♦ గౌరవమున. 24

24. ఏదేవు... విష్ణునేత్రద్వయము చంద్రసూర్యులగుటచే లక్ష్మికుటీరపుఁదలుపునకుఁ గుంచెకోలగఁ జెప్పఁబడె. లక్ష్మికుటీరము ఇయ్యది విష్ణుదృష్టి ప్రసరణముచే ముకుళించుచు వికసించుచు నుండుననుట. కొందఱు మురారికవి మురారి దృష్టి ప్రసరణచేఁ దన్నాభికమలము దృష్టిప్రసరణ సమకాల వ్యాప్తింజేసి ముకుళన వికసన వ్యాపారాశ్రయంబగుటచేఁ దానికి గంబుసన్నిభత్వము సంపాదించెను. గావఁ దత్కుటీర కవాట కూరవాకిలిగ నుండుననియుఁ గుంచెకోలతో నిమిత్తములేదనియు మఱి కొందఱు కుడికన్ను మూసి యెడమ కంటను నెడమ కన్నుమూసి కుడికంటను జూచుచుండుం గానఁ గుంచెకోల యనగత్యము కాదనియుఁ జెప్పుచుండిరి. విష్ణువు విశ్వరూపుఁడుగాన విశ్వప్రత్యక్ష ప్రమాణముబట్టి భద్రసూర్యగతి కాల భేదముచేఁ బద్మము ముకుళించుటయు, వికసించుటయుఁ గలుగుచున్నది గావునఁ గుంచెకోల యనుట యవసరమనియే నా యభిప్రాయము. విష్ణుపదమున గంగ పుట్టినదనియు దానికి శివుఁడు మగండనియు నుండు గాథనుబట్టి విష్ణుపదాబ్జము శివునకు సాలంకృతకన్యాదాతగా నభి వర్ణించినాడు. కూఁకుదము = సాలంకృతకన్యాదాత. ఇందిరాపుత్రిక = గంగ. ఇందుఁగన కర్జునుఁడు పుత్రుఁడనియుంటచే నభిమన్యుఁడు పౌత్రుఁ డు వానిభార్య యుత్తర; ఈ మెగర్భిణిగనుండుతఱి యశ్వత్థామ ప్రయో గించిన పాండవనిర్మూలనాస్త్రము తద్గర్భస్థుఁడయిన శిశువును వేధించు

మండఁగా విష్ణువు కాపాడెను. అందుచే నాయన చేకత్తి చల్లచేతుల మంత్రసాని. విష్ణు నాభికమలంబున బ్రహ్మయు బ్రహ్మలలాటంబున రుద్రుఁడును పుట్టినందున నది శివున కవ్వగారు. జేజేబువ్వ క్రొవ్వెద గలయయ్య = చంద్రుఁడు జుట్టునగల దేవుఁడు (శివుఁడు)

ఉ. ఈక్షితిమున్న సత్కవు ల
నేకులు హా కవితా లతాంగులన్
లక్షలొసంగి యున్కి యధు
నాతన కావ్య వధూటి వెంకటా
ధ్యక్షుఁడు పాటిసేయఁడు గ
దా! యన నేటికి నెట్టివాఁడికిం
బక్షము పిన్న భార్యపయిఁ
బాయక యుండుట యొంత యొంతయున్ 25

25. అధునాతన = ఇప్పటి.

ఉ. చెప్పిన పద్యమెల్లఁ జెవిఁ
జేర్చివిను న్వినడొంకు గల్గినం
దప్పులు గిప్పలెన్నఁ డొక
నాఁడును నాఁడును నేఁడు వేడుచో
నప్పని నెట్టిపోఁ డఁడగి
నన్ని వరాలిడుఁ గొండమీఁది తి
మ్మప్పని వంటి కావ్యపతి
యబ్బుట యబ్బుర మిబ్బుధాళికిన్. 26

26. డొంకు = సంశయము. నెట్టిపోవు = త్రోసిపుచ్చిపోవు. తిమ్మప్ప = తిమ్మ, అప్ప = అందమయిన యయ్య.

చ. పలికిన పల్కులెల్లఁ బరి
పాకము దప్పఁగ ఖండశర్కరల్
ఫలములు జున్ను లుక్కగలు
పక్వము లింక మనోహరంబు తే
దలఁచిన పద్యమంతయు సు
ధారసమానఁట వెంకటాద్రిరా
ణ్ణిలయుని కింకిటుం గృతి ఘ
టింపక మానుట మాకు నేటికిన్. 27

27. పరిపాకము = అంతటుపక్వమగుట.

వ. అట్టి చుట్టుకైదువ జగజెట్టికి విడిదిపట్టయిన పెట్టబెట్టు దిట్టగట్టు కట్టుముట్టు దిట్టతనం బెట్టిదనన.

28. చుట్టుకైదువ జగజెట్టి = చక్రాయుధంబుగల మహాశూరుఁడు. పెట్టబెట్టు దిట్టగట్టు = శేషాద్రి. కట్టుముట్టు = కనుదృష్టమయిన.

సీ. శ్రీఖండ నగ పటీ ♦ రాఖండ సౌరభ
వ్రజదాయి యేగట్టు ♦ వంటచెఱకు
నాసత్య సుఖవర్తి ♦ నాసత్య భైషజ్య
జీవాతు వేగట్టు ♦ చేను చెట్టు
రమణీయతర శచీ ♦ రమణి రమణమణి
కుట్టాక మేగట్టు ♦ చుట్టుజాయి
ధూర్జటి స్ఫుటజటాం ♦ తర్జటీవాటి సిం
ధు స్పర్ధి యేగట్టు ♦ దొానల నీరు

గీ. వ్యాస వాల్మీక శాండిల్య ♦ వాలఖిల్య
కౌశికులకెల్ల మంత్రోప ♦ దేశకర్త
లరయ నేశైలమున నుండు ♦ లనగ దనరు
నట్టి వేంకటగిరికొని ♦ యాడ దగదె. 29

29. శ్రీఖండ నగపటీ రాఖండ సౌరభ వ్రజము = మలయాద్రి యందలి చందనంబునకుఁ బూర్ణమయిన పరిమళ సమూహము. నాసత్య... జీవాతువు = దేవవైద్యులయొక్క సుఖప్రవర్తనచే యథార్థమయిన వైద్యమునకు జీవనౌషధము. రమ... కుట్టాకము = మిక్కిలి మనోహరమయినట్టియు శచీకాంతాప్రియుఁడగు నింద్రునివంటి అనగా నింద్రునివలె నల్లనయిన మణులకు భేదకములు. ధూర్జటి... స్పర్ధి = శివుని స్ఫుటమగు జడలలోని జడలపంక్తియందున్న యేటితో స్పర్ధచేయునది. ఊఁకుట్లు = ఊనుకులు (ఊనికిపట్లు)

ఉ. సంకలి తాంబు తామరస
సాను గభీర కుమార దారికా
భ్రంకష నిమ్న శంక ఝుర
పాప వినాశన తీర్థసేవనా
ధ్యంకరణత్మ భూభువన
యావత కల్ప రసాల కేళి డో
లాంకట సద్విశంకటత
శైలము వేంకటశైలమొప్పగున్. 30

30. సంకలిత... దండాన్వయము. ఒప్పినయుదకమును బద్మములును గలదియును. చరియలయందలి లోతయిన చిన్నదోనలనుండి వెలువడి యాకసమునొరసెడు తేటయయిన ప్రవాహములు గలదియుఁ, బాపమును బోగొట్టునదియునైన, పుణ్యస్థలములను సేవించుటచే సంపన్న

కాంద్రఁగా జేయఁబడిన సత్యలోకస్త్రీ సంఘముచేఁ గల్పింపఁబడిన చెట్లయందలి తూగుటుయ్యెలలయొక్క గుఱుతులై యొప్పుచుండెడు కడుదాపుననున్న యేలకు తీగెలు గలది. ఇది వేంకటశైలమునకు విశేషణము.

సీ. ఏచెట్టు చూచిన ♦ హిత గంధ చందనం
బేరాలుగనుఁగొన్న ♦ నింద్రనీలము లై
యేజంతు వీక్షింప ♦ మృగనాభి మృగరాజ
మేదానఁగన్న గం ♦ గోదకంబై
యేతీర్థ మరసిన ♦ వృజిన ద్రుమ కుఠార
మేచట్టియను గన ♦ హీరము గనె
యేమండపముఁజూడ ♦ వామాచ గోపమం
బేబుషి దర్శింప ♦ భృగు నిభుండై
గీ. భోగములకండ యలవేల్పు ♦ బువ్వ దండ
పతితులకుబొండ పేదల ♦ పైఁడికుండ
తమము రేయెండ విబుధామృ ♦ తంపుటుండ
కొండమాత్రంబె తిమ్మప్పఁ ♦ దుండుకొండ. 31

31. ఏచెట్టు ... భోగములకండ = భోగముల కాస్పదము. అలవేల్పుబువ్వ దండ = చంద్రునకు సమీపము. పతితులకుబొండ = పాపాత్ములకు సంకెల. పేదలపైడికుండ = బీదలకు బంగారుతో నింపిన కడవ. తమము రేయెండ = అజ్ఞానమనెడి చీకటికి వెన్నెల. ఇటఁ దనమూ శ్లిష్టరూపకము. విబుధామృతంపుటుండ = పండితుల కమృత ఘుటిక. తిమ్మప్పఁడు=అందమయిన దేవుఁడు.

సీ. తన పైడిగోపురం ♦ బనుపిన సేవార్థి
గడికి సుమేరు శం ♦ కాప్రదంబు

తన బలిపీఠ మా ♦ ర్ద్రి దుకూల పతితాంధ
బధిర వంధ్యా పంగు ♦ పరివృతంబు
తన మహానసము నూ ♦ తన ఘృతాత్తాలంబ
సౌరభ్యవాసి తా ♦ శావలయము
తన గర్భగృహము చం ♦ దన చంద్ర సాంకవ
కుంకుమ మృగనాభి ♦ పంకిలంబు
గీ. గాన నేదేవళంబువేం ♦ కట నగమున
వెలయఁ గనుపట్టునట్టి కో ♦ నెల వసించు
దేవుఁ డలమేలుమంగా మ ♦ నోవిభుండు
దొలఁచు జన్మాంతరానంత ♦ దుష్కృతములు, 32

32. చంద్రి=కర్పూరము. సాంకవము = పునుఁగు.

క. అప్పప్ప చూడవలదా
యప్పని కోనెల పటీర ♦ హైమ జలంబుల్
కప్పురము పునుఁగు మృగమద
మెప్పట్టున తావిగల్గు ♦ భృగు దివసమునన్. 33

33. అప్పప్ప=ఆశ్చర్యవాచకము. భృగుదివసము = శుక్రవారము

సీ. జన్మజన్మార్జిత ♦ చటుల పంకంబు గో
రాడఁడేవృషభాచ ♦ లాగ్రవాసి
పక్షంబున దరిద్ర ♦ భావాహి ద్రుంపఁడే,
గరుడ వసుంధరా ♦ ధర విహారి
యౌషధాసాధ్య వా ♦ తాది రోగంబులఁ
దూలింపఁడే శేష ♦ శైలభర్త

భూతాది శంకా ని ♦ రాతంక గహనంబు,
హరియింపఁడే వేంక ♦ టాద్రి నాథుఁ
గీ. డమృతనిధిఁ జూపఁడే యంజ ♦ నాగ విభుఁడు
భద్రమూర్తి యమృతహారి ♦ భవ్యకీర్తి
చక్రి శుచినామధేయుండు ♦ జడ మరీచి
కంకణముగట్టినాఁడు ర ♦ క్షణము కొఱకు. 34

34. తిరుమలకొండకుఁ బర్యాయములు, వృషభాచలము, గరుడాచలము, శేషాచలము, వేంకటాచలము, అంజనాచలము. ఈయైదింటికి నైదుశక్తులుగలవు. అవేవన, వృషభమునకుఁ బంకంబుగోరాడుట, గరుడునకుఁ ద్రుంచుట, శేషునకు వాతాదిరోగంబులహరించుట, వేంకటునకు భూతప్రేతాది భయ నివారకత్వము, అంజనమునకు నిధులఁగనుఁ బఱచుట. పంకంబు=పాపంబులనెడు బురద. శ్లిష్టరూపకము, వాతము=గాలియను వాతరోగము, శ్లిష్టరూపకము. అమృతనిధి = మోక్షమనెడు నిక్షేపము, భద్రమూర్తి = మంగళస్వరూపుడు. వృషభరూపుడు = త్రిపురసంహార కాలంబున భూరథంబు దించుకొని పోవుచుండ వృషభమయి మోచెననియుంగలదు. అమృతహారి = గరుడస్వరూప బోధకము. భవ్యకీర్తి = అసాధ్య వాతాది రోగహరణ జన్యమయిన యశస్సు కలవాడని. చక్రి=శుచినామధేయుఁడు. ఇదిభూతాది శంకాగహనచ్ఛేదన దహనసూచక విశేషణము. జడమరీచి= ఇది అంజనాభి వ్యంజకము.

సీ. అఱుగునోయనక క ♦ ట్టానియొంట్లడిమోఁగాఁ
జేరెఁడు బియ్యాల♦ జియ్యచెలియ
సమయునోయనక కాం ♦ చనశాటిఁగి ట్టెఁగాఁ
శోమని పళ్ళెల ♦ దొర లతాంగి
ధనమెంత దఱుగునో ♦ యనఁ డింతవెచ్చమా
వడ్డికాసుల వెర ♦ వడికిఁ గలికి

కానుక సొమ్ము లోఁ ♦ గలఁ డన్నిఁట శిఖిగో
యామటమోటు క్రొముక్కు ♦ లయ్యె యబల
గీ. యనుచు నగి క్రొముక్కునురు వేంక ♦ టాధినాథు
నక్కడికి నల్లుహారిదమ ♦ యన్నుమగని
చక్రికుధరోత్తమము నడు ♦ చక్కికెక్కి
చక్క ముక్కోటి కరుదెంచు ♦ సౌరసతులు. 35

35. కట్టాణిమొంట్లు = మౌక్తిక విశేషములతోఁ గట్టినచౌకట్లు. చేర...జిహ్య-ఆదిభిక్షువు (శివుఁడు) పార్వతి హిమవత్పుత్త్రిగాన నా తండు రత్నపుగనియని యెఱుంగునది. తోమనిపళ్లెలదొర = అగ్నిహోత్రుఁడు. అనగా స్రుక్స్రువాజ్య శరావములు (అగ్నికార్య పరికరములు) అవిదారు వృద్ధికారంబులగుటచేఁ దోమఁబడవు. అగ్నిహుతుఁడుగాన సువర్ణ కాట్యుత్పాదకుఁడని భావము. వీని లతాంగి = స్వాహాదేవి. ఇందయనును = పుచ్చుకొమ్మనును. వడ్డికాసులుగొనువాఁడు = కుబేరుఁడు. ధనపతిగనుక ఋణప్రదాతయై వడ్డి తీసుకొనునని భావము కుబేరుభార్య చిత్రరేఖ. కానుకసొమ్ము లోఁగలఁడు = కానుకలుగా వచ్చు పదార్థములు లోపలఁగలిగి యున్నాఁడు. అవిబహిః ప్రకాశములుగాక యుండెను. అన్నిట క్రొముక్కులయ్యె యబల = సూర్యు భార్యయగు ఛాయాదేవిగయందామోపద్రవ్యముంచుచుండెనని భావము పుష్పములకు సూర్యుడధిదేవతయని తెలియవలెను. చక్రికుధరోత్తమము శేషాచలము.

సీ. ప్రజలఁ గానని వాని ♦ పాయసంబను సుద్ది
తునుమవా దృష్టియం ♦ ధునకు నిచ్చి
గొడ్రాలెఱుంగునే ♦ బిడ్డకుట్టనుట మా
న్పింపవా వంధ్యకు ♦ నిసువొసంగి
తూలింపవా యెద్దుఁ ♦ ద్రోచిన పిచ్చుగుం
టను పల్కు పరువు మం ♦ గునకు నొసఁగి

పాపవా చెవిటికిఁ ♦ బట్టిన సంకను
నానుడి బధిరు వి ♦ నంగఁజేసి
గీ. యనుచుఁ జను వేంకటాచలా ♦ ధ్యక్షు జలరు
హాక్షు లక్ష్మీ విశుద్ధ శు ♦ ద్ధాంత వక్షు
బ్రహ్మతిరునాళ్ళ కరుదెంచి ♦ ఫలముఁ గాంచి
కటక కళ్యాణ ఢిల్లీ ని ♦ కట జనంబు. 36

36. ఈ పద్యమందు నాల్గుపాదములలో లోకోక్తులు చెప్పఁబడ్డవి. ఏవిషయమును బట్టియనఁగా వేంకటేశ్వరుఁడు గుడ్డివాండ్రకుఁ గనులు, బిడ్డలులేనిస్త్రీలకు బిడ్డలను, కుంటివానికిఁ బరువెత్తుశక్తి, బధిరునకు వినుశక్తి కల్గఁజేయుననుట. ఇంతియేకాదు ఎవ్వరేకోరికలు గోరి ముడుపులుఁగట్టినను వారికార్యసిద్ధులు చేయుచున్నాఁడని తెలియవలయు.

సీ. ఎటువంటిదో చూడ ♦ మెట మంచిగందంబు
జిడ్డంచుఁ గౌఁగిటఁ ♦ జేర్చి చేర్చి
కనమెన్నఁ డిదిగదా ♦ యనుచుఁ గన్నులఁ గది
యఁగ బారిజాతంబు ♦ నత్తి యత్తి
తలఁపు కెంపిటువంటి ♦ దా యంచుఁ దుఱుమునఁ
గొనఁ జుట్టునను మేనఁ ♦ గూర్చి కూర్చి
వినువాఁక యిదిగదా ♦ యనుచు నాకాశ గం
గా వారి నంగముల్ ♦ గడిగి కడిగి
గీ. శేషగిరిఁ జేరి యారామ ♦ సీమఁ గోరి
శైత్యకృత్యంబు నిత్యంబు ♦ సల్పి వేంక
టేశ వైశాఖ తీర్థ ని ♦ రీక్ష కరుగు
దెంచు నాసేతు కాశి తై ♦ ర్థిక జనంబు. 37

37. ఎటువంటిదో. తలఁపుకెంపు = చింతామణి. వినువాఁక = ఆకాశప్రవాహము. ఆసేతుకాశి = సేతువుమొదలుకొని కాశిపర్యంతము. తైర్థికులు = తీర్థయాత్రచేయువారు.

సీ. కొడుకు మన్మథుఁ డాఁడుఁ ♦ బడుచు భాగీరథి
ఇల్లాలు భూకాంత ♦ యిల్లు కొండ
యన్న దా బలభద్రుఁ ♦ డగ్రసూనుఁడు బ్రహ్మ
కోడలు శారద ♦ కొలములోన
మఱఁది కల్వలఱేఁడు ♦ మామ సముద్రుండు
మఱియును రెండవ ♦ మామ భోజుఁ
డలరు పేరెద సొమ్ము ♦ వెలలేని మాణిక్య
మచ్చబంగారు పై ♦ పచ్చడంబు

గీ. నన్న వెచ్చంబు ముక్కంటి ♦ కెన్న సరివి
జగము లీరేడు గర్భవా ♦ సమున నిముడు
సిరి యొడయఁ డెంత సంసారి ♦ శేష శైల
వల్లభుని వాటి దాత దై ♦ వంబు గలఁడె. 38

38. కొడుకుమన్మథుఁడు = ఈపద్యమునందు వెంకటేశ్వరుని పుత్త్రి కళత్ర మిత్రాది సమృద్ధి వివరింపఁబడుచున్నది. శారద = సరస్వతి = శరదృతువునందుఁబూజింపఁబడునది. పేరెద = విశాలవక్షము. అచ్చ = స్వచ్ఛమైన. అన్నవెచ్చము = భిక్షాప్రదానము. (మానుకరము) ఈరేడు = చతుర్దశ. (ఇఱుఏడు) పదునాలుగు

షష్ఠ్యంతములు.

క. ఏవం విధ గుణ నిధికిన్
భావ న్నిధనాశ ధామ ♦ ధామ దవీయో
దేవానాంప్రియ దానవ
భావానా ద్యపమోద ♦ పాథో నిధికిన్. 39

39. ఏవంవిధ...ధావన్నిధికిన్. ధావన్నిధనాశ=పోవుచున్న మరణాశగలవారును. అనఁగా ప్రాణాశగలవారును. ధామధామ=తేజోనిధియగుసూర్యునకు, దవీయః=దూరస్థులును. అనఁగా యుద్ధభీరువులకు సూర్యుఁడు దూరమైయుండువనుట శ్లో॥ ద్వావిమౌపురుషౌలోకే సూర్యమండలభేదినౌ। పరివ్రాడ్యోగయుక్తశ్చ రణేచాభిముఖోహతః॥ యనియున్నది. దేవానాంప్రియ=మూర్ఖులును (అయిన) దానవ=రాక్షసులకు. అనాది=క్రొత్తయగు. అప్రమోదపాథోనిధికిన్ = దుఃఖవార్ధియైనవానికిన్.

క. "శరణాగతరక్షామణి"
బిరుదాంగద వామ పద ♦ బిసరుహ నఖ రో
త్కర చంద్రాతప లహరి
స్మరణా హత సాధు హృదయ ♦ సంతాపు నకున్. 40

40. శరణా...సంతాపునకున్=దండాన్వయము. శరణాగత రక్షామణియనెడు బిరుదుగలిగిన కడియముగల తమ్మివంటి యెడమకాలి గోళ్లవరుసయనెడు వెన్నెలవెల్లువను స్మరించుటచే బాగుగాఁగొట్టఁబడిన సాధుజనుల సంతాపముగలవానికి.

క. అం గామిత శృంగార త
రం గాంచిత విజిత కోటి ♦ రతిపతి కలమే
ల్మం గాళి కళింగావళి
భం గాకర వేణిలోల ♦ పాణి విభృతికిన్. 41

41 అంగ...పతికిన్ = అంగ=అవయవములయొక్క, అమిత మితములేని, శృంగారతరంగ = సౌకుమార్యపరంపరలయొక్క అంచిత= ఒప్పిదముచే విజిత=జయింపఁబడ్డ, కోటిరతిపతికిన్ = అనేక మన్మధులు గలవానికి. అలమే...విభృతికిన. అలమేల్మంగా = అలమేలుమంగా

దేని యొక్క, అళి = తుమ్మెదలయు, కళిందకళి = కూకటిమూగ యనెడు నల్లపిట్టల వరుసలయు, భంగ = అపాయమునకు. ఆకర = స్థానమైన దనఁగా వానిని గెల్చునట్టి నైల్యముగలది యని. ఇది అలమేలుమంగ జడకు విశేషణము. వేణి = జడయందు. లోల = ఆసక్తమైన పాణివిహృతికిన్ = హస్తప్రచారము గలవానికి.

క. ధీమద్భవాబ్ధి తరణికి
ధామతలత్రగణికి యవి ♦ తరణికిఁ భవన
గ్రామగ్రాస గ్రావ
గ్రామ గ్రామణికి భరిత ♦ కౌస్తుభ మణికిన్. 42

42. ధీమ...తరణి = తెప్ప, ధామతలత్రణికి = శుభము లిచ్చువానికి. పవన గ్రామ గ్రాస గ్రావ గ్రామ గ్రామణికి = 6 పదములకు వరుసగా, వాయు సమూహమే గ్రాసముగా గలవాఁడు (శేషుఁడు) తత్సంజ్ఞికమైన పర్వతమందలి గ్రామమునకు అధికారికి.

క. జటి ధూర్జటి భరణ విశం
కట మతికిం దృటిత చటుల ♦ కర టీశ్వర సం
కట గతికిన్ మా తిరువేం
కటపతికిన్ దళిత దైత్య ♦ కంకట తతికిన్. 43

43. జటి...గతికిన్. జటిధూర్జటి = యోగీశ్వరులను. భరణ రక్షించుటయందు, విశంకటమతికి-సమీపమగు బుద్ధిగలవానికి, తృటి... గతికిన్, తృటిత = ఖండించినట్టియు, చటుల = తీవ్రములైనట్టి. కరటీశ్వర సంకట గతికిన్ = గజేంద్రుని బాధావస్థలుగల వానికిన్. అనఁగా మకరిని జంపి కరిని రక్షించెననుట. దళిత...తతికిన్ = దళిత = ఛేదింపఁబడ్డ దైత్యకంకట = రాక్షసుల కవచములయొక్క తతికిన్ = సమూహము గలవానికి.

వ. అంకితంబుగా నాయొసర్పంబూనిన రాజవాహన విజయంబను ప్రబంధంబునఁ గథా నిబంధనం బెట్టి దనిన. 44

44. అంకితంబుగా = స్పష్టార్థము.

కథాప్రారంభము.

క. మగధావని మృగధారిని
నగ ధాత సృజించినట్టి ♦ నరనాథులకున్
నగ రనఁదగుఁ గుసుమాహ్వయ
నగర మగార గత మేరు ♦ నగ రత్నంబై. 45

45. మగ...మగధావని = మగధదేశమందు. మృగధారిని= చంద్రుని. నగన్=నవ్వునట్లు. నగరనన్=రాజమందిర మనునట్లుగా. అగారగత=గృహమును బొందిన.

క. ఆన్నగరము రిపు సింధూ
త్పన్నగరము, పన్నతాగ్ర ♦ పన్నగరము సం
పన్నగరము వెడవెన్నుని
యన్నగరము మనుపు నవని ♦ ననిశం బగుటన్. 46

46. ఆన్నగరము రిపుసింధూత్పన్నగరము=శత్రువులకు హాలాహలము అనఁగా జయింపరాని దనుట. పన్నతాగ్రపన్నగరము=పత్=పాదమునకు తన విధేయుఁడగు అగ్రపన్నగ=శేషునియొక్క, గము = శోభ గలది. సంపన్నగరము = సంపదలకు నాశ్రయము. వెడవె...గరము. వెడవెన్నుని = మాయావిష్ణునియొక్క అన్న = భార్యయగు లక్ష్మి యొక్క, అగరము = ఆగారమును అనగాపద్మమును, అనిశంబు= ఎల్ల

ప్పుడునుండునది, శాత్రులు లేనిది అనిభావము అనగా రత్నప్రభలచేనని తెలియవలయు.

క. పుటభేదన విప్రులు జూ
కపటిమను భుజగేంద్రుఁ గ్రిందు ♦ పఱుపుచు శ్రుత్యు
త్కట భావముఁ బ్రకటింపఁగ
జట చిక్కులగెల్చుచొంత ♦ సాత్యవతేయుఁడ్. 47

47. పుట...క్రిందుపఱుచుట=ఓడించుట, అడుగునఁబడునట్లు చేయుట అని అర్థాంతరము. జటచిక్కు = వేదపఠనావృత్తియందలి సంశయము. జడలయందలిచిక్కు అని అర్థాంతరము.

సీ. చదువుచో నలుదెస ♦ లెఱ్దకని స్రష్టలు
పలుకుచో నడుగునఁ ♦ బడనిభోగి
వరు లిరుమూల ని ♦ ల్వని ద్విజరాజులు,
ధీసురాచార్యతఁ ♦ దేని గురులు
క్రమ మెక్కుడై యుగ్ర ♦ గతి లేనివసుమతు
లొాగి మేర సజములొా ♦ నుదధి తతులు
సత్యోక్తి మారువే ♦ మఱులేని ధర్మలు
పటు ధృతి గండమే ♦ ర్పడని యచలు
గీ. లనఁగ జతురాస్యత వహీన ♦ తను గళాని
ధిత్వమున విష్ణుపదసక్తి ♦ స్థిరత నూర్మి
కోన్నమస్థితి భీమాగ్ర ♦ జన్మభావ
ధీరతల నొప్పుదురు ధరా ♦ దివిజు లచట. 48

48. ఇఱుమూల = రెండుకోణములతో లేక రెండువైపుల (ప్రాక్పశ్చిమభాగముల) ధీన్ = బుద్ధిచే, ఉగ్రగతి-శివుడుఆధిష్ఠించుట(త్రిపురహరణ

కాలమందని) అజడులు = జడభావము లేనివారు (జడము = జలము ఇట లడల కభేదము) గండము = కొండపైనుండిభూకంపాదులచేదొర్లిన పెద్దరాతిగుండు అపాయమని అర్థాంతరము. ప్రస్తాదుల యందుండు స్వభావధర్మములైన నలఁదెసఁజూచుట మొదలయినవానిచే వారి యందు లోపమారోపింపబడుచున్నది. న్యూనాభేదరూపకాలంకారము చతురాస్యత= చతుర వాగ్మిత్వము, చతుర్ముఖత్వము, అహీనత = అధికత్వము, శేషత్వము, కళానిధిత్వము, విద్యాయుత్వము, కళలకుస్థాన మగుట విష్ణుపదసక్తి = విష్ణుచరణసంయోగము, ఆకాశసంబంధము (బృహస్పతిపక్షమందు) స్థిరత = స్థైర్యము, చలింపమి(భూపక్షము) ఊర్మికోన్మనఃస్థితి-ఉంగరంబులు అనగాపవిత్రంబులయందు కోరిక యుండుట. తరంగంబులవేగర్వించియుండుట, భీమాగ్రజన్మ భావము-శివ బ్రాహ్మణత్వము, భీమునికిఅన్నయగుట ధీరత-విద్యత్వము, ధైర్యము.

క. రాజులయి వచ్చు నృపుల ప
 రాజుల విదళింతు రతిర ♦ యంబున బలు వా
 రాజుల నపరాజుల నయ
 రాజుల దరవహాని యచట ♦ రాజులఁ బొగడన్. 49

49. రా...రాజులు-పంక్తులు, పరాజులు - గొప్పయుద్ధము వారాజులు-వరుణులు, అపరాజులు-రెండవదళరథులు, నయరాజులు = నీతిచే ప్రకాశించువారు.

క. కెంగేల శైలమెత్తి ర
 నంగ నగు నురంతరావ ♦ ణ రమాధిపుల
 న్సంగడము కరణి ధరణీ భు
 జాంగంబున నిలుపుదురు ధ ♦ రాధిప తపనుల్. 50

50. సంగడంబు = సంకోలా. ఇది తరగతి రీతిగ నుండు గరడీ - కవ విశేషము. ధరాధిప తపనుల్ = రాజశ్రేష్ఠులు.

క. కలనికి నర్హుండె రఘుకుల
తిలకునకు న్నొటి బంటు ♦ తెలిసె నటంచుం
దలంచిరి భార్గవుం గినిసినం
గొలువునకుం దార్ప లేరొ ♦ కో పురిరాజుల్. 51

51. స్పష్టార్థము.

క. విశ్వగుణి సంగ్రహాణ శౌ
రి శ్వశురులు భోగ శౌచ ♦ రీతి తురాషా
డ్వైశ్వానరులగుదురు ని
త్యైశ్వర్య కుబేర విజయ ♦ లప్పురి వైశ్యుల్. 52

52. శౌరి శ్వశురులు=విష్ణుని మామలు అనగా సాగరులు.

క. శ్రీపర నిలయులు వసు విస
రావిత బాడబులు మింతు ♦ రచ్చటి బేరుల్
కావేరీ వల్లభులనం
గా వేరేవారు సాటి ♦ గా రేరీతిన్. 53

53. శ్రీవరనిలయులు = లక్ష్మిచే గొప్పయిన గృహంబులు గలవారు. వసువిసరావిత బాడబులు = ధనసమృద్ధిచే పోషింపబడ్డ బ్రాహ్మణులు గలవారు. కావేరీవల్లభులు = సాగరులు. వేరు + ఏవారు సాటిగారు = స్పష్టము. రత్న గాంభీర్యంబులచే అని తెలియవలయును.

సీ. దినకరాత్మజ కల్గు ♦ దీర్చెంగాకబలుండు
వేరువిత్తుగం బైరు ♦ వి త్తినాండె
తల నేరు మోచెంగా ♦ కలికనేత్రుండు కాల్వ
నిగిడించి పొలము దు ♦ న్నించినాండె

రెండవ దంతలే ♦ కుండఁగాఁ గినసూతి
రొంపిలోఁ దక్కఁగా ♦ ల్పింపినాఁడె
పగ్గ మగ్గలికచే ♦ పట్టెఁగా కప్పతి
గట్టిగా నొక యేటుఁ ♦ గట్టినాఁడె

గీ. నాఁడు నేఁడును దమకీడు ♦ లేఁడటంచు
గొడ్డలాడుదు రొండొరు ♦ లొడ్డులేక
జెడ్డదుగ మోముదొర జొంకి ♦ బొడ్డుదమ్మి
దొడ్డవేలుపు బడుగు గీను ♦ బిడ్డలచట. 54

54. అలుఁగు = జలోచ్ఛ్వాసంబు. వేరువిత్తుగ = మూలంబు నాటుఁటుల, దంత = మహిమంబు, ఇనసూతి = కాలుఁడు. అప్పతి = శమనుఁడు. గొడ్డలు = ప్రౌఢోక్తులు బిఱుసుమాటలు, ఒడ్డు = సామ్యంబు జెడ్డదుగ మోముదొర = బ్రహ్మయొక్క, జొంకి = ఉనికిపట్టయిన, బొడ్డు తమ్మి = నాభికమలముగల, దొడ్డవేలుపు = విష్ణుదేవునియొక్క = అడుగినుబిడ్డలు = పాదజులు = శూద్రులు.

క. మాన్యబహువ్రీహియనం
ధన్య స్తవనంబు గన్నఁ ♦ దత్పరవరసా
జన్య చతుర్థాన్వయచయ
మన్యపదార్థప్రధాన ♦ మైయుండదహో! 55

55 మాన్యబహువ్రీహి = మన్నింపఁ దగ్గది బహువ్రీహి సమాసముగలది. ఇది శూద్రచయవిశేషణము. అన్యపదార్థప్రధానమయ్యుండదు = ఇతరుల ద్రవ్యంబు ముఖ్యంబుగాఁగలది అయ్యుండదు. బహువ్రీహిసమాసంబుగలది కాదనుట. ఇది శూద్రచయ విశేషణము. విరోధాభాసాలంకారము.

క. ఏరికి నెద్దులు తేకూ
రారికిమోచుకొనితిరుగు ♦ నొకముసలియునే
డేరు గలిగి యొకరమ్మన
బోరు దిగంబరుఁడు సరియె ♦ పురి కాపులకున్. 56

56. ఏరికి = నాఁగటికి, ముసలి = వృద్ధుఁడు, బలరాముఁడు ఏఱు = శిరస్సున గంగ.

సీ. ఎత్తుమాఁడని పూవు ♦ బెత్తింత యెత్తించి
కక్షు సఖ కుతాం ♦ కంబుఁ జూచి
వెలయెంత యీమల్లి ♦ కల కని పలికించి
గుత్తంపుమోవి ప ♦ ల్లొత్తుఁగాంచి
కొమ్మ పైకమ్మ లీ ♦ కమ్మజాజుల కని
చూచుమిటారంపుఁ ♦ జూపుదెలిసి
యడిగిన పైఁడియీ ♦ ముడిపువ్వులకొసంగ
నగునని వే నగు ♦ మొగమెఱింగి
గీ. యొక్కఁడిడుచోట నలుగురు ♦ రొక్క మిడిన
విటులఁ దెలుపుచుఁ బాపుల ♦ విరుల సవుల
గూర్చి యమ్ముకొ దప్పటఁ ♦ గులుకు గుబ్బ
జవ్వనపురాండ్రు పువ్వుల ♦ పువ్వుఁబోండ్లు 57

57. ఎత్తుమా = పైఁబట్టుమా, పూవుబెత్తు = పూవండ పల్లొత్తు = దంతక్షతము, అడిగిన పైడి = అడిగినరొక్కము, ముడి పువ్వులు = వికసింపని పువ్వు. లు.

శా. కప్పుం గొప్పులచొప్పు గొప్పమెఱుఁగుం
గందోయిడా ల్తేస మిల్

చిప్పిల్ కప్రఁపుఁ దావి మోవి యపరం
జింబెక్కు లేఁజెక్కు బా
గొప్పౌళీ గుప్పు పిఱుంద పెంపును విట
వ్యూహంబు జొక్కింపఁగా
నప్పా! యప్పురిఁ జెప్ప నొప్పుదురు రూ
పాజీవికా రత్నముల్. 58

58. అప్పా=ప్రశంసనార్థకము. రూపాజీవికారత్నములు = ఉత్తమవేశ్యలు.

సీ. ఔరౌర! మధురాధ ♦ రారుణ్యమే చాలుఁ
బల్లవ శ్రేణి సం ♦ పద హరింప
మజ్జారె! వేణికా ♦ మైచక్యమే చాలు
సల భుజంగశ్రీల ♦ నపహరింప
భళిర! భుజాలతా ♦ విలసనంబే చాలు
గట్టిగా విటపాళి ♦ గట్టివైవ
నయ్యారె! వక్షోజ ♦ హారిభావమె చాలుఁ
గానుసశ్రీఫలా ♦ క్రమణ సేయ
ననఁగఁ బాటిల్లుఁ దనపాటి ♦ యైన సాటి
యేటి బోటిగములలోన ♦ సూటి నాటి
నాటి కవ్విటిలో వేశ ♦ వాటికా వ
ఘూటికా కోటి గుణమణీ ♦ ఝూటపేటి. 59

59. అరుణ్యము=ఎరుపు. పల్లవశ్రేణి = చిగుళ్ళ సమూహము. విటసమూహమని అర్థాంతరము. ఔరా=మజ్ఝారె మొదలైనవి ప్రశంసనార్థకములు. మైచక్యము=నలుపు. భుజంగశ్రీలు = కృష్ణసర్పశోభలు.

విటుల భాగ్యములని అర్థాంతరము. విటపాళి = వృక్షముల పంక్తియని అర్థాంతరము. హారిభావము = ఒప్పిదము. కామన శ్రీఫలాక్రమణ=సొగసైన మారేడు పండ్లను, అలుముట. (కాముకులయైశ్వర్య లాభము నలుముట), ఏటిబోటిగములలోన = ఎటువంటిస్త్రీలలోను, నాటి = నిదానము. వాటివాటికి = అప్పటికప్పటికి. వేశవాటికా = వేశ్యలవీధి. ఝూటు=సమూహము.

ఉ. రాతు మనం బెఱింగి జల
రాశి చివుర్చ్కనదాటి హుంక్రియా
జ్ఞాతత సాగు వాగె కళు
సన్న ఘటింపదు పాటి చుట్టుఁ గ
ద్దాతలఁ బెట్టునో యనుభ
యంబున శిక్షణవేళనుం గశా
ఘాతము లేక యుండు తెలుఁ
గంబడుఁ దత్పురి వాజి రాజికిన్. 60

60. వాగెకళుసన్న=కళ్లెముపలసిచిన్నిసన్న. ఘటింపదు=పడ యదు. పాటి=సమానాశ్వములు. చుట్టుగద్ద=చుట్టుపట్లుకలవు. అతలఁబెట్టునో=కడగానిల్పునేమో. శిక్షణవేళను=గతివిద్యావేళనైనను. ఎఱుగంబడు=తెలియంబడును.

సీ. చరణ విన్యాస బం ♦ ధుర శిరోభార దృ
క్కర్ణుఁడు కంటికిఁ ♦ గలిక మడుగఁ
గిర్ణ చాలన పత ♦ త్కల్పద్రు కుపితేంద్రు
డపరాధి వని గాడ్పు ♦ నడ్డ పెట్ట
రద దశ స్మేరూర్ధ ♦ రాజసావా ప్రాభ్ర
తట నివారికి జటు ♦ ల్పటములందఁ
గర మెత్తి చల్లు శ్రీ ♦ కరపు వెల్లిని జుక్క
లుడుప బింబం బెక్క ♦ నుడుప శంకఁ

గీ. జటుల బృంహిత బధిరితా ♦ శాగజముల
కేల కడు పెద్ద విన్నప ♦ మిపుడు సేయ
నహిపతికిఁ దోఁడు సైయంచు ♦ నవని నొడలఁ
గరము వహియించు నవ్వేటి ♦ కరటి ఘటలు. 61

61. టీ॥ దృక్కర్ణుఁడు=శేషుడు, ఏనుగులపదవిన్యాసముచే భూమి దించుకొని పోవుచున్నందున శేషునికి శిరోభారమువచ్చి కంటికిఁ గలికమడుగుచుండెననిభావము. ఈ చరణమందుఁబదవిన్యాసముప్రశంసింపఁబడె. ఏనుఁగుచెవులవలనివాయువుచే వృక్షములు విరిగిపడిపోవుచున్నందున నింద్రుడు గాలినిసేరగానిఁగా నాటంకపఱుచుచున్నాడు. దంతఘట్టనలచే మేరువునుండిపడుచున్న ధూళీసమూహమువల్లఁ గలుషములైనగంగోదకములను జటులువడియఁగట్టుచున్నాడు. ఉడుప=నక్షత్రపతి, తెప్ప, గజకర్ణములు, దంతిఘట్టనంబు, కరశీకరములువర్ణింపబడె. ఈయేనుఁగుఘీంకారమునకు దిగ్గజములకుఁజెవుడుపట్టెను. శిరోభాగముగలశేషుఁడు చెవిటియేనుఁగుల సహాయమునకై వానికిఁ బెద్దమొఱ్ఱలెల పెట్టవలె మేముతేమాయంచుఁ బట్టణగజములు తమదేహముపై భూమిని వహించుచున్నవి అనగాఁ బరాగముపైవేసికొనుచున్నవనుట.

సీ. ధర కుంకుమాంక కం ♦ ధరదాల్చికొన్న క
ట్టాణి పూసల కుత్తు ♦ కంటనంగ
గట్టు విల్తుడుఁ జడ ♦ చుట్టు చుట్టక నిల్పు
దైవ పద్యానట ♦ త్తటిని యనఁగఁ
బవనుతో వాదంబు ♦ పచరించి హాటకా
చలము చుట్టున నాటు ♦ చక్రి యనఁగ
సూర్యపుటంపు బ ♦ ల్లో దంటఁగట్టిన
పట్టణాభిధ యోధు ♦ దట్టి యనఁగ
గీ. దేవ పుర లక్ష్మి కురువింద ♦ కోవ క్రిందఁ
దార్చు కొండియ మొదటి పూ ♦ దండ యనఁగ

సూటిగల దెంపు కోటాని ♦ శుద్ధ సలిల
పరిఘ యొప్పారు నెప్పుడ ♦ వ్పుర వరమున. 62

62. టీ॥ కట్టాణి = ముత్తికవిశేషము, కుత్తుకంటు = స్త్రీలు మెడను ధరించు సుమంగళ్యాలంకార విశేషము. దైవపద్యా=ఆకాశము, చక్రి = శేషుఁడు, శేషునకును వాయువునకును గలిగిన బలతారతమ్య వివాదలో వాయువు మేరుపర్వతము నెగరఁగొట్టుటకుఁ చేయుప్రయత్నము నెరవేరకుండుటకు శేషుఁడు మేరువునుజుట్టవేసెనని గాథగలదు. ఇక్కడ బంగరుకోట మేరువుగను వగడ్తశేషుఁడుగను జెప్పంబడెను. సూర్యసంపుటమను పెద్దయోధు ప్రాకారమును స్పృశింపఁగా పట్టుము నెడు యోధు కట్టిన కాసికోకయనునట్లు. సూటిగల = గుర్తుగలిగిన, కోటాని = కోటనానుకొని, పరిఘ = అగడ్త.

క. ఆ వెల కడలి న్నగు పరి
ఘా వారిధిఁ దత్పురంబుఁ ♦ గని చతురుండై
రావణపురి యామీఁదటఁ
గావించెనొ కాక విశ్వ ♦ కర్మకు నగునే. 63

63. వెలికడలి = పాలసముద్రము, అగునె = శక్యమా.

సీ. ఆపట్టణమున కీశ్వరుఁ
డై పాటిలు రాజహంసుఁ ♦ డతఁడు ప్రతాపా
టోపాహాత కోపా సత
భూపాయత ధైర్య శౌర్య ♦ పుట భేదనుఁడై. 64

64. ప్రతా...నుఁడై = ప్రతాపాతిశయముచే గొట్టబడని కోపముసకు సనతులైన రాజులయొక్క విస్తారమగు ధైర్యశౌర్యపుటమును భేదించినవాఁడై పాటిలుసని యన్వయము.

శా. ధాటీ ఘోట ఖురాగ్ర నిర్దళిత గో
త్రా ధూళికా గంధ చూ

ర్ణాటో పాళి పరిస్ఫుర త్త్రుదిత స
ర్వాశా వధూటీ కుచా
ఘాటా చ్ఛాచ్ఛద రాగ శాటిత సమా
ఖ్యా విక్రమ ప్రక్రమా
త్యాటీకా హిత రాజహంసుడగు నా
హా రాజహంసుం డిలన్. 65

65. దండాన్వయము. దండయాత్రయందు గుఱ్ఱముల డెక్కలకొనలచేఁ బిండిగఁగొట్టఁబడిన భూపరాగమనెడు బుక్కాపొడియొక్క యతిశయముయొక్క పరుసలచేఁ బ్రకాశించునట్టియు, ప్రసిద్ధములగు సకలదిశలనెడు స్త్రీలకును (వారి) కుచంబులపంక్తులకును (వరుసగ) తెల్లచీరెగను, నెఱ్ఱని పైఁబట్టగను, జేయఁబడిన|కీర్తిప్రతాపముల ప్రచారముఁయొక్క ప్రకాశమునకు నిరోధుఁడైన చంద్రసూర్యులు గలవాఁడు.

గీ. అబ్జదానత శుద్ధ ప ♦ క్షా ప్తి విమల
మానస స్థితి నడవడి ♦ మహితకీ ర్తి
పరిచయంబున నాత్మభూ ♦ భరణ శ క్తి
రాజహంస ప్రభావంబు ♦ రమణ గాంచు. 66

66. అబ్జదానత = చంద్రుని దాతృత్వమువంటి దాతృత్వము గలవాఁడనుట. పద్మములను ద్రుంచుట = ఈయర్థమందు భావార్థక తల్ ప్రత్యయము వ్యర్థమగుఁగాన నీపక్షమందును బహువ్రీహినే గ్రహింపదగు. శుద్ధపక్షాప్తి = నిర్దోష కక్ష్యాలంబనము, స్వచ్ఛమగు ఱెక్కలు గలుగుట. విమల మానస స్థితి. నిర్మలమనస్సు గలిగియుండుట - మానస సరస్సున నుండుట. కీర్తి - యశస్సు, బురద = ఆత్మభూభరణము-తనదేశము భరించుట. బ్రహ్మను మోయుట. రాజహంస ప్రభావము - రాజశ్రేష్ఠుని మహిమ, రాజహంసము=చంచు చరణము లెఱ్ఱగను దక్కిన శరీరము తెల్లగను నుండు హంస.

క. రసి కాంబుజ హంసుఁడు సా
హాసిక వతంసుండు రాజ ♦ హంసుం డెపుడున్
వసుమతి యను సుదతీమణి
వసుమతిఁ గులకాంతగాఁగ ♦ వర్తిలుఁ గీర్తిన్. 67

67. వతంసుండు = అవతంసము = ఇట్లు వలగ్నము, అవలగ్నంబు మొ-

వ. ఇవ్విధంబున సౌగంధిక బాంధవ కులీన సింధురంబు, గంధసింధుర సైంధవ ప్రియంభావుక భావుక భూమ్యంగనాభోగ ధురంధరుం డష్టైశ్వర్య శితి కందరుం డాభోగ పురందరుండు, జీమూత జాతంబునకుఁ జాతకంబునుంబోలెఁ దనూజాత జాతకంబునకు నెదురు చూచుచుండె నంత నొక్కనాఁడు. 68

68. సౌగంధికబాంధవ=చంద్రుఁడు. జీమూతము = మేఘము.

సీ. శూలిసంధ్యానాట్య ♦ కేళిమున్నాడఁ ద
న్నిన పదాంగద మన ♦ నినుఁడు గ్రుంకె
భ్రమర విభ్రమ రీతి ♦ నమరించు చెంగావి
కాసెనా సంధ్యా ప్ర ♦ కాశమెసఁగె
శబ్దంబు గొనగొల్పు ♦ సజటా తటి న్యూర్ధ్వ
జలకణంబులన జు ♦ క్కలు చెలంగె
మృడుఁడు తాళఁగలేక ♦ పుడమిపై నుమిసిన
గళ హాలాహలమన ♦ గడిసెఁ దమము
గీ. లీలమైఁ బాడ నటనకా ♦ నీల లోహి
తుండు నిజ భూతి రాణింప ♦ మండలమున

నుండునో నాఁగఁ దూరుపు ♦ కొండ దండ
పొందు రాకృతిఁ బొడసూపెఁ ♦ బొందు కరుఁడు. 69

69. పదాంగదము = అందె. ఇనుఁడు = సూర్యుడు. శివుఁడు ప్రదోష తాండవ వేళ కాలుజాడించుచో నూడిపడ్డయందెయనునట్లు సూర్యుఁడు గ్రుంకెననుట. తేఁటి సుడివలె నమరించిన కాసె (నడుము దట్టి)యనునట్లు సంజయొప్పె. శబ్దజతిగొన గొల్పుటకై శివ జట పటలిని ఘూర్ణిల్లెడు గంగనుండి పైకిలేచిన జలబిందువులనురీతిఁ జుక్కలు వెలిగెను. శివుఁడు గొంతున నుంచుకొనలేక యుమిసిన హాలాహలమనునట్లు చీకటి వ్యాపించెను. ప్రదోషతాండవవేళ శివుఁడు నిజైశ్వర్యమున రాణించునప్పుడు చంద్రుఁడు తన మండల మందుండుటతో యనునట్లు తూర్పుకొండపై నొప్పెను.

క. ఆ రాత్రి సముజ్జ్వల మ
ణ్యారాత్రికుఁ డగుచు సప్రి ♦ యకుఁడై క్రీడా
గారంబున శయినింపఁగ
గారవ ఖని యా తదీయ ♦ కలకంఠి కలన్. 70

70. మణ్యారాత్రికలు = రత్నహారతులు. తదీయకలకంఠి = రాజహంసునిభార్య.

సీ. లిబ్బుల జవరాలి ♦ యబ్బ నల్లునిఁజేసి
తనరెడు నడుగు కెం ♦ దమ్మివాఁడు
సిరి యిల్లు మేల్కనఁ ♦ జేసి జేజేలకు
వంటకంబిడు కన్ను ♦ దంటవాఁడు
నెలదాల్పు నేవళం ♦ బులకునై వేల్పు బో
నమ్ము దెచ్చిన వారు ♦ వమ్మువాఁడు
గొంతి మూఁడవ పట్టి ♦ కోడలి నిండు లే
కటిఁ గాచినట్టి చే ♦ కత్తివాఁడు

గీ. కడలి బొడమిన నిగ్గు చొ ♦ క్కంపుగెంపు
రొమ్మువాఁడు నెమలికుంచె ♦ సొమ్మువాఁడు
క్రీడిచేడియ నడి విడ ♦ నాఁడు వాఁడు
కొండకూటువ పగవాని ♦ కూర్మితోఁడు. 71

71 లిబ్బులజవరాలియబ్బ = సాగరుడు, వానిజామాతగాఁ జేసినపాదపద్మముగలవాఁడు. నెలదాల్పు, నేవళంబులు = శివునియాభరణంబులు, సర్పంబులు, వేల్పుబోనము=అమృతము, వారువము =గుఱ్ఱము అనగా గరుత్మంతుడు పూర్వము స్వర్గమునుండి యమృతము తెచ్చి వాసుక్యాదులకిచ్చి తనతల్లిని దాస్యమునుండి తప్పించెను. గొంతిమూఁడవపట్టి తోడలు=కత్తర. కొండకూటువ పగవాఁడు = ఇంద్రుడు.

సీ. వలకంటి యెండకై ♦ వనధిజాతకులై జ
యంతివట్టిన హాయ ♦ లజిగె యనఁగ
మస్తపంబోదర ♦ గ్రస్త తాపహరణై
కాంత భాస్వర పుష్ప ♦ వంతులనఁగ
హంస కాశ్రిత రాజ ♦ హంసంబున కొసంగు
లీలార్ధ మృదుల మృ ♦ ణాల మనఁగ
చందన ద్రుమ మధ్య ♦ సక్తాహి విటపాళి
భాగభా గ్బహురత్న ♦ భోగమనఁగ
గీ. రొమ్ముపై మచ్చయరియుఁ జిం ♦ దమ్ము గదయు
నడుముచుట్టు వెన్నంటి ♦ కుడిభుజమున
వాలి చనుమొన నటియించు ♦ చేల పసిఁడి
చెరగు మెరుగార వచ్చి ల ♦ క్ష్మీధవుండు. 72

72. ఈ పద్యమున శ్రీవత్సము, చక్రశంఖములు, గద, స్వర్ణచేలము ఇవి వరుసగ వర్ణింపబడెను. వలకంటి యెండ = సూర్యతాపము, హాయలజిగె=ఒయ్యారపుగొడుగు. మస్తపంబోదరులనఁగా

రాహుకేతువులు (వీరిని) గ్రస్త=గ్రసించిన, కర్త్రర్థక క్తప్రత్యాయము తాపవారకులగునట్టియు, మనోహరులై ప్రకాశించునట్టియు, చంద్ర, సూర్యులు, చక్రశంఖములు తమోగ్రహములను మ్రింగునట్టి, తాపకరములు గానట్టి, సర్వదా ప్రకాశించునట్టి సూర్యచంద్రులనుట. పుష్పవంతులు=సూర్యచంద్రులు, గద తామరతూడుగ నభివర్ణింపబడెను. అందుపైఁజెక్కిన రాజహంసకు నిచ్చు తూఁటినిబోలి గదయుండెననుట. పసిఁడిచేలచెరగు, చందన=... ...భోగము=శ్రీగంధవృక్షము నడుమును జుట్టిన సర్పముయొక్క శాఖాపంక్తిభాగభాక్కగు బహురత్నయుక్త ఫణమువలె నుండెను.

శా. ఛాయల్ దేరిన జాళువా మొసలివా
చౌకట్లు లే జెక్కులన్
సాయంకాల దినేంద్ర మండలము గుం
దన్ జేయ గాంగేయ కౌ
శేయం బాయతకాయ తోయదముపై
చిందుల్ గొనన్ రేవతీ
దాయాదుం డల రాజరాజముఖి చెం
తన్నిల్చి యుంతన్ దయన్. 73

73. ఛాయల్......ట్లు, ఛాయల్ దేరిన = వన్నెమించిన, జాళువా=బంగారుతోఁ జేయఁబడిన, మొసలివా = మకర ముఖాకృతి గల, చౌకట్లు = కుండలములు, సాయంకాల, దినేంద్ర, మండలము= అస్తమయ సూర్యమండలమును, గాంగేయకౌశేయము = సువర్ణాంబరము, కాయతోయదము=దేహమనెడు మేఘము, రేవతీదాయాదుండు= బలరామునకు బావమరఁదు, రాజరాజముఖి = రాజకాంత.

క. సంతతార్ధిని యువతికి
సంతాన ఫలంబొసంగి ♦ సంతత జనతా
చింతా సంతాపహరణ
చింతామణి విష్ణు డసుర ♦ జిష్ణుం డరిగెన్. 74

74. సంతానార్థిని = సంతానమును కాంక్షించు, అసుర జిష్ణుండు = రాక్షసులను జయించినవాఁడు.

గీ. అంత మాగధ వైతాళి ♦ కాంతిమంజు
లారవంబుల ♦ మేల్కాని ♦ హరి వరంపుఁ
బెంపునఁ దదాస్యకళ హెచ్చి ♦ సొంపు మీఱు
ననుచు మును జాఱెనా నెల ♦ యపుడు గ్రుంకె. 75

75. మాగధ......రవంబుల, మాగధ = భట్టువాండ్రయు, వైతాళిక = మేల్కొలుపులవాండ్రయు అతిమనోహరములయిన స్వరములచే. తదాస్యకళ = రాజభార్యయొక్క ముఖకళ. మునుజాఱెనాన్ ముందుగ నేజాఱెనో యనునటుల. నెల=చంద్రుడు.

తా. విష్ణువరమహిమచే రాజపత్నిముఖకళ హెచ్చునని తలంచి చంద్రుడు దిగజాఱెనో యనునటుల నస్తమించెను.

గీ. చుక్కరాయల్లు దొర కేళి ♦ మక్కువలనఁ
జొక్కు వారును చుక్కనాఁ ♦ జుక్క వోడిచెఁ
దెల్ల దీపంబుగాఁ ప్రాకు ♦ తీ ముఖంబు
తెల్లవారఁగఁ దూరుపు ♦ తెల్లవారె. 76

76. చుక్కరాయల్లు ... మక్కువలన = మోహములచేతనే, ఉచుక్కనా = నిరసింపఁగా

సీ. శ్రమ పరస్పర పరీ ♦ రంభ జృంభణ సంభ
మమున నిద్రించె దం ♦ పతి గణంబు
సంకేత తల నిశా ♦ తంకీతరతలాప్తిఁ
జనుదెంచె నిండ్లకు ♦ జార సమితి
గణికా శిరోమణి ♦ మణి తాబ్ధి దేలి వ
చ్చె ముసుంగెసఁగఁ బ్రతి ♦ ష్ఠిత జనంబు
తపనోదయ మిషనా ♦ లపనోద్ధతుల నిండ్లు
వెడలఁద్రోచె విటాళి ♦ వేశ్యమాత

గీ. సంభవించెఁ గచాకచీ ♦ సంగరంబు
చక్కఁగా వేగ దిక్కులఁ ♦ జాటనేఁడు
దండహతు లొదవెను వెల ♦ తలిరుబోండ్ల
తల్లులకుఁ దూర్పు తెలతెలల్ ♦ దాయు నపుడు. 77

77. శ్రమపరిశ్రమ...సంభ్రమమున = అలయికతోఁ గూడిన యన్యోన్యాలింగనాతిశయమువలని సంతోషముచే. సంకేత...ప్తిన్ = సంకేతస్థానములనుండి నిశాప్రతిబంధకాభావస్థలముయొక్క ప్రాప్తిచే ప్రతిష్ఠితజనంబు = మర్యాదవంతులు. తపనోదయమిషన్ = సూర్యోదయపు నెపముచే. అలఘనోద్ధతులన్ = చురుకయిన మాటలతో. కచాకచీ సంగరంబు = జుట్టుజుట్టుపట్టుకొని చేయుపోరు. ఒకచోటునకే తటస్థించి వెలుపలికి వెడలింపఁబడ్డ విటులు పోట్లాడుచుండిరనుట. దండహతులు = కఱ్ఱదెబ్బలు.

ఉ. చల్లనితావి నెల్లెడలఁ
జల్లఁగఁ దెమ్మెర లెల్లఁ బెల్లుగా
హల్లకము ల్వినిద్రకము
లై పొరలం జలజాత జాలముల్
మొల్లమి నుల్లసిల్లఁదమ
ముం దమ ముందటి చోటు కేగగా
బల్లునఁ దెల్లవారె సుమ
భల్ల రణార్థుల గుండె ఝల్లనన్. 78

78. హల్లకములు = ఎఱ్ఱగలువలు. సుమభల్లరణార్థులు = రత్యపేక్షకులు.

క. హరిదశ్వయాత్ర కమరే
శ్వర దిగ్గజ కుంభ పఙ్క్తి ♦ సమయ భటాగ్రే
సరుఁ డెత్తు కెంపు డాలన
నరుణపు డాలడరెఁ బ్రాచి ♦ నప్పటి వేళన్. 79

79 హరిదశ్వయాత్రకు = సూర్యునియాత్రకు. అమరే... క్తిన్ = ఐరావత కుంభస్థలిమీద అసమయభటాగ్రేసరుఁడు = కాలమ సెడు భటశ్రేష్ఠుఁడు. కెంపుడాలు = ఎఱ్ఱని జెండా, అరుణఁపుడాలు = ఎఱ్ఱకాంతి

క. తమ్ములదోర కైరవ జా
తమ్ముల చెఱ చక్రిసంయు ♦ తమ్ముల కోఱ భూ
తమ్ముల తోర యాగమ కుం
తమ్ముల యొఱ కిరణ ధనుఁడు♦తపనుఁడు పొడమెన్ 80

80. చెఱ = నిర్బంధము. చక్రసంయుతమ్ములకోఱ = చక్రవాక దంపతులయక్కఱ, భూతములతోర = పిశాచములకు వేగిరింపు సూర్యోదయము పిశాచములకు నిర్బంధమనుట. ఆగమకుంతమ్ములయొఱ = వేదములనెడు బల్లెములకు గూడు. త్రయీమూర్తి యగుటచేతనని గ్రహించునది. కిరణ ధనుఁడు=సూర్యుఁడు (కిరణములే ధనముగాఁగల వాఁడు).

క. అంతకమెనున్న కాంతయు
నెంతయు మేల్కని మురారి♦హృదము గతోద్య
త్సంతోష బాష్పకళికా
క్రాంత నిరంతరిత పులక ♦ గండ యుగళయై. 81

81. అంతకము - స్పష్టార్థము.

సీ. అత్యాదరమున నా ♦ ది త్యావని రుహాంబు
సత్య కిచ్చిన నిత్య ♦ సత్య ఘనుఁడు
కృపఁ దారసిలు చూడ్కి ♦ ద్రుపదాత్మ భవన వ
త్రప దోర సీని త ♦ ద్విప దరాతి
యుత్తర నృత్త లో ♦ కోత్తరత సుజాతు
నొత్తరం జేయు న ♦ మత్త రతుఁడు

కల్యాత్త గాత్ర న ♦ హల్యాంబురుహ నేత్రఁ
గల్యాణిఁ జేయు నై ♦ గ్మల్యశాలి
గీ. యల యశోదాకిశోరకం ♦ బాసుభద్ర
కలికి సైదోడు నాపాల ♦ గలిగె నేఁడు
మమ్మరే యని పులకించి ♦ మందయాన
తుందిలానంద కందళి ♦ కందమయ్యె. 82

82. సత్యభామకు కల్పవృక్షము తెచ్చియిచ్చినవాఁడు. ద్రౌపదికి నవమానము తప్పించినవాఁడు. (వస్త్రాపహరణమందు) అఘన్ = హరింపన్, పరిక్షిత్తును గాపాడినవాఁడు. కల్యాత్తగాత్ర = దోషగ్రస్త శరీరము. మమ్మరే = ఆశ్చర్యార్థకము. తుందిలానంద కందళి కందము = బలిసిన సంతోషపు మొక్కకు దుంప.

శా. అజ్ఞాత ప్రభవాది వంద్యహృదయా
ధ్యాహా లసాధ్యేతరా
కుబ్జాకార మహత్త్వ సత్వ కలనా
కుంఠీకృతా స్తోక కా
కుబ్జాగ్ర ధ్వజ శంస, కంస కరటి
క్షోభాగ్ర బాహార్గళా
కుబ్జానామనికుబ్జపాణి నయనాం
కూర ద్భుజంగాగ్రిణీ. 83.

83. హృదయాధ్యాహాలసాధ్యేతరా = మనస్సుచే నధ్యాహరించుట కసాధ్యుఁడా, మానసాగోచరుఁడనుట, కుబ్జాకార — వామన స్వరూపుఁడా. మహత్వ... శంస..., మాహిమ యొక్క, బలక్రమముచే వృద్ధపరచఁబడనివియు, నధికమైనట్టియు, గజేంద్రుని స్తుతిగలవాఁడా. అనఁగా గజేంద్రునిఁగాపాడెననుట. (కకుబ్జాగ్రిధ్వజస్యాపత్యంపుమాన్ - కాకుబ్జాగ్రధ్వజః- తస్యశంసాయస్యేతి విగ్రహః) కుబా......గ్రిణీ =

కుబ్జయను పేరుగల మఱుఁగుజ్జుదానియొక్క నేత్రముల కంపురించు వితురాయుఁడా. అనఁగా త్రివక్రను అవక్రనుజేసి దాని గుబ్బము తీర్చెననుట.

క. నందకధర యభి నందిత
నంద కటాక్షా రమాంగ ♦ నా మణి హృదయా
నందన చందన యానక
దుందుభి నందన విధూత ♦ దుందుభి దేహా. 84

84. నందకధర = స్పష్టము.

ఉత్సాహము.

మందరాగ నిత్యధృత్య ♦ మందరాగ దాన పా
రందరాగ వాగ్గళన్మ ♦ రంద రాజి భారతీ
కందరాజి శోభి నాభి ♦ కందరా ముకుంద గో
వింద రాజి నందితార ♦ వింద రాజిత్రేక్షణా. 85

85. మంద... రాగ = మందరశైలమును నిల్కడగా ధరించుట యందధికాపేక్ష గలవాఁడా. దాన.. రాగ = దానకల్పకమా, వాగ్గళ...భారత — వాక్కునుండి బహిర్గతమగు తేనెసోనగల వేదములు గలవాఁడా. కంద...కందరా — మూలాంకురసమూహముచేఁ బ్రకాశించునాభి బిలము గలవాఁడా. ముకుందా — మోక్షమిచ్చువాఁడా. గోవిం...క్షణా — దిక్పాల గణమును సంతోషింపఁజేయునట్టి పద్మము వంటి ప్రకాశించు కన్నులుగలవాఁడా.

## గద్య.

ఇది శ్రీమద్రామభద్ర భజనముద్ర కవిపట్టభద్ర కాద్రవే
యాధిప పర సమాగత సరససారస్వత లహరీపరిపాక
కాకమానిమూర్తిప్రబోధ బుధకవిసార్వభౌమ
పౌత్ర రామలింగభట్టపుత్ర కౌండిన్యగోత్ర
భాగధేయ మూర్తినామధేయ ప్రణీ
తంబైన రాజవాహనవిజయం
బను మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

---



# రాజవాహన విజయము.

( ద్వితీయాశ్వాసము. )

---



శ్రీ రత్నాకర కరుణా
పూర క్షాళిత సమస్త ♦ భువన విశేషా
క్ష్మారక్షా హరిహయ నుత
దోరక్షా శేషశైల ♦ దుర్గాధ్యక్షా. 1

1. శ్రీరక్షాకర - శ్రీరక్షణచేయువాఁడా. కరుణా...విశేషా= దయారసముచేఁ గడగఁబడ్డ సమస్త లోకములయొక్క దోషములు గలవాఁడా. క్ష్మారక్షా = భూమినేలువాఁడా. హరిహయ...రక్షా = ఇంద్రునిచేఁ గొనియాడఁబడ్డ భూజావయవముగలవాఁడా. శేషశైల దుర్గాధ్యక్షా = శేషాచలశిఖరముననుండు ప్రభువా.

వ. అవధరింపు మయ్యవసరంబున వసుమతి వసుమతీ పతిని
మేలుకొల్పి యిట్లనియె.

క. భూవర మనపాలిటఁ గల
దేవర మురవైరి శ్రీస ♦ తీ పతి కరుణన్

నావల కేలికిఁ గలలో

నా వలభి ద్వని ఫలంబు ♦ నందించెఁ దగన్. 3

3. వలభి ద్వని ఫలంబు = జలాంతరమందైన యింద్రుని తోట లోనిపండు. అనఁగా కల్పఫలము.

శా. ఆపద్బంధుఁ డనేక పావన కళా

త్యంత ప్రహృష్టుండు గో

త్రా పారాయణుఁ డాపగా తనయ ని

ర్వాణ ప్రదాతృత్వ లీ

లా పారీణుఁడు పాండవార్తి హృతి హే

లా శాలి కౌచేల దా

నాపూర్ణోదరుఁ డార్త సాదరుఁడు దా

నాపాల గల్గెం గదా. 4

4. అనేక పావన కళాత్యంత ప్రహృష్టుండు = గజమును గాపాడు విద్యయం దధిక సంతోషము గలవాఁడు. (గజేంద్రునిఁ గాపాడెననుట) గోత్రా పారాయణుఁడు = భూరక్షణాసక్తుఁడు. ఆపగా...పారీణుఁడు = భీష్మునకు మోక్షమిచ్చుపనిలో సమర్థుఁడు. పాండవా...శాలి=పాండవుల బాధనుహరించు క్రియచేత నొప్పువాఁడు కౌచేల దానాపూర్ణోదరుఁడు = కుచేలుని సంబంధము దానముచే నిండిన యుదరదా గలవాఁడు. ఆర్త...రుఁడు=పీడితులయిందు ఆదరముతో గూడినవాఁడు.

క. అని తా వనితామణి వా

గ్జనితా మోదమునఁ బొదలె ♦ జన తాధీశుఁ

డనతాహి దమన తార్క్ష్యుఁడు

తన తామరసాక్షి దొల్చ ♦ దోహ్రాద మనుచున్. 5

5. జనతాధీశుఁడు = జనసమూహ ప్రభువు. అనతాహి, దమనతార్క్ష్యుఁడు = అవిధేయులనెడు, సర్పముల నణచుటకు గరుడుఁడు. ఇది రాజునకు విశేషము.

గీ. దేవ నిజ దేవ పతి శివ ♦ సేవఁ దనరెఁ
పావన స్వాంత నిజ కీర్తి ♦ పటలి ధవళి
ధవళి తాంబర వసుమతీ ♦ ధవళ నయన
చెరగు మాయక యుండు ట ♦ చ్చెరువె యప్పుడు. 6

6. దేవ... సేవన్ = దేవతలయందుఁ గులదేవ పతియగు శివునియొక్కయు సేవచే నొప్పెను. ఇదిరాజుతో ముందున్వయము. పావనస్వాంత=పరిశుద్ధ హృదయ. నిజకీర్తి .. బర= తనకీర్తిసమూహముయొక్క, తెలుపుచేఁ దెల్లఁగాజేయఁబడ్డ యాకాశము గలది. వసుమతీ ధవళ నయన=వసుమతీఁ నామక రాజకాంత.

మ. కులుకుం దోరపు గబ్బి గుబ్బ చనుము
క్కుల్ నల్లఁబారె న్నుచున్
దళుకుం జెక్కులు తెల్లఁబారెఁ గ్రమ ని
ద్రాయాస జాడ్యంబు ల
గ్గలమయ్యెం దరుచయ్యె చిట్టుములు కాం
క్ష లెల్లించె నింపారఁగాఁ
దలసూపెన్ గడు నోకిలింత పనులం
తర్వర్తులై తన్వికిన్. 7

7 చిట్టుములు = వేవిళ్ళు. (చిఱు + ఉమ్ములు)

గీ. అప్పుడు ఘనాగ్ర కుచ హరి ♦ ణాంశు వదన
భంగ సంగత వళిక త ♦ న్వంగి తరళ
నయన యుగళ హరిమధ్య ♦ నాగ మంద
గమన చెలువొందె నిర్భర గర్భ కలన. 8

8 హరిణాంశుఁడు=తెల్లని కిరణములు గలవాఁడు. చంద్రుడు.

వ. ఇవ్విధంబున గ్రిమక్రమంబున, సువర్ణ వర్ణపరి

పూర్ణ గర్భంబుదాల్చె.నంత నగణ్య సాద్గుణ్యంబగు నొకా
నొక పుణ్యావసరంబున.

9 సువర్ణవ్ వర్ణన్ = బంగరువన్నెగలది. అనగా స్త్రీ.

క. పంచగ్రహామిహిరుని వ
ర్తించని లగ్నమున దిశలు ♦ తేజము మించన్
బంచాస్య మధ్య ధీయుం
బంచాస్త్రాకారునిం గు ♦ మారునిఁ గాంచెన్. 10

10. సూర్యాది క్రూర గ్రహము లయిదును లేని లగ్నము నందు అనఁగా బృహస్పతి, చంద్ర శుక్రులుగల లగ్నమునందని భావము.

సీ. మన రాజు తోడ ధీ ♦ మంతు లూహ యొనర్చి
చెప్పిన వీసంబు ♦ తప్ప కగునె
చామని చాయ దా ♦ సరి ముత్తె మిచ్చిన
కల మొన్న మును మాపు ♦ దెలుప వలెనె
యమ్మ కుమారుఁగన్ ♦ సుమ్మన మరచితె
పున్నమ నాఁడు నే ♦ నన్న మాట
లటు మున్ను నీకు నీ ♦ యాన నే నేమంటిఁ
బడకింటి పజ్జఁ జ ♦ ప్పరములోన
గీ. నగునె నీకల నిక్కల ♦ యక్క నీకు
పలుకు తప్పదు తాగట్టి ♦ పలవ యిచ్చు
ననుచుఁ దమదేవి సుతునిఁ గ ♦ న్నపుడె తగిలి
నగవు చిరుగింప నగిరి పూ ♦ ర్ణగిరి చెలులు. 11

11. వీసము = పదియారింట నొకభాగము. చామనిచాయ దాసరి = వేంకటేశ్వరుఁడు. నిక్కల = నిండుకల. పూర్ణగిరి చెలులు = పట్టణమందలి నగరునఁ దిరుగు మూడిగపుఁగాంత్రలు. వీండ్రు

పరస్పరము నమ్మగాయకుమారునిఁగన్న వేళ సంతోషముతో సరసము లాడుకొనుచుండుట యీపద్యమందు వర్ణింపఁబడెను.

క. తోరపుఁ జనుఁగ వదర నో
యొయ్యారంబున వచ్చి యంత ♦ యాంతఃపుర కాం
తారత్నము విభునకు దే
వేరి సుతుం గన్నవార్త ♦ వినిపించుటయున్. 12

12. చనుఁగ వదర = చనుఁగవ + అదర. శేషము స్పష్టము.

మ. పులుకల్ బిట్టర చట్టియందు నిలువన్
బొల్పొందె హర్షంబునన్
మొలకల్ డెందమునన్ బరంపరలుగా
ముంచెన్ సముద్బాష్ప ము
ల్గలిగెన్ స్నిద్ధపుఁ జెక్కుటద్దముల సో
గల్వారెఁ జెల్వారఁగా
నల భూజానికి నాత్మజాతకుని వా
ర్తాకర్ణనాపూర్ణతన్. 13

13. పులుకల్ = రోమాంచములు. బిట్టరచట్టి = మిక్కిలి నిక్కవొడిచి. అంద = అంకురించినచోటనే, నిలువన్ = అణఁగిపోక యుండఁగా. పొల్పొందెనని పూర్వమున కన్వయము. హావన్ ... ముంచెన్ = సంతోషముతో, తదంకురములు, మనస్సునందు, సమృద్ధిగా ముంచెను. అనఁగా వ్యాపించెననుట. సముద్బాష్పముల్ = ఆనంద యుక్తమయిన నేత్రజల బిందువులు. శేషము స్పష్టము.

గీ. దూరయాత్రాగతుఁడు తన ♦ యూరు గనిన
కరణి, తృష్ణార్తుఁ డమృతంబు ♦ గాంచు సరణి,
ఖర కిరణ ఖిన్నుఁ డోకచెట్టు ♦ గన్న పగిది,
నందనోదయవార్త నా ♦ నంద మొందె. 14

14. తృష్ణార్తుఁడు = దప్పిగొన్నవాఁడు. ఖర కిరణ ఖిన్నుఁడు = సూర్యునివలన శ్రమనొంది నవాఁడు.

క. ఆ నలినాక్షికి వేనలి
చే నలి రుచిఁ గెలువఁ జాలు ♦ చెలువకు వలువల్
చే నిచ్చి వెనుక వచ్చిన
మానిని కుడగరలు కొన్ని ♦ మన్నించి తగన్. 15

15. అలిరుచి=తుమ్మెదలయొక్క కాంతి,ఉడగరలు=సొమ్ములు.

క. తానంబాడి మనీషి వి
తానంబున కర్థ మిచ్చి ♦ తానంతట సం
తానం బనఁదగి మగ సం
తానంబున నతఁడు ముదము ♦ తానం బయ్యెన్. 16

16. తానము, = స్నానశబ్దతద్భవము. మనీషివితానము=పండిత సమూహము. సంతానము = కల్పవృక్షము. ముదముతానము=సంతోష స్థానము.

గీ. పురుడు పరిపాలితాలకా ♦ పురుఁడు, శేష
భుజగ నూపురుఁడును గాక ♦ పుడమిఁ గలఁడె
యనఁగ సిరిగన్న రాజన్య ♦ తనయ మణికి
హర్ష మందిరి యంతః పు ♦ రాబ్జముఖులు. 17

17. పురుడు=సమానము. పరితాలకాపురుడు=పరిపాలించఁబడిన అలకాపట్టణముగలవాడు అనఁగాఁ గుబేరుడు, శేషభుజగనూపురుఁడు = శివుడు.

క. ధరణీశుఁడు బుధ మణి గణ
వర శరణం బపుడు రాజ ♦ వాహన సంజ్ఞా
భరణుఁడని బాంధవాంతః
కరణంబు ఫలింప నామ ♦ కరణం బిడియెన్. 18

18. ధరణీశ = రాజు, బుధమణివరశరణము = పండితశ్రేష్ఠసమూహమునకు ముఖ్యప్రాపకము.

శా. పౌలోమీధవ నీల ఖండ ఖచిత
ప్రాసాద సీమన్ సము
ద్వేల శ్రీల నుయాలతోఁ బెనిడి య
ర్థిన్ జంద్రమః కందళాం
దోళీ భావ దయార్ద్రభావయనుచున్
శుద్ధాంత వాటీ నట
ద్బాలా జాలము జోలఁ బాడు నచలా
పాలాగ్రిణీ బాలకున్. 19

19. పౌలో...మన్, పౌలోమీధవనీల = ఇంద్రనీలముల యొక్క, ఖండ = శకలములచేత, ఖచిత = కూర్చబడిన. ప్రాసాద సీమన్ = మేడమీఁద, సముద్వేల శ్రీలన్ = అతిశయించిన సంపదలచే, అర్థిన్ = కోరికతో, చంద్రమః కందళాందోళీభావ = చంద్రఖండమువలె ఆందోళభావముగలవాఁడా. దయార్ద్రభావా=దయచేచల్లనగు మనస్సుగలవాఁడా. శు...జాలము. శుద్ధాంతవాటి = అంతఃపురవీథిని, నటత్ = నాట్యము చేయుచుండెడి. బాలాజాలము = ఆడపిల్లల సమూహము. అచలా...లకున్ = రాజశ్రేష్ఠుని కుమారుని.

క. ముద్దుల నిడి పడకిండ్లఁ
ముద్దియ లాత్మీయ లెనసి ♦ మురియుచు నిద్రా
సుద్దుల నెత్తుచు నందొగి
విద్దెము విద్దెమని కాళి ♦ విద్దెం బచుచున్. 20

20. ముద్దియలు = స్త్రీలు, ముగ్ధాశబ్దవైకృతి. ఆత్మీయులు = స్వకీయులు, ఎనసి = కూడి, నిద్రాసుద్దులన్ = మంచిమాటలచే, ఒగిన్ = వరుసగా.

చ. జిలిబిలిపాలు జాలుకొను
చెక్కుల టెక్కును మద్దికాయలున్
గలుకలు రావిరేక చిఱు
గజ్జియ లందియ లైదుకైదువల్
గల యపరంజిబిళ్ళ తుది
గం బులిగోరునుఁ బుట్టువెండ్రుకల్
జెలఁగెడి పట్టి పండువులు
చేసెఁదగన్ దలిదండ్రి కంటికిన్. 21

21. జిలిబిలి=అందముగా. జాలుకొను = ప్రసరించునట్టి. మద్దికాయలు=ఆభరణ విశేషములు. కలుకలు = వజ్రశకలములు కూర్చిన. రావిరేక= రావియాకువంటి, చిఱు గజ్జియలు = చిన్నగజ్జెలుగల. అందియలు = అందెలు. అయిదంచులుగల యపరంజిబిళ్ళ గలిగిన బంగారపు పతకము. తుదిగన్ = చివరనుండునట్లుగా. పులిగోరును = పులిగోరుగూర్చిన యాభరణము. పుట్టువెండ్రుకల్ = పుట్టువెండ్రుకలును. చెలఁగెడిపట్టి = చలించుచుండునట్టి శిశువు.

శా. ఆలోలాస్య వినీత నూపుర పదా
బ్జాంగుష్ఠము న్నిస్రవ
ల్లాలా జాలము కేళి ధూళి పటలీ
లబ్ధాంగమున్ హస్తచే
ష్టా లగ్నేక్షణ కజ్జలాన్విత ముఖా
బ్జాంతంబునై మించు త
ద్బాలత్వం బొగి తల్లిదండ్రులకు దృ
క్పర్వంబు గావింపదే. 22

22. ఆలోల=చలించుచున్నట్టి. ఆస్య, వినీత = నోటియొద్దకుఁ దేఁబడిన. నూపుర = అందెగల, పదాబ్జాంగుష్ఠమున్ = పద్మమువంటి

పాదముయొక్క బొటనవ్రేలు కలది. నిస్రువల్లాలా జాలము = కారుచు నుండెడి చొంగయొక్క సమూహమును గలది. కేళీ ధూళి పటలీ లబ్ధాంగముఁన్ = ఆటయందు దుమ్ము సమూహమును బొందిన శరీరముఁగలది. హస్త...తంబు, హస్తచేష్టా = చేతులాడించుటను, లగ్న = అంటిన, ఈక్షణ కన్నులందలి. కజ్జల = కాటుకతో, అన్విత = కూడిన, ముఖాబ్జాతంబు = పద్మమువంటి ముఖముగలది. దృక్పర్వంబు = కన్నులపండుగు.

సీ. సాలముల్ రిపు ముట్టి♦సాధింతు నను లీల
    నా లంకెగడి డింపఁ♦గాలిఁ దిగుచుఁ
బలుమరు నెరయ ని♦ప్పగిది శత్రు శిరంబు
    చెండుదు నను మాడ్కిఁ♦జెండు గొనునుఁ
దన దాడి కరి డాఁగు♦ననురీతిఁ జెలికాండ్రి
    కదన డాగనముచ్చు♦లాడ నేర్చు
విమతుఁ డొందేగిన♦నెమకెద నన్న యు
    న్నతి నాడు సిరిసింగ♦నాల వృత్తి
గీ. నసపుఁ గప్పురపుంగుప్ప♦లవని నుంతు
    గూర్మి నను పేర్మివెన్నెల♦కుప్పలాడు
భ్రమర జిత మధుకర పాళి♦రాట్కుమార
    వాళి కేళీ వధూటీ ము♦దాళి యగుచు 23

23. సాలముల్ = కోటలు. ముట్టి = తాకి, లంకెపడిన కడి యమును. డింపన్ = దింపుటకు కాలిన్ = పాదముతో. దిగుచున్ = లాగును. నెరయన్ = ప్రసిద్ధముగా. చెండు = బంతిని. దాడికిన్ = దండయాత్రకు. అరి = శత్రువు. అదన = సమయమందే. విమతుఁడు = శత్రుఁడు నెమకెద = వెదకెదను. సిరిసింగనాలవృత్తి = బాల్యక్రీడా విశేషము. అసఁపు గప్పురపుంగుప్పలు=కీతికర్పూరపురాసులు. వెన్నెలకుప్పలు = బాలక్రీడావిశేషము. భ్రమర = ముంగురులచే. జిత =

జయించఁబడ్డ. మధుకర పాళి = తుమ్మెదల సమూహముగలవాఁడు.

క. ఉపనయన కర్మ మంతట
నుపనయసజనంబు పొగడ నొగిఁ దన విధు స
ల్లపన యనయంబు దనరం
నృప నయ నలినజుఁడు నడి పెనిజ తనయునకున్ 24

24 ఉపనయనసమూహము = జ్ఞానులు. విధుసల్లపన = చంద్రుని వంటి ముఖముగలది. అనగాఁ స్త్రీ, అనయంబు = ఎప్పుడును. నృప నయ నలినజుఁడు = రాజ నీతికి బ్రహ్మయగు రాజహంసుఁడు.

ఉ. మీసపు మొక్క నిక్కనకు
మిక్కిలి దొల్కటి వాన కుంతలా
ళీ సురపాల నీలమణి
లీలకుఁ గ్రొన్ననుసాన విభ్రమ
శ్రీ సరసీరుహంబు మద
సీధు రసప్రసవంబు సూనబా
ణాస తపఃఫలం బపుడు
యౌవన మబ్బెఁ గుమార మౌళికిన్. 25

25. మీసపుమొలకయొక్క నిక్కనకు మిగుల తొలకరివాన. కుంత...లీలకు = శిరోజములసమూహమనెడు ఇంద్రనీలమణి విలాసకు క్రొన్నను సాన = క్రొత్తదగు నున్నని సానరాయి. విభ్రమ శ్రీ సరసీరుహంబు = విలాస లక్ష్మికిపద్మము, మద సీధు రస ప్రసవంబు = మదమనెడు రసాయన ద్రవ్యముయొక్క పుష్పము, సూన బాణాసన తపఃఫలంబు = మన్మధునియొక్క తపోలాభము.

క. అంత స్థిత యౌవన మద
మెంతయు వెలికుటికి రేఖ లిట్టులై నిలిచెన్

సంతత మల భూమీ భు
గ్దంతికిఁ బెంజెంప మొత్తు ♦ గల చాల్మిగిడెన్. 26

26. భూమి భుగ్దంతి = రాజనెడి గజము. పెంజెంప = పెద్ద చెంప.

చ. కరి కలభంబు కొమ్మనపుడు
గైకొని బిట్టునఁ ద్రిప్పు తోడు పై
కరి గిరి యెత్తు సంగడము
కైవడి నవ్వలయాద్రిఁబట్టు గో
ట రహిని మత్త ఖడ్గిని బ
డల్చు రజంబుగఁ గొట్టు లోహము
ద్గర సముదాయ మచ్చిఱుత
కైపున భూపతి యావ నోద్ధతిన్. 27

27 కరి కలభంబు = గున్నయేనుఁగు యొక్క. కొమ్ము = దంతము. తోడుపైకరి = సరుస సుంచివలె. సంగడముకైవడి = సంకాళాలావలె. అవ్వలయాద్రిన్ = ఆ చక్రవాళాద్రిని. మత్తఖడ్గిని = మదించిన ఖడ్గమృగమును. బడల్చు = స్రుక్కునట్టుచేయును. లోహముద్గర సముదాయము = ఉక్కుముద్గరల సమూహము. చిఱుతకైపునన్ = కొలదిమైకముచే.

క. వేదంబున సకల కళా
వాదంబున గీతి కాన ♦ వద్య విపంచీ
నాదంబునఁ గవితాది వి
నోదంబున రాజవాహ ♦ నుఁడు ఘనుఁ డయ్యెన్. 28

28 విపంచీనాదము = వీణాధ్వని.

క. క్షితి వే యభ్యాసను పం
డిత విద్యలు గడియ కుడుకు ♦ నీరెచ్చుక్రియన్

బ్రతిప చ్చంద్ర రుచిం జలె
నతని కళ లగనియెం బ్రతి ది ♦ నాభ్యుదయంబున్. 29

29 వే = శీఘ్రమున, అభ్యాసను=అభ్యాసముచేత ఉడుకునీరు= ఉష్ణజలము. ప్రతి పచ్చంద్రరుచిన్=పాడ్యమినాటి చంద్రకాంతి, అతని కళలు=అతనివిద్యలు. అభ్యుదయము = అభివృద్ధి.

ఉ. ఈవికి నిమ్ము భోగమున
కింకువ, చక్కదనంపుం దేటకున్
దావు, ప్రతాప సంపదకుం
దానక మంచిత సూక్తిసూనపుం
దావికిం డెంకి, కార్యకల
నంబున కిల్లు, రణాంగణాటవీ
పావకు రాజవాహన
నృపాలశిఖామణిం జెప్ప నొప్పదే. 30

30 ఇమ్ము, ఇంకువ, తావు, తానకము, టెంకి, ఇల్లు, ఇవిపర్యాయార్థకములు. రణాంగణాటవీపావకుయుద్ధప్రదేశమనెడుఅరణ్యమునకు అగ్నిహోత్రుండు.

సీ. ఏకుండు వాగ్ద్వైతి ♦ యాకపణావద
ధ్యత్ముం డాకృతిం దృతీ ♦ యాశ్వినేయుం
డుర్వోజమునం దుర్య ♦ పూర్వ దక్షిణావర్తి
గాంభీర్యమున పంచ ♦ మాంభసాంప
తింద్రుండు డీగిని షష్ట ♦ మోంద్రమహీజంబు,
జన రక్ష సప్తమ ♦ చక్రవర్తి
శమమునం దష్టమ ♦ సంయమి ప్రవరుండు
గరుశక్తి నవమ ది ♦ క్కుంజరంబు

గీ. కళ దశమ ధాత మహిమ నే ♦ కాదశావ
తరము కార్ముకవిద్య ద్వా ♦ దశ భవుండు
దీప్తకాంతి త్రయోదశ ♦ సప్తసప్తి
తగదె మగధేంద్రుఁ బొగడ ని ♦ ద్ధాత్రి నెగడ. 31

31 ఏకుండు-ముఖ్యుడు వా...త్ముఁడు-భాషయందు రెండవ శేషుఁడు. ఊర్జోజమునన్-అధిక తేజమునందు, తుర్యపూర్వదక్షిణవర్తి-నాలవయగ్ని. పంచమాంభసాంపతీందుఁడు = అయిదవ సముద్రుఁడు - ఈగిని = ఈవి యందు. షష్ఠ మహీజము = ఆఱవ కల్పవృక్షము. సంయమి వరుఁడు - ఋషిశ్రేష్ఠుఁడు. కళన్ = విద్యయందు దశమ ధాత = పదియవబ్రహ్మ. ద్వాదశభవుండు = పండ్రెండవ రుద్రుఁడు, త్రయోదశ సప్తసప్తుఁడు = పదమూఁడవ సూర్యుఁడు.

తాత్పర్యము. భాషాసంపదయందు శేషుఁడు, చక్కదన మున అశ్వినిదేవత, ప్రతాపమునకు అగ్ని, గాంభీర్యమునందు సముద్రుండు దాతృత్వమందు కల్పవృక్షము, పరిపాలనకు చక్రవర్తి, శాంతమున ఋషి, అధిక బలమున దిగ్గజము, విద్యను, బ్రహ్మ, మహిమను అవతార పురుషుఁడు, ధనుర్విద్యను రుద్రుఁడు, కాంతిని సూర్యుఁడు అని పొగడు చుండఁగా నెగడుచున్నాఁడనుట. ఈ పద్యమున 1 మొదలుకొని 12 వఱకునుండు సంఖ్య వారితో నాయాగుణములను పోల్పఁబడుటచే సంఖ్యాలంకారము.

క. కట్టు వడఁగొట్టు కైదున
కట్టలు గొను మరున కిరవు ♦ గట్టిన గతిఁ గ
న్పట్టిన పట్టికి యువరా
ట్పట్టము గట్టెన్ ధరాధి ♦ పతి యట్టి తఱిన్ 32

32. కట్టు వడఁగొట్టు కైదువడి కట్టులు = మిక్కిలివాడిపోవునట్టి. యాయుధముల కట్టలను అనఁగా పుష్పబాణములను గొను = గ్రహించెడి, మరునకున్ = మన్మథునకు, ఇరవుగట్టిన గతిన్ = వీఁకేర్పరచిన యువరాట్పట్టము = యౌవనరాజ్యాధికారము.

ఉ. పట్టము గట్టి చుట్టపు నృ
పాలుర యొడ్లను పెండ్లిచేసి యే
పట్టున లోఁగ కుద్ధతిని
బాండ్యులు గప్పము బెట్టుకున్కి నా
రట్ట తురంగ ఘట్ట గజ
రాడ్భట కోటులఁగూర్చి పట్టికేల్
పట్టి యుగంధరాది నయ
వద్వర మంత్రులఁజూపి యిట్లనున్. 33

33. లోఁగక = లోఁబడక, ఉద్ధతిన్ = గర్వముచే, పాం
డ్యదేశపురాజులు, కప్పములు = పన్నులు, ఆరట్టతురంగఘట్ట = అరట్ట
దేశపుగుఱ్ఱముల సమూహము, గజరాడ్భట కోటులు = గజశ్రేష్ఠము
లును, భటసమూహములును, పట్టికేలుపట్టి = కుమారుని హస్తము
పట్టుకొని యుగ...త్రులన్ = యుగంధరుడు మొదలుగాఁగల నీతి
మంతులలో శ్రేష్ఠులయిన మంత్రులను.

ఉ. చెప్పిత నీతులం జెవులఁ
జేర్చుట, శేష మనీష శేషులై
యొప్పిన సోమ దత్త సచి
వోత్తమ వంశ సముద్భవుల్ బుధుల్
చెప్పిన కార్య పద్ధతులు
చేయుట, గొల్చిన పేద సాదులన్
జప్పున జీత నాతము లో
సంగుట భూషణముయ్య పుత్రకా. 34

34. అశేష మనీషన్ = అధికబుద్ధిని, శేషులు = శేషునివంటివారు.

క. హిత మంత్రి పురోహిత బుధ
తతిఁ బ్రోచిన పిదప మనుపఁ ♦ దగు నోరు సీతా

పతియును "స్వజనస్యచ ర
క్షిత" యన వినవే విపక్ష ♦ శిక్షా దక్షా. 35

35. హిత...తతిన్ = అనుకూలు లయిన మంత్రులను, పురోహితులను, పండిత సమూహమును. ప్రోచినపిదపన్ = కాపాడినపిమ్మట. "స్వజనస్యచ రక్షితః" స్వజనులకు రక్షకుఁడు.

క. పూట నగు కార్యగతు లొక
నాట న్మఱినాట గనెడు ♦ నయ కార్యములో
క్కేటం జేయుట మేలగుఁ
గోటలపై వేగిరింప ♦ కుము వేయైనన్. 36

36. స్పష్టము.

క. పదరినఁ గార్యము సెడు సం
పద చెదరు మహాపదలకుఁ ♦ బదపడు "సహసా
విదధీతనక్రియా" మను
చదు వార్యులు చదువ వినవె ♦ శశివంశ మణీ. 37

37. పదరినన్ = త్వరపడిన, పదపడు = సిద్ధపడు, సహసా విదధీతనక్రియాం = కార్యము తొందరపడిచేయకు.

క. సుతవిజయముఁ జేయు మటం
చత డప్పుడు పల్కె ధర్మ ♦ మందిన జయముల్
సతములగు "యతోధర్మ
స్తతోజయ" యనెడు వచనము♦దలపుమ యనియెన్.

లయగ్రాహి

బంగరపు చెక్కులఁ జె ♦ లంగు చవుకట్టుల
మెఱుంగు బలు చుక్కల ప ♦ యిం గిఱిసి జంగల్
చంగునఁ గొనఁ సరిగ ♦ రంగుగల కుట్టు పస
కంగులఁ గడల్కొనిన ♦ యంగి పయి దోర

త్సాంగదము కుంకుమ త ♦ రంగములఁ గుప్ప జిగి
వాంగు బురుసాపని బె ♦ డంగు గల కుళ్ళా
నింగికి తళత్తళ లా ♦ సంగ సతడంత నృప
పుంగవు హజారమున ♦ కుఁ గదలి వచ్చెన్. 39

39. జంగిల్ గొనన్ = దాట్లువేయఁగా, సరిగ = జలతారు, కెంగులఁ గడల్కొనిన = కుగ్గులుదీరిన, దోః = బాహువునందలి, బురుసా = బ్రూసెల్సునను పట్టణపుపట్టు, కుళ్ళా = టోపీ, హజారము = సభాస్థలము.

క. వచ్చి తన భటుల నిటల న
టచ్చటుల కరాబ్జులై క ♦ డలఁ బొగడఁగ వై
యచ్చర విభు వైభవ పా
టచ్చరుఁడు ప్రతాప శిఖిప ♦ టచ్చర దరియై. 40

40. వైయ...చ్చరుఁడు-ఇంద్రవైభవమునకు దొంగ, అనఁగా నింద్రునిమీరిన వైభవముగలవాఁడు. ప్రతా.. రియై - ప్రతాపశిఖి ప్రతాపాగ్నికి. పటచ్చరత్ = పాతగుడ్డలైయాచరించుచున్న. అరియై శత్రులుగలవాఁడై.

సీ. మథనాగ విచల త్త్వ ♦ మథ నాథ శిశిఖ శ్వ
శుర విశ్వ ఘుమఘుమీ ♦ గరిమ జెనకి
మిహికా శిఖగి గళ ♦ న్మహికాత లోచ్చంగ
దఃరు ఝరీ గుభగుభీ ♦ వరిమఁ దెగడి
ప్రళయావసర సము ♦ జ్జ్వల యాగ హార కరో
ద్ధత ధాక్కథమథమ ♦ ప్రడిమఁ దరమి
బుధరా ణ్ణికృత్త భూ ♦ మిధరాగ్ర పత దశ్మ
పటువర్ష ఘణఘణా ♦ ర్భటులఁ బరఁగి

గీ. కకుబిభశ్రుతి భంగ భాం ♦ కార భావ
భీమములు భోగి భూభార ♦ భిద్భుజారి
భూరి పుటభేదనంబులు ♦ భోరసంగ
భేరి జరిపించె భూరి గం ♦ భీర మహిమ. 41

41. మథనాగ = మందరపర్వతముచేత. విచలత్ = కదలుచున్న. ప్రమథనాథ = శివునియొక్క. విశిఖ = బాణమగు విష్ణువుయొక్క. శ్వశుర = మామయగు సముద్రునియొక్క. విశ్వ = సమస్తమైన, మిహికాశిఖరి = హిమవత్పర్వతము. ఉచ్చంగత్ = కదులుచున్న. ఢాక్కా = ఢక్కాసంబంధమగు. బుధరాట్ = ఇంద్రునిచేత. నికృత్త = నరకఁబడిన. అశ్మ = రాళ్ళయొక్క. భూభారభిత్ = భూభారమునఁ గొట్టివేయుచున్న, అనఁగా శేషువుబరువును దేలికచేయుచున్న. భుజ = చేతులుగల. అరిభూప=శత్రురాజులయొక్క, పుటభేదనంబులు = పట్టణములు.

క. భువి పగిలెన్ రవి రవినొగిలెన్
దివి పిగిలెన్ దిగ్గజముల ♦ ధృతి సన్నగిలెన్
గవిఁ దగిలెన్ హరుడున్ ధృత
పవి మొగిలెన్ భూరిభేరి ♦ భాంకారమునన్. 42

42. గవిన్ = గుహయందు.

సీ. అపరంజ మొసలి వా ♦ యనుసుల శిరసుతోఁ
గనుపులు త్రొమ్మిది ♦ గలుగుకొమ్ము
నల సూర్యపుటము పో ♦ న్నాణెంపు సరిగ మే
ల్కట్టు పనుల హెచ్చు ♦ పట్టుకుచ్చు
లుదిరి కంకణము లిం ♦ పొసఁగు దంతపుగోడెల్
నయము మించిన ముస ♦ నాబు పటము
పై పచ్చడాల్ పత్తి ♦ పరపుపై మెఱుపుమై
రాణించు చలువ పై ♦ తాణి మీరి

గీ. యొరపు లెఱనొ కరంబు రం ♦ గారగు నెపుట
బనివలపు లిచ్చు పచ్చారు ♦ పసిడిపట్టు
బటువు జోడును బటువు పై ♦ పుటము గులుకఁ
బూని రందల మొంతయు ♦ బోయులంత. 43

43. అపరంజి = బంగారు వికారమైన, మొఁసలివా = మొసలి మొఁగలినోళ్ళుగల, అనుసుల = తోళ్లుగల, కొమ్ము = పల్లకీదండీ. పొన్నాకెంపు = పొన్ను = బంగారము చేత, అకెంపు = ప్రశస్తమైన, ఉదిరి = మేలిమి బంగారము, గొడెల్ = బిరికీలు. ముసనాబు = అండలము ప్రక్కతెఱ. పైఠాణి = పఠాని దేశపు దుప్పటి. ఎఱ = ఎఱుపు. ఒరఁగు = బాలీసు. బటువుజోడు = పెక్కుముల జత. పుటము గులుకన్ = అతిశయించఁగా.

సీ. గొనబుగా నురులఁ జె ♦ క్కిన చెంగు తోడ జే
నెడు బాఁకుతోఁ బొల్చు ♦ నీవిదట్లు
ముందర ముడిఁగొని ♦ ముంగొంగు వెలివెట్టి
మాటు చెంగావి రు ♦ మాలు వులును
వ్రేలి వలంబున ♦ వ్రేలెడు మెడ నూళ్ళు
జాళువా ముంజేతి ♦ జతుల వ్రాళ్లు
మొన పాటి ముత్తె ముం ♦ చిన నాగ వడిగెలు
బిగువొప్పఁ దొడిగిన ♦ బిళ్ళచెప్పు
గీ. లొనరు దుప్పట్లు కడ నిల్పి ♦ గునుకు నడల
నుచిత నిజభాషణంబుల ♦ నొంటి యొంటి
హస్తమునఁ బూని యొక్కొ_స్తి ♦ బెస్త బిడ్డ
లందలము నిల్పి రవని పా ♦ లాగ్ర సీమ. 44

44. ఉరులక్ = వ్రేలాడునట్టుగా. చెక్కిన = దిద్దినట్టి. నీవిదట్లు = ముడివేసిన కాసెకొకలు. జతులవ్రాళ్ళు = చప్పుడు

చేయునట్టి గొలుసులు. నాగవడిగలు = చెవులనుంచుకొన్న నాగు జోళ్లు. ఒకాస్త్రి = ఒక్కపాదవుగల.

ఉ. పట్టుమెఱుంగు జూ లుభయ
పార్శ్వ ఘణంఘణ నాద ఘంటికల్
మట్టు మెఱుంగులై మొరయ
మస్తక మందును దృష్టి దండ గ
న్పట్టిన కర్ణ చామర మ
పారపు మేలును మేలు మేలనం
బట్టపు దంతి నెక్కి నర
పాలుని చెంగట మావటీ డొగిన్. 45

45. జూలు = ఏనుగుపైపరచు రంగుదుప్పటి; మేలు=ముదము.

ఉ. సాన మెఱుంగు రంగులఁ బొ
సంగు పిరంగి పరంగి కేడెమా
హా నెఱయించు సింగిణులు
నంప దొనల్ హురుమంజి పల్ల మిం
పైన ఖలీనముం బిరుదు
టందియు గజ్జెలపేరు బూని దా
సాని పటానిఁ దెచ్చె మహి
జానికి రా తెరగంటి శ్రేణికిన్. 46

46. పరంగికేడెము - హురాణదేశపుడాలు. అహా నెరయించు - ఆశ్చర్యముఁ గలిగించునట్టి. సింగిణులు - ధనస్సులు. అంపదొనల్ — అంబులపొదులు. పల్లము -జీను. ఖలీనము=కళ్లెము దాసానిపటాని - దాసానిదేశపుగుఱ్ఱము, రాతెరగంటి శ్రేణికిన్ = రాజేంద్రునికి.

క. పౌరులు జయవెట్టఁగఁ బరి
చారకు లగచట్ట జొగసు ♦ సవరింపఁగఁ దు

ఖ్ఖారతురంగము నెక్కి యు
య్యారంబులఁ జొక్కి జైత్ర ♦ యాత్రోన్ముఖుఁడై. 47

47. అరచట్టన్-కటిపర్యంతమువచ్చునట్టి అంగీయంచు. దొరుఃహారవిశేషమును. తుఖ్ఖారతురగరము - తుఖ్ఖారదేశపు గుఱ్ఱము.

క. ప్రభుఁ డపుడు వెడలెఁదపన
ప్రభుఁడై మకరధ్వజములు♦రా భూచక్రం
బు భయ చ్ఛత్రంబుల చల
దుభయ చమర వాలముల స♦ మున్నతి నిగుడన్. 48

48. తపన ప్రభుఁడు- సూర్యునివంటి కాంతిగలవాఁడు. రాన్ రాఁగా. భయచ్ఛత్రంబుల - భయముయొక్కయు, గొడుగుయొక్కయు, ఆనఁగా భూజనులు, రా, భయముచేతను, భూమి యావత్తు గొడుగుచేతను, వ్యాప్తమైనదనుట.

సీ. కదలె నున్నత గంధ ♦ గంధమాదన బాధు
బంధురంబులు గంధ ♦ సింధురములు
చనియె నింపు ఘౌసంగ ♦ సంగర క్షితి రంగ
రంగదంఘ్రిగతి తు ♦ రంగ సమితి
గమనించె జోకం దఁ ♦ గం దళద్ద్యుతి కంద
కంద ప్రధన కేళి ♦ స్యంద నాళి
యరిగె భర్మ ధరాధ ♦ రాధరీకృతి సాధి
సాధిష్ట ధృతి మహా ♦ యోధ వితతి
గీ. సన్న వీరణముల మోగిత ♦ శంఖ కాహ
ళార్భటీ డక్కికా హుడు ♦ క్కారదములు
దిక్కులనుఁ బిక్కటిల్లంగ ♦ జక్కి నెక్కి
పుడమి జేడూరి వాకిలి ♦ వెడలు నపుడు. 49

49. ఉన్నతగంధ - గొప్పగర్వముగల. (ఏనుగులకు విశేషణము) గంధసింధురములు మదపుటేనుగులు. కందళ...కేళి - (కందళత్ - అంకురించుచున్న. ద్యుతి - కాంతులకు. కంద - మేఘముల యొక్క. ప్రధన కేళి - యుద్ధక్రీడగలది, అనగా మేఘములవలె నేనుగులున్నవనుట.) భర్మ...ధృతి - (భర్మధరాధర - మేరుపర్వతము యొక్క. అధరీకృతి - క్రిందుగాఁ జేయుటను. సాధి - సాధించుచున్న సాధిష్ఠ - మిక్కిలిదృఢమగు. ధృతి - ధైర్యముగల. మేరువుతో సమానమగు ధైర్యముగలది.)

సీ. అంగంబునఁ బొసంగ ♦ నలవరించిన మట్టి
యుదయాద్రి నీరెండ ♦ యుదుట నిల్పఁ
దల నూనె బలుకప్పు ♦ ద్రావిడీ స్తనపాళి
కస్తూరి నెఱపూత ♦ మస్తరింప
కుందనంబు మదంబు ♦ కులశైల కూటంబు
సెలయేటి నీటితోఁ ♦ జెలిమి సేయఁ
గొమ్ము కత్తుల సొంపు ♦ కొమ్మల కొనదండ
మొగలి మొగ్గలతోడ ♦ ముచ్చటాడఁ
గీ. గడల బంట్లిరుగడల రా ♦ ఘుళఘుళీస
మగ్రి పద నిగ్గళానర్గ ♦ ళోగ్ర వృత్తి
పెర గజము కీలుగీల్కొన్నఁ ♦ బృథివి మూరు
కొని మసలి పోక యొకభంగిఁ ♦ జనియెఁ గరులు. 50

50. కుందనంబు మదంబు = బంగారమువంటి మదము కొమ్ము... = ముచ్చటాటు. దంతములపైనున్న కత్తులు కొమ్మలపై నున్న మొగలిమొగ్గలవలె నున్నవని తాత్పర్యము. నిగ్గళ = గొలుసులు. పెరకి...ల్కొన్నన్ = ఇతర గజముయొక్క జాడఁదెలిసినయెడ.

శా. తైలాంచ త్కచ పాళిఁగూర్చి మెలులొం
దం జుట్టి మేల్పాగ లం

గీలు న్నింగిణిచే కటిం దరకసా
ల్కొంపైన మీసంబు తాం
బూలస్యాబ్జ బలంబు లత్యరుణ దృ
ఙ్మూర్తుల్ విరాజిల్లఁ దే
జీలం బొల్చు పఠాణి రాతుగమి వ
చ్చె న్మెచ్చ రా చెంతకున్. 51

మ. తల నిద్దా తగటీలు పేరణులపై
దట్లున్ రుమీ చూరగ
త్తుల జోళ్లుం బదనించి నట్టి కరహే
తుల్ తళ్కు గుల్కంగ ర
క్త లురత నేత్రి కరాళ వక్త్రముల న
గ్రశ్రేణిఁ గంఖాణికా
వలి కం దోలి సలాముఁజేసె యవన
వ్రాతంబు భూభర్తకున్ 52

52. నిద్దా తగటీలు=తళుకైన జరీలు. (అనఁగా జరీపాగాలు) పేరణులు = అంగీలు, దట్లు = కాసెకోకలు. రుమీచూరకత్తులు = రోముదేశపుకత్తులు, పదనించిన = పదును బెట్టినట్టి, రక్తలురత్ = ఎఱ్ఱనివై కదులుచున్న, కంఖాణికా = ఆడుగుఱ్ఱముల మొత్తము.

చ. పటిమ నటించు సోగ వగ
పాగల నెన్నడు చెంగులుం గటీ
పటులఁ గటారులుం గురుచ
బల్లెము లుండిన పిల్లబంట్లకై
ఘటిలిన డేగలు న్మూడియు
కట్టల గట్టుప లీడ్చు తట్టువల్

జిటిలెడు గందమొప్పఁ గాఁ
జీతపు రాజులు వచ్చి రంతటన్ 53

53. నెన్నడుచెంగులు = వీపు మధ్యకువదలిన కొనలు, కటీపటుబన్ = మొలకట్టుబట్టలయందు, కైఘటిలిన = చేతిపైనుంచిన.

చ. చరణ తలంబునం బసపు
సన్నపు పావడ పెట్లు గంటలుం
బిరుదులుగాఁగ నెన్నొసఁటఁ
బెట్టిన కాపులు చల్లడాల ద
ట్లర యొరడించి వైచిన శ
యంబుల కత్తులు బిత్తరింపఁగా
నరిగెల బంట్లు చాలరిగె
నప్పుడు చప్పుడు గుప్పుళింపఁగన్ 54

54. పావడలు = లాగులలో భేదము. పెట్లుగంటలు = మిక్కిలి ధ్వనించు ఘంటలు, కాపులు = దిష్టిబొట్లు, చల్లడాలదట్లు = లాగులపై కాసెకోకలు, అరయొరడించివైచిన = సగముగా నోరలో దింపిన, శయంబుల = చేతులయందైన, అరిగెల = డాళ్ళుగల.

ఉ. దట్టపు వన్నె గూడ కట
దట్టి పొరన్ సవరించిపట్టె పై
గట్టి కటారి జల్లి మడి
కాసుల కట్టుల యెక్కువిండ్లు పె
న్నెట్టెపు గిట్ట నెట్టుకొను
నిద్దపు వీఁపు దోనల్ నటింప మై
పుట్టున నల్ల బెబ్బులులె
పో యనఁ బోయిరి బోయ బల్లిదుల్. 55

55. వన్నెగుడ్డ=రంగుగుడ్డ, కఱదట్టి = నల్లనైన కాసెకోక, కటారిజల్లి = కత్తియొక్క జాలరు, పట్టె = పటకా, మడికాసుల = వెండితోఁజేసిన, నెట్టెపుగట్టన్ = పాగాకట్టునందు, నెట్టుకొను = తగులుకొనునట్టి, బోయబల్లిదుల్ = బలవంతులగు బోయవాండ్రు.

క. బాణాసనములు కోలలు
పాణింగొని హస్తిలోహ ♦ పటుతర కటక
శ్రేణి ఘణిల్లన నృప సుమ
బాణుఁడు గన గోణి గదల ♦ బంట్లరిగి రొగిన్ 56

56. గోణి = చిన్నవస్తువులు వేసికొనుటకు వీపున వేసికొన్న సంచి.

సీ. నును దట్టిఁ జిక్కఁ జె ♦ క్కిన వంకి పసపు పా
వడఁ బొల్చు చే కత్తి ♦ నిడుద గడలు
నెరిఁ జుట్టు సిగ నొంటి ♦ పొరగుడ్డ పని వడిఁ
దీర్చు కోవెలకుంట ♦ తిరుమణులును
మొన వాడిఁ ద్రిప్పి తో ♦ మిన మునిపండ్లపైఁ
దళుకు తళ్కనెడు కుం♦దనపు రవలు
తోమ్మ గాయమ్మల ♦ నెమ్మిఁ గాయలు గాచి
జిగి నించి మించెడి ♦ పగడములును
గీ. దయ నయాదుల గురులిడ ♦ తాయెతులును
బులులఁ బొడిచిన నాటి సా ♦ ములును దొంటి
యొంటి జగడంబు బెళకు లిం ♦ పొసఁగ నడచె
డాక నరపాలు వెంటనొం ♦ టరుల మూక. 57

57. దట్టిఁజిక్కన్ = కాసెలో నిముడునట్టుగా, చెక్కిన = కూర్చి నట్టి, వంకి = బాకు, కోవెలకుంట తిరుమణులు = దేవాలయపు

షండులోని తిరుమణులు, మొన...రవలు(మొన లరుగు నట్టు దంతధావనము< జేసిన ముంగరి పండ్లపైని సొగసుకై వేసిన జంగారపు పువ్వులు.)

దయ...తులను (దయచేతననగా సంరక్షణ నిమిత్తమును, నయాదులన్ = నీతిఆచారము మొదలయినవానిచేత ననగా దేశాచారాదులచేత< తలిదండ్రులుంచిన రతులు.

ఉ. ఇంటికి బొమ్మ క్రమ్మర< జె
లీ! నిలు నిన్నిలు సేర్చి వత్తునో
వెంటనె దండు వచ్చెదవొ
వేగమె రా మఱియేల యందువో
యొంటి నిటున్న నళ్కొదవు
నో యని యాత్రకు నిక్కి రొక్కరం
బొంటరి జూచుచుండె< జను
చుండెడు మంది సఖీముఖేందునిన్. 58

58. అళ్కు = భయము, ఒంటరి = ఒక్కడుగా, మంది = జనులు.

ఉ. పైన<పు దట్టి< గట్టుకొని
బద్దుల పుట్టిక వెంటరా<గ రా
సాని పసాని నవ్వ నెల
జవ్వని రా<గని యొక్క సాని యో
సాని మిటారి నీకు దొర
సానికి నీనడ చెల్లదంచు భూ
జాని పటానిగా యనక
జక్కి వెసం దిగి కొమ్మ కొమ్మనే 59

59. పైనపుదట్టి = ప్రయాణాను కూలమయిన లాగు. బద్దుల పుట్టిక = అబద్ధాల మారి. అన<గా ఇచ్చకాలు జెప్పు చెలికత్తె, రాసాని=

రాజుభార్యయొక్క. పస = శోభను. అని = పొంది. ఒక్కసాని = ఒక్క స్త్రీ. (ఇచ్చకాల మారియగు చెలికత్తెను వెంటఁ బెట్టుకొని రాజభార్య వలె నొక సానిది రాగా దానినిఁజూచి మరియొకతె యేమ నుచున్నదంటే, నీవు దొరసాని వంటిదానవు, నడచిపోవుట యుక్తము గాదు, రాజుగారి గుఱ్ఱమని సందేహించక వేగముగా వెళ్ళి ఓకొమ్మా కొమ్మ = అనగా దానిని బుచ్చుకో అన్నదని తాత్పర్యము.

శా. ప్రబ్బుం జాయల గీలుగంట్లు చెవి యో
రం జాలు కొప్రోగు లా
గుబ్బ నిబ్బరపుంగనీదు వికెం
గ్రొమ్మించు పుట్టించు చన్
గుబ్బల్ పాదపుఁ జుట్లు కన్నుల ముసుం
గుల్ సుబ్బ బిబ్బోకమా
బిబ్బీ గబ్బి మిటారు లెక్కు తురగీ
బృందంబు చిందెన్ నడల్ 60

60. కీలుగంట్లు = జడలు. చాలుకొన్ = వరుసగానున్న. ఆగుబ్బన్ = అతిశయించఁగా. పాదపుజుట్లు = కాళ్ళ మెట్టెలు. మబ్బన్ = ప్రకాశింపగా. బిబ్బోకము = విలాసమును. ఆన్ = పొందిన. బిబ్బీ...టారులు = మ్లేచ్ఛస్త్రీలు. నడల్ = నడకలను. చిందెన్ = చిమ్మెను.

ఉ. నెన్నడఁ జూపె వెండి రహి
నిండిన సందిటి బొందు భూతిత్రో
నెన్నొస లానఁ బాల్పెరుగు
నెయ్యని వాఁడెడు కోడెకాంద్రపై
వెన్నెల సోగ లీను జెలి వెన్కను
గన్నవఁ గన్న పాయపుం

గన్నడ కన్నె లెక్కిన చొ
కారపుమంకెన గిత్తలత్తరిన్ 61

61. వెండి...బొందు = వెండియొక్క శోభచే నిండిన, దండ చేతిదండ. వెన్నెల సోగలు = వెన్నెల వంటి దీర్ఘప్రసారములు. ఈనన్ - పుట్టించునట్లుగా. చెలివెనొ్కను...గన్న = చెలికత్తెవెనుకను బోవుచున్న నేత్రద్వంద్వముఁ బొందిన. మంకెన గిత్తలు = పైనివేసిన బరువులు జారిపోకుండునట్లు గట్టిన పేపబుట్టలుగల యెద్దులు. నెన్నడఁ జూపెన్ = నడుమ నారంభించినది.

శా. నానాధ్వన్యవిలోకబృందములకుం
దావిండుఁ గావించె దా
స్యానీతాంచిత వీటికా బహిరిత
ప్రాంచత్కరాగ్రంబునం
గీనం దుస్ఫుటి దిద్ధి యందలములో
నిల్లేగి కొం చప్పు శ్రో
ణీనాథు న్వరియించు మానిని హిమా
నీచ్ఛన్న పద్మాకృతిన్. 62

62 దాస్యా...గ్రంబునంగు - దాసిచేతఁ దీసుకొనరాఁబడిన తాంబూలముకొఱకు, వెలుపల ఇత - పొందినట్టి. చేతిచివరయొక్క అంగు - శోభ, ఈనన్ - పైకిఁ గనఁబడునట్లుగా. ఏగికొంచుపోవును. శ్రోణీ... మానిని - రాజుయొక్క భోగినీస్త్రీ. అనగా బురకావేసిన పల్లకీలోనుంచి దాసియిచ్చు తాంబూలమునకై చాపిన చెయ్యిఁజూచిన మాత్రిన చూపరుల కానందమయ్యెనని తాత్పర్యము.

సీ. లావణ్యలహరి క ♦ ళానిధి కనకాంగి
మద కురంగి మదాళి ♦ మణిశలాక
కాలంజి యడపంబు ♦ తాళవృంతము గిండి
కుంచె వింజామరఁ ♦ గొంచు నడువ

కటిని నిండఁదోపు దు ♦ ప్పటి గట్టి యుత్తరీ
యము లూని కేలు గే ♦ లమరఁ బట్టి
పట్టెవర్ధన ఫాల ♦ పట్టిక నిక్కు ద్వి
జ ద్వయి రాఘవా ♦ ష్టకము జదువ

గీ. బిరుద ముద్రలు పెద్దలు ♦ బిగిసి రాజు
వెంటఁగొలుచుచు నడిచెడి ♦ వేళఁ జేరి
వారి ముద్దుల మఱఁదిరా ♦ వసుమతీశు
గారవపుఁ గొమ్మ పల్లకీ ♦ గదలె నపుడు. 63

63. ప్రథమ చరణమంతయు దాసీజనము పేర్లు. కాలంజి - గుడుగుడీ. అడపము - తాంబూలపుసంచి. తాళవృంతము - విసనకర్ర గిండి - కూజా. కుంచె - సెమలికుంచె తోపుదుప్పటి - ఎదుపు దుప్పటి. ద్విజద్వయి - ఇద్దరుబ్రాహ్మణులు. (రాజుగారి బావమఱఁది అప్పగారిపల్లకీతో జాగ్రత్తకై యుండుట న్యాయము.

చ. పిడికెడు జందెము ల్మొనలఁ
బెట్టిన సన్నఁపు పట్టెనామముల్
గడితఁపు దుప్పటీల్ కుఱుచ
గాలి కటారులు గప్పు మీసము
ల్బడి గతిఁ జెప్పుచున్ ద్విపద
బాపఁడు నొప్పఁగ నేగెఁ బల్లకీ
కడల సతంబుగా నగరి
కావలిఁ గాఁచిన రాచ పైకముల్. 64

64. గడితపు - గొప్పవియగు. కప్పు - నల్లనైన. ద్విపద బాపఁడు - ద్విపదిఁజదువు బ్రాహ్మణుఁడు. సతంబుగాన్ - నమ్రత గలుగునట్టుగా. పైకముల్ - సమూహములు.

మ. పెసరుం గాయకు మెత్తకన్నులకునై
వేఁటాడు మన్ గొఱ్ఱెలన్
నుసలం జూచుచు దోసచేల్ చెఱకుచాల్
నుగ్గాడుచున్ సజ్జఁ గో
య సుమాళింపుచు సేనరాపెగసి కా
ళ్ళావంక కీడొంకకై
యస దంచం జదరంపు గుంపరిగె నా
హా! యా శరద్వేళలన్. 65

65. మెత్తకన్నులు = చేనుకోసినతరువాత నిల్చియుండు చొప్పదంట్లు. పేటాడు = పెనుగులాడు. నుసలన్ - లాగుటకు. నుగ్గాడుచున్ - నిలిపివేయుచు, సజ్జన్ - నిలిపివేయుచు. సజ్జన్ - సజ్జపెన్ను. సుమాళింపుచున్ - దుముకుచు, సేనరాపు - పెద్దగందరగోళము. అసదు - కొంచెము. అంచన్ - పంపఁగా. (కాళ్ళు ఇటూ అటూ దుమికించుచున్నవి యనుట.)

గీ. శారదాభ్రాకృతులఁబోరు ♦ సలుపవచ్చు
శక్ర కరి మోముపై నీళ్ళు ♦ జల్లె ననఁగ
వమథు లుడు వీధిఁజల్లుచు ♦ వారణంబు
లరిగె గెల్చుట కడమ ది ♦ క్కరుల నెంత. 66

66. వమథులు - తుండములలోని జలబిందులు. కడమ దిక్కరుల గెల్చుట యెంతపనియని యన్వయము.

సీ. సస్యకైదార్య మా ♦ శ్వచ్ఛటా ఖురపుటీ
త్రుటితమై వేవిలి ♦ దుక్కిగాఁగ
గడియలోఁ గరి కొమ్ము ♦ కడిమిచే నడవి పాం
డవ బలధ్వస్త ఖాం ♦ డవము గాఁగ

రథచక్రకృత నిమ్న ♦ పథరేఖ జలధికిఁ
బటుతర ప్రత్యగ్ర ♦ తటిని గాఁగ
భటకోటి సున్నంపు ♦ పదనుచేఁ జెఱువులు
మునిముఖ్య చులికితాం ♦ బుధులు గాఁగ
గీ. బిట్టు శతయోజనంబుల ♦ పెట్టు కాపు
లాత్మగృహ భూమ్యనిర్ణయ ♦ వ్యథలఁ గదల
విమత నృపకోటి పుటభేద ♦ నముల మీఁద
దండు దిగె రాజు విక్రమో ♦ ద్దాముఁ డంత. 67

67. సస్యకైదార్యము = చేలుగల పొలము. వేవిలి = దున్నని నేల. కరికొమ్ముకడిమిచేన్ = ఏనుఁగు దంతముల బలముచేత. సున్నంపు పదను = తాంబూలపు సున్నము దడపుట. మునిముఖ్యచులుకిత = అగస్త్యునిచేఁ ద్రాగఁబడిన. శత పెట్టు = నూరామడ పర్యంతము. కాపులు = గృహస్థులు. ఆత్మ... వ్యథలన్ = తమయింటి నేలఁ దెలియక దుఃఖించుచున్నారనుట. పుటభేదనములు = పట్టణములు.

సీ. మక్షికా బాధ క♦రాక్షేప ణాక్షీణ
భోజనాంతర చల ♦ దోర్భక్త్ర గణము
చంచత్తురగ రోమ ♦ కుంచి కాంచిత పాణి
జన యుక్తాప్త వి - చ్ఛురికంబు
ధరణీ వరావరో ♦ ధక వధూటీ భూత
కట కుటీ పటు కటీ ♦ తట గణికము
స్థితి నిత్యతాప్రియా ♦ ర్థీకృత గమన సం
త్యక్త ధాన్యాది సం ♦ తప్త జనము
గీ. దండు సులభంబె పురుష వే ♦ దండులకును
గూచిఁ గావింపఁ గుండియల్ ♦ గుబ్బురనఁగ

దిగిన దివసంబు సరిప్రొద్దు ♦ దీరువేళ
కోదనాదర దూరులై ♦ యుండు టరుదె. 68

68. కరాక్షేపణ = చేతులతోఁదోలుటయందు. రోమకుంచి కా=రోమపుకుచ్చులతోటి. పాణిచలన = హస్తముయొక్క కదలుటతోడ. యుక్ = కూడిన, ప్రాప్త విచర్చికంబు = పొందఁబడిన గజ్జి కలవారుగలది. అనఁగా గజ్జిబట్టినవారు, గుజ్జుపువెండ్రుకల కుంచెతో విసరుకొనుచున్నారని తాత్పర్యము. ధరణీ...గణికము = ధరణీవర = రాజులకు. అవరోధక, వధూటీ భూత=అంతఃపురస్త్రీలైన. కటకుటీ = చాపలతోఁగట్టిన పాకలయందున్న. పటుకటీతట = గొప్పపిఱుదులు గల. గణికము = వేశ్యలుగలది. స్థితి.. జనము = (స్థితి=ఉనికియొక్క. నిత్యతా = నిత్యత్వముచేత. ప్రియార్థీకృత = ఇష్టవస్తువులై చేయఁబడినట్టియు. గమన=ప్రయాణమునకు, సంత్యక్త = విడువఁబడిన, ధాన్యాది= ధాన్యము మొదలగువానికై, సంతప్తజనము = పరితపించుచున్న, మనుష్యులుగలది. అనఁగా స్థిరముగానుందుమని సంపాదించిన ధాన్యాదులను విడిచిపోఁజాలక జనులు విచారించుచున్నారని తాత్పర్యము.) కూచి=దండు బయలుదేరుటకు గుఱుతుగా జేసిన వాద్యము. దిగిన... వేళకు = దిగినరోజున వేళదప్పిన హేతువుచేతనని తాత్పర్యము. ఓదనాదూరులై = భోజనాసక్తిలేనివారై.

సీ. పాళెంబు డిగి యొక్క ♦ పజ్జ నిల్వక మున్న
కూచివేసిన పాటి ♦ గుండె దిగులు
త్రావ నీ ళ్ళడని వి ♦ స్తర దుస్తరపుత్రోవ
నెత్తు పైనమునాటి ♦ యొడగొట్టు
మదహస్తి గని గిత్త ♦ బెదరి చిల్లగఁగొనెఁ
బడవైచి కదలు న ♦ ప్పంటి గోడు
దంట గుడారు క్రిం ♦ దటి వెల్లువల నీరు
ప్రాయివీఁగఁ గొట్టిన ♦ పూట నిద్రు.

గీ. ఒక్కొక దినంబు తమయింటి ♦ యొద్ద వారి
దలఁచికొన్నపు డొదవు సం♦తాప భరము
పూనకుండుట యెట్లు భ ♦ వాని పతియు
వాసిఁ బూని ధరం దండు ♦ జేసె నేని. 69

69. పాళెంబు = దండుదిగినచోటు. (బసలో ప్రవేశించకపూర్వమే కూచివేసినట్టు బెదురు) నీళ్ళుడని = నీళ్లు దొరకనట్టి, ఎత్తుపైనము = మకాములేని ప్రయాణము, గోడు = కష్టము, దంటుగుడారు = సమముగానున్న డేరాలోనున్న, వీఁగఁగొట్టిన = అరిపివేసినట్టి, నిట్టుపి = ఉపవాసము.

సీ. చవికె బండారాకు ♦ సందుల డిగి మంచు
తుంపు రు ల్దుప్పటిఁ ♦ దొప్పఁదోఁగ
నపుడు వైచిన పచ్చి ♦ యరుగుపైఁ బవళింపఁ
గలువకాఁడై మేను ♦ గాసిఁ బొదల
గుడిసె నెన్నడు చక్కఁ ♦ గుడువ వల్పిరిఁగొన్నఁ
గడలు దుట్రిల వడ ♦ వడ వడంక
ప్రభువు వచ్చిన దాఁక ♦ బయలు గాచుచుఁ జెవుల్.
సీదరల్ బోదగ్గి ♦ ఛీఁది ఛీఁది
గీ. తావు గాసంతె చాలుఁ గాం ♦ తారమైనఁ
జాలుఁ గొలువింపుఁ జొప్ప నా ♦ మాలుడుగును
జనుట మేలికఁ బనికిరా ♦ దనిరి బంటు
లరిది సీతున దండులో ♦ నటమటించి. 70

70. దొప్పఁదోఁగన్ = మిక్కిలి తడియఁగా, వల్పిరిగొన్న = చలియెక్కిన, తుట్రిలన్ = చినుకులు వడఁగా, కొలువింపుజొప్పన్ = ఇక్కడ సేవయున్నట్లయితే, నామాలుడుగును = చావువచ్చును. అటమటించి = బాధపడి.

చ. వలి కయి విల్లువంకఁ గని
వ్రాసెడి నొక్కటి లెక్క యక్కనం
దలయిడి రెంటిలెక్కయిడి
నాఁడు ముడించిన కాళ్ళ సొంపుచే
నిలిపెడి మూటిలెక్క భళి
నిద్దుర వోవుచు లెక్క మానఁడీ
బలకరపుం దవుల్ గలుగు
బక్క నియోగి యటంచ్రు తద్భటుల్. 71

71. వలి = చలి, వంపుగానున్నప్పుడు ఒకటియంకెవలె నును, తలగుండెపై వంచినపుడు రెండంకెవలెనును, కాళ్ళుముడిచి నప్పుడు మూడంకెవలెను ఉండెను.

చ. కిలకిలనవ్వి తానె పరి
కించుఁ బరిన్ విటునట్టి వీధికా
తల చరదల్ప వారవని
తామణి పిల్చిన నీటువెట్టుచుం
బలుకదు తొంటి పైఁడి తన
పాలిక మాటకు మాటలాడ రూ
కలు పదియైదు నిద్దురకు
గట్టివరాయను నట్టి దండునన్. 72

72. తొంటి... మాటకు = మునుపిచ్చునట్టి సొమ్ము ఇప్పుడు నాల్గవవంతు మాటకియ్యవలెనని తాత్పర్యము.

శా. రంభీకారిత కుంభ చేటిక మురు
ప్రాసాద భూమీ భవ

త్కుంభి న్యుద్వృత జీర్ణ కంబళ మిళ
ద్గూఢారమాకాశ గం
గాంభోభూత గజాశ్వ విడ్జల నిశాం
తానంత వేశంతకం
బాభస్సంభవ సూతికిం గరినమే
కాదండు ప్రోద్దండతన్. 73

73. రంభీ...చేటికము = రంభయై చేయఁబడిన నీళ్ళు మోయు దాసిగలది. ఉరు . గూఢారము = గొప్పమేడలైన చింకికంబళిఁ బరిచిన గుడారుగలది. గంగాం...వేశంతకంబు = గంగోదకమైన యేనుగులయొక్కయు, గుఱ్ఱములయొక్కయు లద్దెల నీళ్ళకు స్థానమైనగోతులుగలది. అనఁగా నాదండులో నీచవస్తువులు ఘనవస్తువులుగాఁ దోచుచున్నవి నాల్గవపాద మందుఁ బ్లుకయతి.

క. ఇత్తెరగున దండెత్తి నృ
పోత్తంసుఁ డుదాత్తవృత్తి ♦ నుత్తర ధరణీ
భృత్తతుల కోట కొత్తళ
మత్తఱిఁ దుత్తుమురుఁజేసె ♦ సత్త్వోద్ధతుఁడై. 74

74. ధరణీభృత్, తతుల = రాజుల, తుత్తుమురు = నుగ్గు నూచము.

సీ. కుంతలాధిపు చిక్కు ♦ కుటిలత్వ మెడలించె
సింధురాడ్భంగంబు ♦ క్షితికిఁ దెల్పె
సౌరాష్ట్రవిభు రాగ ♦ సారంబు హరియించె
గాంధారవిభు స్వగా ♦ క్రాంతుఁజేసె
గౌడనాయకుఁడు రం ♦ గంబున సమరించెఁ
గాశభర్తఁ దృణంబు ♦ గాఁ బెగల్చె

మత్స్యవల్లభుఁ బట్టి ♦ మాన్పించె మిట్టిపా
టంగేశుఁ దను బలా ♦ ధ్యక్షుఁ జేసె
గీ. ఘాటికా ఘోటికా టీక ♦ పాటవమున
నరిపురంబులపై నట్టి ♦ యలుక బుట్టి
కిసలయోష్ఠీదృగంభోజ ♦ కీరరాజ
వాహనుండగు నారాజ ♦ వాహనుండు. 75

75. ఈ పద్యమందు రెండర్థములు. కుంత... ఎడలించె = తలవెంట్రుకల చిక్కు విప్పె. సింధు... తెల్పె = సముద్రమువల్ల భూమికి భంగముగలదు. సౌరాష్ట్ర...సారంబు = సౌరాష్ట్ర రాగముయొక్క బలము. గాంధార...స్వరాక్రాంతున్ = (స్వః = స్వర్గమును. ఆక్రాంతున్ = ఆక్రమించినవానిగానని ప్రకృతార్థము.) గాంధారగ్రామమును స్వరములచే నాక్రమించఁబడినదానిగా. గౌడ...సమతించెన్ = గౌడదేశపు గుఱ్ఱములు శ్రేష్ఠములు. మత్స్య... పాటు = చేపను మిట్టిపడకుండఁజేసెను. అంగేశు... జేసె = అంగరాజును, తనువు = శరీరము. (తను బలము—కొద్దిబలమని ప్రకృతార్థము.)

సీ. సాగ్రహారు లుదగ్ర ♦ విగ్రహాగ్రులు గాఁగ
నగ్రహారులఁ జేసె ♦ నగ్రజనుల
తరువాటులను జేరి ♦ తెరవాటుఁ గొట్టించు
పరువాటి బల్లెంబు ♦ పాలుఁజేసె
సేవాలయములైన ♦ దేవాలయములఁ బూ
జావాలయములుగా ♦ సంఘటించె
దనవాసుల సమస్త ♦ వనవాసులకుఁ దాన
ననవాసుల హరించి ♦ ననుపు లిచ్చెఁ
గీ. శరణ శరణాగతాహిత ♦ భరణ కరణ
తరుణ కరుణాకటాక్షుఁడా ♦ ధన్యుఁ డంత

యుత్తరాంభోధి తట సము ♦ దాత్త విజయ
బంధుర స్తంభ జృంభిత ♦ పయన కలన. 76

76. సాగ్రహారులు = అగ్రహారములతోఁ గూడిన శత్రులు. అగ్రజనులు = బ్రాహ్మణులు, తరువాటులు = వృక్షపంక్తులు. తెరవాటు గొట్టించి. త్రోవలుదోచుకొని. సేవాలయములు = పూజాస్థానములు. పూజా...యములు = (పూజావాల = పూజకుఁబాదులైన అనఁగా స్థానములైన. యములు = యతులుగలవి.) తనవాసులన్ = తన గౌరవములచేత. ననవ = క్రొత్తవిగాని. అసులన్ = కత్తులను. సన పుంజీవనో పాధి. పయన = పొందుట.

క. వనములు బహుజీవన పా
వన వనజాకర మునివర ♦ వసుధాధర ఖే
దన భంజన జన రంజన
జనపదములు నదులు గడచి ♦ చనఁ జన నాతన్. 77

77. బహు.. ధర= విస్తారమైన యుదకముచేఁ బవిత్రమగు కొలకులును, మునిశ్రేష్ఠులను, పర్వతములునుగల.

ఉ. ముందరఁగాంచె నిందు కుల
మోద సుధారస మందరంబు పౌ
రందర నీల కందళ ధు
రంధర సింధుర బృంద మందిర
త్కందర నిర్గతావిశద
కాంత్యుపమేయ నమ త్పిరంగికా
తుందరణ త్కృశానుధృత
ధూమ విశాలము వింధ్యశైలమున్. 78

78. ఇందు...మందరంబు = (రాజునకు విశేషణము.) ఉపమేయ = ఉపమేయవస్తువుగాఁగల. (పిరంగికా. ఇది సంస్కృతశబ్దమని తోఁచదు.) తుంద = గర్భమందు. రణత్, ధ్వనించుచున్న (పర్వత

గుహాలో నల్లనియేనుగులు పిరంగిలోనున్న పొగవలె నున్నవని తాత్ప ర్యము.) ఈపద్యము విచారణీయము.

క. ఉదిరి మలతోఁడ నొరయఁగ
నెదిరిన దొర పెక్కునేల ♦ యొండ్లిల నధమున్
మొదలంగ నీని బల్లిదుఁ
డదయ గ్రహములకు గ్రహమ♦హా యితఁ డనుచున్ 79

76. ఉదిరిమల - మేరువుపర్వతము. అదయగ్రహములకు గ్రహము - గ్రహముల వర్ణించినది.

క. కాంచి గిరి కటక శిఖర
ప్రాంచన వైచిత్రికాత్మ ♦ నలరి సరస్వ
త్కాంచీ ధవ పంచానన
మించుక చనఁ దగ్ధరాభృ ♦ దీశాను దిశన్. 80

80. సరస్వ ... పంచాననము - సరస్వత్ - సముద్రము. కాంచీ - మొలనూలుగల భూమికి. ధవ - అధిపతులగురాజులలో పంచాననము - సింహము. అనఁగా రాజశ్రేష్ఠుఁడు.

సీ. భువ నాభినవ నాట్య ♦ భవ నాపజవ నాల
నల నాభ్య ఘననాశ్ర ♦ య విటపికము
కలికా పటలికా యు ♦ గలి కార్ణగలి కాప్త
కలికాగ్ర ఫలి కాంచ ♦ కుంజగృహము
స్ఫుట జాతి కుటజాతి ♦ కుటజాత తటజాత
కటజాగ్రదుట జాప ♦ గత దురితము
గమ లాసి తమ లాలి ♦ త మలాళ సమ లాస్య
విమలాబ్జ కమలాక ♦ ర మహితంబు

గీ. చూడ నేపారు శశిఖండ ♦ చూడనేత్ర
తాడ నేతర సుమ ధనూ ♦ రాడసీక
పీడ నేడిత హృత్పరి ♦ వ్రాడనేక
ప సవనంబులఁబొలుచు తా ♦ పస వనంబు. 81

81. భువనా...విటపికము. (భువన - లోకమందు. అభినవ క్రొత్తదియగు. నాట్య - నాట్యమునకు. భవన - గృహమైన. అపజవ పోయినవేగముగల. నాల-లవన - తామరతూండ్లు విరుచుటతోడ. ఆఢ్య=కూడిన. పవనాలయ విటపికము = గాలికాధారమగు వృక్షములు గలది. కలికా.. గృహము = (కలికాపటలికా = మొగ్గలగుంపులతోడ. యుక్ = కూడిన, అలి = తుమ్మెదలనెడు. కార్ష్ణగలికా = నల్లని కంఠముగల యాశ్వయనిశోభను. ఆప్త = పొందిన. కులిక = వృక్షవిశేషములయొక్క. అగ్ర=చివరయందైన. ఫలికా = ప్రేంకణపు తీగెలచేత. అంచ=ఒప్పుచున్న, కుంజగృహము= పొదలుగలది. స్ఫుట = వికసించిన, జాతి = జాజితీగెలయొక్కయు, కుటజ, కొడిసె చెట్లయొక్కయు అలి=పఙ్క్తియనెడు, కుటి = గృహ ములయొక్క జాత=సమూహముయొక్క, తట = ఒడ్డునందు (అనగా దగ్గిరను) జాత = పుట్టిన. కటు = చాపలచేత, జాగ్రత్ = ఒప్పుచున్న, ఉటజ = పర్ణశాలలచేత, అపగత = పోయిన, దురితము = పాపముగలది. కమలా...మహితంబు, కమల = పద్మములయందు. ఆసితమ = మిక్కిలి నివసించునట్టియు, లాలిత = గారవించఁబడిన, మరాళ = హంసలతోడ (రలలకు నభేదము.) సమ = సమానమగు. లాస్య = నాట్యముగల, శశి...నేతర = శివనేత్రపు తాకుడులేని సుమ ధనురాట్ =మన్మథరాజుయొక్క, పరివ్రాడనేకప = మునిశ్రేష్ఠులయొక్క. సవనంబులన్ = యజ్ఞములచేత.

సీ. ఉటజాజిరరజంబుఁ ♦ బటు కర్ణపుటిఁబోవఁ
జరచి తొండముసీరు ♦ జల్లెఁ గరిణి.

చంచువు కొనఁ దమ్మిఁ ♦ జించి చేకొనివచ్చి
కట్టాణి ముగ్గులు ♦ బెట్టె హంసి
అకరముల్ గొన్ని మే ♦ యక మున్నె దేవపూ
జకుఁదెచ్చు జలజముల్ ♦ చక్రవాకి
ఘోణ నాతినిఁ గూర్చి ♦ వేణుతండుల కంద
మూల బృందము లిచ్చు ♦ ముందె కిటియు

గీ. సమయములు గాచి సంయమి ♦ సార్వభౌముఁ
డారగించిన మీఁద రా ♦ మాయణంబు
శారి యర్థంబు వినుపింపఁ ♦ గీరి చదువు
నేమిచెప్పెద ముని వనీ ♦ భూమి మహిమ. 82

82. చంచువు = పిట్టముక్కు, అకరముల్ = పద్మకింజల్క ములు, ఘోణ = పందిముక్కు, కిటి = అడవిపంది, కీరి = ఆడుచిలుక.

గీ. నీలకంఠ తనూభవ ♦ వ్యాలకంబు
సతత శార్దూల వాస స్థి ♦ రిత వృషంబు
పంచముఖ లాలిత మృగంబుఁ ♦ గాంచె నపుడు
నృపుఁడు శివమూల ధనము నా ♦ తపసి వనము. 83

క. అటఁజూచి యటవి దక్షిణ
తటమునఁ దన దండు డించి ♦ తటుకున జటిరా
డుటజ కుట దర్శనార్తి
స్ఫుట మతి నటియింప నరుగు♦చోఁటుల నెదుటన్. 84

సీ. "అణుదిత్సవర్ణశ్య ♦ చాప్రత్యయ" యటంచు
వ్యాఖ్యానమాను వై ♦ యాకరణులు
హాస్తచేష్టలఁ "బర్వ ♦ తోగ్నిమా" నని రేఁగి
కర్కశోక్తులు బల్కు ♦ తర్క వేత్త

లంత కంతకు "నంకు ♦ రాదిసకర్తృక"
మనుచుఁ గొట్లాడు వే ♦ దాంతికులును
విదితంబుగ "నకదా ♦ చిద నీదృశంజగ
త్" నెడి మీమాంసా వి ♦ దావళియును
గీ. జెలఁగి తొలునాఁడు తరవాయిఁ ♦ జెప్పినట్టి
యొల్ల పన్నంబు లేకరు ♦ విడి పదంబుఁ
గ్రమము గుణియించు నైష్ఠిక ♦ బ్రహ్మచారి
నికరములు గొల్వ వచ్చె శాం ♦ డిల్యహాని. 85

85. అణుది.. ప్రత్యయము; ఇది వ్యాకరణసూత్రము. పర్వగ్ని మాన్ = తర్కవాక్యము. అంకురాదిసకర్తృకం = వేదాంతవాక్యము నకదా...జగత్ = మీమాంసాసూత్రము. పన్నము = ప్రశ్నము.

సీ. జనులెన్నఁగను బిగిం ♦ చిన మోహపాశంబు
కట్టనాఁ బటుజటా ♦ గ్రంథి దనర
మూర్తిత్రయీమధ్య ♦ ముని వర్ణమిదియ నాఁ
దైర్ఘ్యపుండ్రమధ్య మే ♦ దావి యొనర
శీతాంశు మట్టి డిం ♦ చిన సన్న యూడల
గమియనాఁ బెంపుడు ♦ గడ్డమమర
పాణి పంకజమంచు ♦ భ్రమరాళి దిరిగెనా
భ్రమద క్షమాలిక ♦ పరిఢవిల్ల
గీ. నంగుళి పవిత్ర ముత్తరీ ♦ యమును బొదల
యోగ పట్టయు రుద్రాక్ష ♦ యుంగరంబు
జెవుల షట్కుండలము లొప్ప ♦ దవులు నట్టి
కాంక్షితార్థప్రదునిఁ బారి ♦ కాంక్షిఁ గాంచి. 86

86. మేదావి = ఔపాసనాగ్నివిభూతి, శీతాంశు = చంద్రుని లో మఱ్ఱిచెట్టున్నదని కొందఱిమతము, పారికాంక్షి = ముని.,

గీ. అపుడుసాష్టాంగ వందనం ♦ బాచరించు
పార్థివు "ననేక రాజ్యాధి ♦ పత్యమస్తు
మహీపతే" యని దీవించి ♦ మండలేంద్రు
దండఁగూర్చుండ నియమించి ♦ తపసి పలికె. 87

క. జననాథ సుఖమె నీకున్
జనకునకును రాజహంసు ♦ నకుసేమంబే
జనని వసుమతికి భద్రమె
సనయ భవ ద్భుజ భృత్ప్ర ♦ జకు భావుకమే. 88

చ. జనకుఁడు రాజ్యమిచ్చి నిను
సర్వబలంబులు గూర్చి కూర్చి పం
పిన పలు కర్జితారి పుట
భేదన దండన వార్త దూర్తక
ర్తన మొనరించు మాట యిటు
దాడిగ వచ్చితి రన్నసుద్ది శి
ష్యుని ముఖ సూక్తిచే వినఁగ
నుల్లము చల్లఁగ నుల్ల సిల్లెడున్. 89

ఉ. నీ జనకుండు మా యెడఁ బ్ర
ణేయఘృణేయుఁడు నిన్ను మాకు నా
యోజనె యుండుమీ యనుచు
నొండన నేటికి మా పురాణముల్
మా జప హోమ భాగములు
మా సకలా శమ యాగ యోగముల్

నీ జయవార్త వంకఁ దగ
నెమ్మి పఠించుట రాజవాహనా. 90

90. ప్రణేయ = క్రొత్తదియగు. ఘృణేయుఁడు = దయగలవాఁడు.

క. జనపతుల సత్యసంధుల
మను మాంధాతలఁ గుమార ♦ మణులం గనమా
నినువంటి సుధిని సౌజ
న్యనిధినిఁ గని వినియు నెరుఁగ♦మయ్యమహాత్మా, 91

క. అనిమునిమణి కేల్గైకొని
జనవర మధ్యాహ్నమయ్యె ♦ సమయం బిది మా
జనక సుతాధిప పదపూ
జనమునకున్ సదనమునకుఁ♦జనుదెంచి దయన్. 92

క. వింద్యారగింపఁ దగు గో
విందాంఘ్రి మిళింద! మనవి ♦ వినిచను దెమ్మా
విందాక రాచకలువల
విందా! ముఖనిందితార ♦ విందా! నందా! 93

93. ఇందాఁక, చనుదెమ్ము అని యన్వయము.

క. ఇట జాపు లేక పదముని
కుటజన్మ నిభుండనన్ స ♦ కోరక పటలీ
కుటజంబున కుటజంబున
కటజంబూద్వీప భూప ♦హరి తా నరిగెన్. 94

94. కుటజన్మనిభుండు=అగస్త్యునితోఁ దుల్యుఁడు. సకోరక . జటంబునకున్ = మొగ్గల సమూహముతోఁగూడిన కొండమల్లెచెట్లుగల.

క. అరిగి నృపుఁడ మరఘేరు
స్మరణ స్ఫురణ ప్రచరణ ♦ సకలేందిర మం
దిరమై గరిమం జిరమై
కరమందిన మానిశాలఁ♦గని యవ్వేళన్. 95

95. గరిమన్ = గౌరవముచేత.

క. జలకంబాడి సిటల గత
తిలకంబై నాసికాస్థ ♦ తిలకము భూభృ
త్తిలకము వచ్చెన్ హిత నృప
కులకముతో భోజనంపు ♦ కూటంబునకున్. 96

క. జగతీ నుత మా నిచ్ఛా
త్ర గణంబులు పైఁడిపళ్ళె ♦ రంబులుఁ జుట్టుం
డెగబాటె డనఁటి మేలిమి
చిగురాకులు వైచి జలముఁ♦జిలికించుటయున్. 97

క. స్వ కర ధృత పాత్రి ముంచుచు
సకల రుచి స్ఫుట దపూప ♦ శకలంబునఁ దా
నకలంక నటన మెరయఁగ
నొక సతి పాత్రాభిపురణ ♦ మొనరించంగన్. 98

ఉ. కుంకమ పంక మిచ్చు నలు
గు ల్మణుఁగుల్ నును గీలు గంటులుం
బొంకముఁ జూపఁ దాపసుని
పుత్త్రిక లుజ్జ్వల హేమపాత్రికల్
గంకణ నిక్వణాంక కర
కంజములన్ ధరియించి రత్నతా

లంక రుచుల్ దటిల్లతల
డాపఁగ బంతుల నెంబడిన్ వసిన్. 99

99. కీలుగంటులు = జటులు.

మ. వడియం బప్పడ మొప్పు నింపు వరుగల్
వాటంపు మారీచపుం
బోడి నేయాళికిఁ దేలి తాలి దపు సొం
పుల్ నింపు నాకాయ వే
పుడు గమ్మందన మంను కందయును పుం
బొల్లున్ రుటంబైన చి
క్కుడు జట్టల్ మొదలైన శాకములు నొ
ల్కుం బప్పు వడ్డింపఁగన్. 100

100. మారీచపుంబొడి=మిరియపుపొడి, ఉప్పుంబొల్లు=ఉప్పు గుండెలు. రుటంబు=దృఢము, చిక్కుడు జట్టల్ = చిక్కుడు కాయము క్కలు, ఒల్కుంబప్పు=చాయపప్పు.

క. క్రొం బొగపు కూర వగ తిరు
గం బోతల మెంతి జీర కంబుల వలపుం
దుంబొళ్ళ తావి శిఖరుల
గంబూర జగంబు వొగడఁ గా నటుసుడిసెన్. 101

101. దుఁబొళ్ళు = జీలకఱ్ఱ మొదలగు పరిమళద్రవ్యము ల గుండలు. శిఖరులు = ఒకానొక విధమైన భక్ష్యములు. గంబూర = పరిమళము. శిఖరులు - భక్ష్యవిశేషము.

క. లలి జీరకిర సభారం
బుల యన్నంబిడిరి లేఁజి వ్రరుఁబోషుఁలు రా
జుల పళ్ళెరముల వల్లీ
కుల మావాలముల విరులు గుప్పె నసంగన్. 102

102. ఆవాలములన్ = పాదులయందు.

క. కమ్మని తావులు చల్లఁగ
గమ్మని యాజ్యంబు పాఁట ♦ కపు తపెలలఁ పొం
కమ్ముగ వాఁచిరి పత్రపు
టమ్ముల గిన్నెల నటబ్జ ♦ టాక వధూటుల్. 103

సీ. మీఁగాళ్ళమీఁద గ్ర ♦ మ్మిన పింజ మాదావ
లము సేయ నఖలాక్ష ♦ దమిఁ గదల్చి
కాయ సత్రమతఁ జొంపఁ ♦ గై యింతకై వ్రాలు
కీల్గంటు ననురాగ ♦ కేళిఁ జనకి
భుజమెత్తి చారు ను ♦ ర్ధజరాజిఁ ద్రోచు న
త్తఱిఁ గక్ష రుచి మదిఁ ♦ దాల్మిఁ దరమి
ఘుల్లున భాజనాం ♦ కము మెట్టమట్టెల
పదముల ధైర్యసం ♦ పదఁ బెకల్చి

గీ. మధుప వేణులు వడ్డింప ♦ మధురసూక్తి
యధర రక్తిమ విన్నక ♦ న్నయ్యలకును
దేనియలయందు శిఖరుల ♦ నానవాల
యందు నిక్షురసములందు ♦ నరుచివొడమె. 104

104. పింజ = కుచ్చెళ్ళచివర. మాదావలము = కపిలవర్ణము. భాజనాంకము = భోజనపాత్రసమీపము. నానవాలు=భక్ష్యవిశేషము.

సీ. అన్నన్న మృదుల స ♦ దన్న సౌరభ్యంబు
సాటి గల్గునె చారు ♦ చారురుచికి
లెస్సాయెగా కద ♦ ళీశాక పాకము
ల్మరి హరించెనె కదా ♦ మనసు గిసను

చట్టిలో నెయివంచి ♦ వట్టిగాఁ బ్రేల్చిన
పొట్లకాకరకాయఁ ♦ బాగడఁ దరమె
మేలింపు చవి గుల్కు ♦ తాలింపు వంకాయ
యూర్పులు గొనియాడ ♦ నేర్పుగలదె
గీ. భళిరె! కజ్జాయ మయ్యారె ♦ పాయసములు
మేటి శిఖరులు పచ్చళ్ళు ♦ మెచ్చ వచ్చు
నౌర ! పెరు గూరుఁగాయు య ♦ మ్మక్క ! యనుచు
రహిఁ భుజించిరి సడిసన్న ♦ రాచవారు. 105

105. వట్టిగాన్ = ఆరిపోవునట్టుగా, ప్రేల్చిన = వేచిన, తాలింపు = పోగుపు. సడిసన్న = ప్రసిద్ధులైన.

మ. జననాథేంద్ర మమాత్ర మేతుబహావ
శ్యాకానసంత్యాగ్రిజీ
వన మీశార్పితమన్న మేవ భవతాం
వస్తూనిసంత్యాలయే
మనసిత్వం స్మరతాని తేనపరసీ
మానేషుమేమత్వదీ
య నికాయ్యస్సమయోధికో భవదసా
ఖ్యం సర్వమస్వాళలన్. 106
క. సరసప్రత్యుపచార
స్ఫురణమున భుజించి లేచి ♦ పూర్ణహృదయుఁడై
ధరణిపతి "భోజనస్యా
దరోరస" యను వచనము ♦ తథ్యముగాఁగఁ. 107
శీతల హిమాంబువులు గని
సీతలమను నూతన కల ♦ శీతల జలముల్

భూతలనేతలచేఁతుల
క్షితల వర్షించి రమ్ము ♦ నీశ్వర శిష్యుల్. 108

10౮. సీతలము = సామ్యము. కలశీతల = కలశమండలి శీతల = వెలుపల.

క. ఇందు కుల రాజనందన
కందర్పులమైన మాని ♦ ఘనసార వరా
మంద తుహినాంబు మృగ మద
కందళితా నందమైన ♦ గంధ మలందెన్. 109

క. ఒప్పిన పలి మంచుల నీ
విప్పిన తెలిమంచులనఁగ ♦ వెన్నెల లనఁగాఁ
జొప్పడి పిడికిట నడఁగెడు
నుప్పతి లప్పటి యశోని ♦ ధులకుం గప్పెన్. 110

క. అతిరాగపు బాగాలున్
రతిరాజిత గండపాండు ♦ రద్యుతి తళికిం
బ్రతి రాజిలు తెలనాకులు
యతిరాయఁడొసంగె నిజ ని ♦ యతి రాజులకున్. 111

క. ఇత్తెరఁగున లాలించి నృ
పోత్తము వీడ్కొల్పె పాలె ♦ మున్నచ్చటికై
యుత్తటిసిం బశ్చిమభూ
భృత్తటికిం బ్రొద్దుగ్రాలె ♦ నెఱ్ఱలు దారెన్. 112

శా. సత్యాలోకనలోల భోజతనయా
సల్లాపసాహిత్య యా
దిత్యాపత్యపయోధర ద్వయతటీ
దీవ్యత్కరాలక్షణా

రత్యాహ్లాద నజాంబవత్యధరసా
రజ్ఞా సుదంతారతాం
తత్యక్తాన్యనితంబినీకథన భ
ద్రామిత్రవిందాధవా. 113

క. చాణూరమల్లగాత్ర
స్థాణూర స్థలకవాట ♦ సంఘట్టన పా
షాణీకృతపాణీ శ
ర్వాణీవాణీ శచీశ ♦ వందిత చరణా.

కవిరాజవిరాజితము.

రణరణ కారుణ వీక్షణ రక్షణ
రావణ కంఠ నివారణకా
రణకర మార్గణ భర్గశిరోగ్ర ని
రర్గళ వార్గణ యుక్చరణా
మణిత నిబంధన మార్గ ధురంధర
మానిత కంధర గోపవధూ
మణి మధురాధరబింబ సుధాఝర
మత్త రసజ్ఞ రసజ్ఞనిధీ. 115

115. రణరణకము = కోరిక.

గద్య.

ఇది శ్రీమదామభద్ర భజనముద్ర కవిపట్టభద్ర కాద్రవేయాధిప వరసమాగత సరస సారస్వత లహరీపరిపాక కాకమానిమూర్తి ప్రబోధ బుధకవిసార్వభౌమపుత్ర రామలింగభట్టపుత్ర కౌండిన్యగోత్రభాగధేయ మూర్తినామధేయ ప్రణీతంబైన రాజవాహనవిజయంబను మహాప్రబంధంబునందుఁ ద్వితీయాశ్వాసము

శ్రీ

# రాజవాహన విజయము.

( తృతీయాశ్వాసము. )

---



శ్రీ లక్ష్మీ కమలాక్షీ
శ్రీలక్ష్మీకృత కటీర శింజిత కాంచీ
లోలచ్చిత్తమరాళ క
రా లఘువిక్రమణ వేంకటాచలరమణా !

వ. అవధరింపుము. 2

శా. వేలాదంతి పెకల్చివైవ నపరో
ర్వీభృచ్ఛిరోగ్రంబుపై
వ్రాలంజాలిన పూర్వసింధు సరసీ
రక్తాబ్జ మట్లొప్పె దా
నాళీకాప్తుఁడు చిందు తద్రజ మన
న్సంధ్యాతపం బొప్పెఁ ద
న్నాళోత్థాంబుకణాళి పంకములనం
దారాతపంబుల్దగెన్.

సీ. దినతమీమధ్యస్థ ◆ తను ఫలించిన మేటి
కడుఁ బ్రతీచికి రాఁగ ◆ ఖండిన జంగా
శంభు నాట్యమునకు ◆ సమయ మిచ్చిన ప్రోడ
శిఖికి సద్ద్యుతిపాళిఁ ◆ జేర్చు దంట
జగములఁ గల యను ◆ ష్ఠాత్రల తనుకాఁడు
పితృకోటిఁ గాంచి పెం ◆ పిన యొయారి
ద్విజరాజులఁ గలాయ ◆ వితతిఁ గూర్చు మిటారి
జతికి రతిప్రేమఁ ◆ దెచ్చు అన్వ
గీ. కువలయమునకు నిద్ర మే ◆ ల్కొలుపు గబ్బి
యంగభవుఁ బయనంబు గ ◆ మ్మనిన జోడు
కనక కశిపుని జముప్రోలి ◆ కనుపు గొంటు
చాలితానేక ఘూకాంధ్య ◆ సంధ్య దోలఁగె. 4

3. శిఖి... దంట - (సూర్యకిరణములు రాత్రియందగ్నిం బ్రవేశించును.) తనుకాఁడు - తృప్తిఁజేయువాఁడు గొంటు - కఠినుఁడు.

మ. కమలా మిత్ర కళత్ర మంధ పటలీ
గంధేభ ధామంబు జా
ర మయూరాబ్దము మార షల్ల ఖురళీ
రంగం బితోష్ణాంగ గం
ధము జో రోద్ధవ భూమి యామిక జనా
దాయంబు దావాకుల
ప్రమదా పూరుష భర్మ టంకణముచే
రన్ వచ్చె రే యయ్యెడన్. 5

4. ఉద్ధవభూమి - ఉత్సవభూమి.

ఉ. జార సమస్త చోర తతి
జాతర ఘూక దృగంజనంబు తా
రా రమణీయ హీరమణి
రాజిత శాణము దీధికా చర
ద్వార జరావతీ తరుణ
తా ప్రద మూలిక లోక దృష్టికా
సారస కంద మంధతమ
సం బెసఁగెం దశ దిక్తటంబులన్. 5

5. కందము - మేఘము.

సీ. ధర భేది సంకెలల్ ♦ దప్పించుకొని వచ్చి,
కాసకుండఁ జరించు ♦ ఘన మనంగఁ
గడతత్త్వ మిటమోవఁ ♦ గడమయే యేనని
మొదటి తత్త్వము మిన్ను ♦ ముట్టె ననఁగ
తముఁ గనకుండ బం ♦ ధకులు చల్లు కనీని
కా నికాయ విభా వి ♦ కాస మనఁగ
నెలతగుల్గొరి రే ♦ నెలత మజ్జనమాడి,
యూర విప్పిన కుంత ♦ లాళి యనఁగ
గీ. జలధిఁ గో మిత్రుఁ బడఁ ద్రోచు ♦ కలుష కలన
నంటు కాలంబు మొగము న ♦ ల్లనఁగ దండ్రి
సూమఁ ద్రిప్పఁగ సమయంబుఁ ♦ జుట్టికొన్న
యమున యనఁ జీకువాల్ జగం ♦ బాక్రమించె. 6

6. కడతత్త్వము = భూమి (ఈలాగునంతయు పోయుచుండ నేను చివరదాననై యుండఁ నా యని మొదటిదైన యాకాశమును గలసిన దన్నట్లు) చీకువాలు=చీకటి.

7

సీ. ప్రసవ కోదండుండు ♦ పాశంబు దగిలింప
నెగయు మిఱుంగురు ♦ తెగలనంగ
చైత్ర యాత్రోన్ముఖ ♦ స్మరునిపై సౌధాళి
రాజముఖు ల్చల్లు ♦ లాజ లనఁగ
శంబరారికి వినో ♦ దంబుఁ జూపఁగ నంబ
రంబౌను పువ్వు శా ♦ ణంబు లనఁగఁ
దెంపుమై మరుఁడు ని ♦ లింపాంగనల నొంప
నంపిన వెలిదమ్మి ♦ యమ్ము లనఁగ
గీ. సుమశరుని తూఁపు లమరీకు ♦ చములఁ దాఁక
దివికిఁ దెగి వ్రాలు హారమౌ ♦ క్తికము లనఁగఁ
బాంధ జయ లబ్ధ దర్పక ♦ ప్రబల కీర్తి
హీరము లసంగఁ జుక్క లె ♦ ల్లెడల నిక్క 7

7. సౌధాళి రాజముఖులు = దేవతా స్త్రీలు,

చ. చలువల రచ్చపట్టు జల
జంబులతుట్టు విరాలికల్కప్రో
గుల కనుకుట్టు జక్కవల
గొట్టు చకోరులమేలియట్టు రే
పొలఁతుక తాళిబొట్టు తమ
పుం దడకట్టు సరోజసౌధముల్
గల చెలితోడఁబుట్టు తొలు
గట్టు పయిం గనుపట్టు నంతటన్. 8

8. తుట్టు = వినాశకుఁడు. కనుకుట్టు = నేత్రబాధకుఁడు. గొట్టు = విరోధి. తాళిబొట్టు=మంగళమాత్రములోని సువర్ణాలంకారము. తడకట్టు = అడ్డగింపు.

సీ. ఎఱనున్న గోరాడి ♦ యొర మట్టి కరిగొమ్మ
గఱచి నిల్చిన మరు ♦ త్కారి యనంగఁ
గనుదోయి నిప్పుకల్ ♦ గ్రక్కు రక్కసుఁ జెక్కి
ధరఁ గాఁగలించు నా ♦ ద్య కిటి యనఁగ
సామజ భేదియై ♦ క్షతజంబు మైఁ జెందఁ
దోలాల్చి కటి గట్టు ♦ శూలి యనఁగఁ
గెంజడల్ పైఁ బ్రాలి ♦ కెంపులీన విపంచి
మొఱయించు నారద ♦ ముని యనంగ
గీ. నొనరు ధవళాయుకంబులో ♦ నుదయరాగ
మెనయఁ దనచిహ్నము సెలంగఁ ♦ దన ప్రతాప
కలనఁ బర చక్రముఁ గలంగ ♦ నలరె నతఁడు
కువలయుం బేలురాజు ప్రా ♦ క్క్ధర వీథి. 9

9. ఎర = ఆహారమైన, కఱిగొమ్మ = నల్లనికొమ్ము.

గీ మిక్కుటపు రిక్కచాల్ పంట ♦ మిన్ను తోఁటఁ
జక్ర దృష్టి హరింప ని ♦ ర్వక్ర ఘృష్టి
యష్టి హత్తించి యెత్తిన ♦ యట్టి మెరుఁగు
సున్నపుంగుండయన నిక్కెఁ ♦ జుక్కఱేఁడు. 10

10. ఘృష్టియష్టి = కిరణ మను కఱ్ఱ.

సీ. పతిఁగూడ యామినీ ♦ సతి మజ్జనంబాడు
నికరంపు పన్నీరు ♦ నెఱసె ననఁగ
శశి మౌళి తరుపుచే ♦ జడఁజుట్టు విడుపడు
ద్రావిన పాలేర ♦ గ్రాచె ననఁగ
నల్లుఁడు చిల్కకి ♦ డ్డటు లిందుఁడు చకోరు
లకు జీని చక్కెర ♦ ల్దార్చె ననఁగ

సిరుల దొంగిలంగ రా ♦ జీవాళిపై భూతి
శశి జొన్న మందుగా ♦ జల్లె ననఁగ
గీ. ఖ నదియై గట్టు పక్కఁ జ ♦ క్కిన కొఱంత
పుడమి మీఁదికి డిగి క్రాశి ♦ నడఁగు కొనుమ
మూన్పుకొన గంగ నివి భువిం ♦ బ్రజల నృత్తి
నిండెనో నాఁగ బంధు వె ♦ న్నెల సెలంగె. 11

11. తరువు=మణివిశేషము. నిడుపదు =పాము. పాలేర = క్షీరాహారమును. క్రాచెను = క్రక్కెను. జీవి = నాశమైన. జొన్న మందు=మోహనౌషధము.

గీ. విరహి తనుతాప శిఖి సోఁక ♦ వెచ్చనైన
యైందవా తప సుధను పె ♦ ల్లార్చివైచి
యల్ల మలినాంబరం బెల్లఁ ♦ దెల్లఁజేసి
యామినీ భామినికి సమ ♦ యం బొసంగె. 12

12. సుధ=సున్నము. అంబరము = ఆకాశమనుబట్ట. (సమయ మనుచో కాలమను చాకలివాడని గమ్యము.

సీ. పందిఁటి పరపు చా ♦ పల షొడల్ విగళిత
హార ముక్తాళంక ♦ నంటియంటి
వదలు సోరన గండ్ల ♦ వచ్చిన జిగివెండి
హారివాణమని చేఁత ♦ సరసి యరసి
తలుపు పొరం జెందు ♦ బలుచాలు జడజారి
పసు పువ్వుదండని ♦ పట్టిపట్టి
చాటుచే నింటిపం ♦ చఁజెలంగు వెలుఁగారఁ
గట్టిన చీరని ♦ ముట్టిముట్టి

గీ. క్రాఁగు పైమ్రొగ్గు తెలి నిగ్గుఁ ♦ గ్రాఁగి పొంగ
సాఁగు పాలని పైనీరుఁ ♦ జల్లిచల్లి
యల్లు కొను నట్టి వెన్నెల ♦ నల్లుకొన్న
యన్ను మిన్నలు విహరించి ♦ రన్ని వగల. 13

13. చాలు=వెన్నెలపఙ్క్తి. క్రాఁగు = పాలకుండ.

శా. చెల్లెం గంతుని పంత మబ్ధిపొగ రె
చ్చెం గల్వ రాజాలు రం
జిల్లె న్మంచుల పుంజితోఁడ వినుమిం
చెన్ భోగినీ రాజి రా
జిల్లెన్ హల్లకముల్ చకోరములు ద్రేఁ
చెం బిల్లలుం బిల్లగో
ర్పెల్లోయంచు బయుల్లనుం జిడుగుడుల్
ప్రేరేఁచి రవ్వేళలన్. 14

14. పొగరు = గర్వము. పుంజి = సమృద్ధి. త్రేఁచెన్ = త్రేణుపు బొందెను. పిల్లగోరు, చిడిగుడులు = బాలురయాటలలో భేదములు. పెల్లో = ఆడు నప్పుడు వేయుకేక.

సీ. కొలఁదిగాఁ జరిపించు ♦ కొనిరమ్ము కడియ మం
చొక పెర పతిచేతి ♦ కొసంగె నొకతె
వడి మిద్దె విరిగి పైఁ ♦ బడ వచ్చెనని బైటి
కరిగి మిన్నని యుట్ల ♦ యళికె నొకతె
మగఁ డటుండఁగ వేరె ♦ మగని నాలుగఁజీరి
గడుసుచేఁ జెంప పె ♦ ట్టొడసె నొకతె
కాపురం బెఱుఁగ వె ♦ క్కడికేగితని యన్య
తన భర్తయని యన్యుఁ ♦ బెనఁగె నొకతె

గీ. వాఁడఁ జను చాకికి ధరించు ♦ వలువవైచి
తెట్టు తాఁగట్టు పుట్టంబుఁ ♦ గట్టి తనుచుఁ
బొరుగు సతి దాల్చు చీరపైఁ ♦ బోరె నొకతె
యధిక మధు మత్తతావృత్తి ♦ నట్టి రాత్రి. 15.

15. చరిపించుకొని = సాఁగఁగొట్టించుకొని, గడుసుచేన్ = కఠినహస్తముచేత. అన్య (ఇది ఒకతెయను దానికి విశేషణము.)

క. కట్టిన దట్టి కటీతటిఁ
బెట్టిన విరి పిడియమెక్కు ♦ పెట్టిన విల్లున్
మెట్టిన యెగనాళ్ళుం గను
పట్టిన పస మాఱుఁ డపుడు ♦ పాంథుల వెదకెన్. 16

16. విరిపిడియము = పెద్దబాకు. ఎగనాళ్ళు = దూరదేశములు.

సీ. అన్యదారీకారి ♦ తాప్త చేటీ రతి
వ్యాజ స్వ విమత స ♦ ర్వస్వ హరులు
గంహారీ లోహ ము ♦ ద్గర ఘట్టనాభీత
మానవస్తైనతా ♦ మార్గ కరులు
పర్యట జ్జన బాహు ♦ బంధనదాయకా
త్మక నామ తమ్మట ♦ ధ్వాన భరులు
ప్రతివాసర స్వయం ♦ కృతచౌర్యబలవ దం
ఘ్రి నతార్థ విత్త దా ♦ తృత్వ పరులు
గీ. పర నగరికార్పితాత్మరా ♦ ట్పల్లికార్థ
తస్కర పదాంక పద్ధవ ♦ స్థాన జనిజ
ఘోష పద జనితాజ్యాధి ♦ కుతల వరులు
తలవరులు సంచరించిరా ♦ తమిని దమిని. 17

17. అన్య... హారులు (తమకిష్టులైన, దాసీజనముతో, సంభోగించినందున, దమకు శత్రువులైనవారి ధనము నపహరించు చున్నారనుట) గంహారీ...కరులు. దుడ్లు మొదలగువానిచే గొట్టుటచే దొంగలు పారిపోవుటచేత మార్గములు నిర్భయముగా నున్నవని తాత్పర్యము. పర్యట ..భరులు (తమ్మటలు వాయించుచు తమ పేర్లజెప్పి రాత్రిగస్తి దిరుగు నప్పుడువీథులయందు దిరుగువారికి సంకెళ్ళు వేయుదుమని చెప్పుచున్నారనుట. ప్రతివాసర...పరులు (నిత్యము తాము దొంగతనముచే సంపాదించిన సొమ్ములో బలవంతులై తమ దొంగతనము బట్టుకొన్నవారి కాళ్ళమీదబడి సగము సొమ్మిచ్చుచున్నారనుట.) పర...కుతలవరులు, పరనగరికా = శత్రుపట్టణములయందు. అర్పిత = దాచఁబడిన. ఆత్మరాట్ = తమరాజులయొక్క. పల్లికా = చిన్న గ్రామములయందైన, అర్థ = ధనముగల. తస్కరపదాంక = దొంగల కాళ్ళజాడలుగల, తద్ధనస్థానజ = ఆ ధనమున్న చోటఁబుట్టిన. నిజఘోష పదజనిత = తమచాటింపు మాటలవల్లబుట్టిన. ఆజి = యుద్ధముచేతనైన. ఆధి = మనోవ్యాధిగల. కుతలవరులు = రాజులుగల. తలవరులు = గస్తీవాండ్రు. అనగా తమరాజుల పల్లెటూళ్ళలో దొంగలు దోచుకొని ఆ ధనము శత్రురాజుల నగరులలో దాచుకోగా వాండ్ర కాలిజాడలుజూచి యీతలవరులు ధనమున్న చోటు గనిపెట్టి ఆ గ్రామములో మా తాలూకు చోరీఆస్తి యివ్వకపోయిన యుద్ధానికి వస్తుచ్చుచున్నామని చాటింపు చేయఁగా నారాజులు యుద్ధము జరుగునేమో యని మనోవ్యథలు బొందుచున్నారని తాత్పర్యము.

గీ. తారకారాజివాలంబు ♦ తారకిరణ
దామమంకాచ్యుతప్రీతి ♦ మా మహితము
కలువఱేఁడను వట్రువ ♦ గాలిపటము
సమయ శిశు వభ్రమధ్య త ♦ ల్పమున నాడె. 18

18. తారకిరణ = పరిశుద్ధకిరణములనెడి. తల్పమునన్ = కోట కొత్తళముమీద.

గీ. బిట్టు కసరెత్తి మున్నీటి ♦ నట్టనడిమి
కరుగఁగా జీనువైచిన ♦ తరణి యనఁగఁ
జక్కసాఁగిన రశ్మిచేఁ ♦ జుక్కతేఁడు
సమయ వశమున గగన మ ♦ ధ్యమున నిలచె. 19

19. కసరు = గాలివాన, జీను = లంగరు.

సీ. విరహిణీ జయరమా ♦ హరిణేత్రు మదన ప్ర
సవ దామయుత సిత ♦ చ్ఛత్రమనఁగ
మద చకోర వివాహ ♦ మహితకు వెలిని సూ
ల్వాలయు జాజాల పా ♦ లికయనంగ
వేళా వణిజ్మణి ♦ వెన్నెల జీని చ
క్కెర దూఁచ వచ్చు త ♦ క్కెడ యనంగ
నభము రేయొండ సు ♦ న్నముఁ జేయ నింగి ని
ల్పిన వెండి మొక్కలి ♦ పీట యనఁగ.

గీ. సార నీహార మణపు వి ♦ శాఖ జొన్న
పిత్తు ధాత్రీతలంబున ♦ వెదలుజల్లఁ
దగులు ప్రగ్గంపు పూన్కి జ ♦ డ్డిగ మనంగఁ
గిరణ బాహుళ్య మున సుధా ♦ కరుఁడు పొదలె. 20

20. అణపువిశాఖజొన్న=విత్తనము లోపలికణిగిపోవునట్లుగా జేయు విశాఖకార్తిలోని జొన్నచేను.

గీ. బాంధకీ బాష్ప వర్ష సం ♦ బంధమునకు
గర్భ గృహ ముబ్బిపార గం ♦ గా ధునీ స
లిలము లెత్తిన పటికంపు ♦ లింగ మనఁగఁ
జంద్రికా పూరితాజాండ ♦ చంద్రుఁ డలరె. 21

క. ఉడుపతి దరమిన వడిచెడి
గుడిగుండంబుల మఱుంగుఁ ♦ గొని యల శశియుం
బడమటి కరిగిన వెనుకను
బడి చను తమమనఁగ నీడ ♦ ప్రాగ్దిశఁ దిరిగెన్. 22

21. బంధకీ = విటకత్తెలు.

క. నైలింపాయన జలధిం
దేలెడు ధవళాంశు దరము ♦ నిబిడత నక్ష
త్రాళీ శుక్తి చ్ఛటతోఁ
గాలపు దెర బిట్టు వడిని ♦ గట్టునఁ బెట్టెన్. 23

23. దరము = శంకము. తెర=తరంగము.

గీ. తన పగతుఁ డెంత దూరంబు ♦ జనియెనొక్కొ
యనుచు నిక్కుచుఁ గను ధవ ♦ ళారవింద
మనఁగ మిఁనువాఁక నంత ర ♦ త్నాంత తాంత
విటులు నిద్రాపటిమఁజొక్క ♦ వేఁగు చుక్క. 24

24. ఈపద్యమందు "పొడమె"నని క్రియ అధ్యాహారము.

క. ఇందుముఖుల్ సరసాంజన
సందోహంబులకు నిడ్డ ♦ సత్పాత్రాళీ
చందన లేపముఁ ద్రావిన
చందంబున దీప తతి పొ ♦ సఁగె ధవళంబై. 25

25. కాటుకవేయు పళ్ళెముమీద చలవకొఱకు గంధము వేతురు.

క. ఇనురాక కుదయ రాగము
గనఁ బూనం బొరుగు చెలిమిఁ ♦ గైకొని ప్రాక్కా
మిని తన ధవళాంబర మిడఁ
గనుపట్టెను దీపరేఖ ♦ ఘన గౌరవమై. 26

శా. అధ్వన్య క్షణదా ప్రయాణ సమయో
క్తా సంభృత జ్యౌతిషుల్
విధ్వీశ ద్రుహిణాదృత త్రిముని ధీ
వేదాంగ కృద్దేశికుల్
విధ్వస్తేతర పార్శ్వ తాడన గరు
ద్వృత్తిక్రియాం గోక్కరే
కో ధ్వానంబులు నిక్కఁ గుక్కుటము లె
క్కుం దిక్కుటీ రాగ్రముల్. 27

27. అధ్వన్య = మార్గస్థులయొక్కయు. క్షణదా = రాత్రి యొక్కయు. ఉక్త = చెప్పుటకు. (మార్గస్థులు బయలుదేరుటకును, రాత్రి వెళ్ళిపోవుటకును వేళఁజెప్పు జ్యౌతిషికులైనవి. త్రిముని=పాణిని, కాత్యాయన, పతంజలులయొక్క. (కోడికూతనుబట్టి హ్రస్వదీర్ఘప్లుత కాలములు వ్యాకరణకర్తలేర్పఱచిరని ప్రసిద్ధి) గరుత్ = ఱెక్కలు.

ఉ. కల్లరి మావు మావి కడఁ
గట్టి శరంబులు మూలవైచి చే
విల్లొక వంకఁబెట్టి కర
వీరపు జాయల దట్టిఁ జుట్టి వే
తల్లెపుదిక్కు నందు నిడి
తావుల చల్లడ మొప్పు రాజుమే
నల్లుఁడు నిద్రఁజెందెఁ బధి
కాహవ భోగ కషాయనేతృఁడై. 28

28. రాజుమేనల్లుఁడు = మన్మథుఁడు.

వ. ఆసమయంబున. 29

సీ. హరిగూరుచుండు హ ♦ దానంత సంపద
బెంపైన మొక్కలి ♦ పీట యనఁగ
వృత్రభేదికి వీవ ♦ నెత్తిన సూర్యపు
టంపుటము పాలవ ♦ ట్టంబనంగ
కాలంబు పేరి సుం ♦ కరి యాంబరంబునఁ
బొడిచినట్టి యరుణ ♦ ముద్ర యనఁగ
గురు కుచాకుచ పాత ♦ కుంతాంగజాంబుజా
స్త్రముల మొక్కలు దిద్దు ♦ సాన యనఁగ
గీ. నుదయగిరి దుర్గమునఁ దమో ♦ భ్యుదయ బలము
గూల్పఁగా నొడ్డిన ఫిరంగి ♦ గుండనంగ
గుండుబుల్గుల మదిఁగుందు ♦ చెండు మందు
దోఁచె నెత్తమ్మి విరివిందు ♦ తూర్పునందుఁ 30

30. గుండుబులుగులు = చక్రవాకములు.

క. వికసించు తమ్మి నుండు మ
ధుకరావళి వెడలె వెలుఁగు ♦ దొర గనఁ గాసా
ర కలావంతుఁడు మును గొం
చక మ్రింగ వెడల్చు నినుప ♦ సరిపెణ మనఁగన్. 31

31. కళావంతుఁడు = గారడీఁడు. సరిపెణము = గొలుసు.

క. జలజాతము నగుమొగమునఁ
జెలరేగినఁ గలువ ముణిఁగె ♦ సిరిగల వాడల్
విలసిల్లిన దినగండం
బులఁ బొరలెడు వారు మొగము ♦ ముడుచుట యరుదే.

32. వాడల్ = తనయింటికి దగ్గిరయిండ్లు.

క. ఆ తరువాతఁ బ్రభాతా
యాతానిల వాత పోత ♦ హాత జలజాతా
న్వీతామృత ఘ్రాతా'న్యతఁ
బ్రాతారమణీయ కర్మ ♦ పరతంత్రుండై. 33

మ. ఒకచెంతం గకుబంత కావ్య కవితా
సూక్తి ప్రసంగోత్సవం
బొకచాయన్ వికచాయ గాయన వితా
నోజ్జాత గీతామృతం
బొకచోటన్ శర ఘోట యానవత భుజా
యుక్చామరోచ్చాలనం
బొకసొంపుం బ్రకటింప మాగధ విభుం
డొడ్డోలగం బుండఁగన్. 34

34. వికచ = వికసించిన. అయ=శుభావహదైవముగల.

సీ. కఱకు జాంజరు వెండ్రు ♦ కలు గూడఁగట్టిన
నికరంపు టగరు వ ♦ ల్లికచెలంగ
నిభ కుంభ మణులెడ ♦ నెడఁ గూర్చు కురువింద
జములి యుత్తర జన్ని ♦ దములు దనర
మృగనాభి మృగనాభి ♦ లగన క్షతజసిక్త
పాణియుక్చాపంబు ♦ పాణి నిక్క-
నొక్కచే జల్లులు ♦ చుక్కళించి బిగించు
వెదురుబియ్యపు సాలి ♦ యొదను సూప
గీ. నించు మొలత్రాటి యుదుల చా ♦ లియకు గుప్లు
గబ్బి వగఁజూపు పెల్లుట్లు ♦ గబ్బుసల్లు

నల్ల చాయల మేను శో ♦ భిల్ల భిల్ల
వల్లభుఁడు రాజు చెంతకు ♦ వచ్చి యంత. 35

35. లగన = తగులుకొనుటగల. పాణియుక్ = చేతఁబట్టుకొను చోటితోఁగూడిన. జల్లు = వింజామర.

క. జల్లులు జవాది పునుఁగుల
పిల్లలు పెరతేనె వెదురు ♦ బియ్యము క్రీడా
భల్లుక కురంగములు సెల
విల్లుం గైకాన్క భిల్ల ♦ విభుఁడిడి మ్రొక్కెన్. 36

36. క్రీడాభల్లుక, కురంగములు = పెంపుడు ఎలుగుగొడ్లు, లేళ్లు విభుఁడు = చెంచునాయకుఁడు.

గీ. ఇట్టులను మ్రొక్కి మీరాక ♦ కెదురు చూచు
చుంటి నా నేర్పు విలువిద్య ♦ యును ఫలించె
గబ్బి మెకములు దిక్కామొ ♦ గంబు లయ్యె.
నేఁడుగా చెంచు కులములో ♦ నీటుగనుట. 37

37. దిక్కామొగంబులు = దిక్కులకుఁ బారిపోయినవి.

క. నీ పాదముఁ దల మోచిన
నా పేరిలనుంచు చెంచు ♦ నాయఁడటంచున్
నా పల్లె మృగనిదానం
బా పక్కణ మలరుకొండ ♦ యడవుల కొండన్. 38

38. పక్కణము = బోయపల్లె.

క. మంచులఁ బెంచిన మలనూ
అంచుల మించిన కటారి ♦ యాతని చుట్టుం
జెంచుల మోబన గుట్టం
జెంచుల దొర మొలవఁబెట్టు ♦ జెట్టుల నృపతీ. 39

39. ఓబన = చెంచువాళ్ళ దేవత. పూజించు.. యాతని = దేవేంద్రునియొక్క, చెంచులయోబన (అనఁగా శివుఁడని చెప్పవలెను.) (చెంచులదొర యనఁగా సేననియర్థము) హిమవన్మేరు కైలాసముల యందు జెట్లు మొలవేసినాను (అనఁగా నా పర్వతములయందు దిరుగు చుందునని తాత్పర్యము.

గీ. చట్టుపలు చట్టుపలు గొట్టు ♦ సట్టి గట్టి
గట్టు రాగట్టు బిట్టుపేరు ♦ పట్టుపట్టు
దట్టి జగజెట్టి గొట్టంప ♦ కట్టవిట్ట
మెట్టుమెట్టది మాట ♦ పట్టుగట్ట. 40

40. చట్టు = పర్వతములయొక్క. పలః = విస్తారమైన. చట్టుపలు=ఱెక్కలు.

సీ. కీటు దిద్దెడుచోటఁ ♦ గేనల మృగనాభి
మను మద్ద సరిసుమ్ము ♦ మనుజనాథ
వాస పోసెడుచోట ♦ వాసనగల వాస
మేపె వాసము నొక ♦ డింతె మహిప
పెండె గట్టెడు చోటఁ ♦ బెను పగడపు తీగ
లీతమొల్లెలు దుల్య ♦ మెప్పుడు నృపతి
యిల్లు గట్టెడు చోట ♦ జల్లులు గసవు పం
జులు సమానంబులు ♦ క్షోణి రమణ
గీ. గీమలుకుచోట జవ్వాది ♦ గోమయంబు
సమము ముగ్గిడు చోట వం ♦ శకరి దంత
కోలదంష్ట్రిల ముత్తెముల్ ♦ రాలుఁ పిండి
రెండు నొండయ్యె మాకొండ ♦ మండలేశ. 40

41. మెల్లెలు = సన్నపుపాడవైన కొమ్మలు కసవుపంజులు = గడ్డికట్టలు, గీము = ఇల్లు, కోల = అడవిపంది కీటు = మట్టిగోడ భాగము.

గీ. సామి యేమేమి లేదు ♦ మా భూమియందు
తల్లిదండ్రుల మీవంటి ♦ దాత దైవ
ములనె తీరాదు పులిజున్ను ♦ మున్నె కలదు
కడమ యొక్కటె గాన నీ ♦ యడుగులాన. 42

42. కడమ = లోపము.

గీ. రెండుగడియలపైన మా ♦ కొండ కొండ్ర
యొందు చెట్టున కొకటియు ♦ రెండు మూడు
నుండు గండకముల జంతు ♦ కాండకములఁ
జెండ వచ్చుఁ గటారి వి ♦ ల్లుండ నిమ్ము. 43

43. కొండ్ర=దున్నుచున్న నేల. (లక్షణచే తెలపి నేలయనుట,)

క. మానిసి యలుకుడు విన్నం
గానంబడి యందుఁ గదలు ♦ గద కైదువచేఁ
బూపి యదలించునాడె కు
లీనా ! యయ్యడవిలోప ♦ లి మెకంపు గముల్. 44

44. అదలించునాడె = బెదరించునప్పుడే. కులీనా = సద్వంశమునందు బుట్టిన రాజా.

క. నానాటఁ గూర నారకు
నోనాటఁగ నేసి యింట ♦ నుండగ చానల్
గోనల్ దిరిగి మెకంబుల
సేనల్ గాఁదెత్తురింత ♦ సేపున నృపతీ. 45

సీ. ఒకయాత గవిమావి ♦ యూన్చు బెబ్బులి నూర
బిల్లి యంచునె పట్టి ♦ పెనచికట్టు

నెఱురు మారిన పందిఁ ♦ గదిసి గాదియక్రింది
పందికొక్కుని మోరఁ ♦ బట్టి కెడపు
కర్జూరమును గండ ♦ ఖర్జూహృతికి రాయు
కరి దుంతయని యీడ్చుఁ ♦ గర్ణమంటి
కుంజరేంద్రంబుపైఁ ♦ గుప్పించు సింగంబుఁ
జెల్లరేచని పండ్లు ♦ డుల్లఁ దన్నుఁ
గీ. నధిప! దేవరబంటు గ ♦ స్నట్టిపట్టి
నిన్న పున్నమకై దేండ్ల ♦ నిసువు సామి
వాని కల్లరితనము లీ ♦ శ్వరుఁడెఱుంగు
నీరు తటకాపడుదురొక్క ♦ యింత గనిన. 46

46. గవి = గుహ. దుంత = దున్నపోతు. కల్లరితనము = మోసము. తటకాపడుదురు = నిశ్చేష్టులాదురు.

సీ. వనుల నోదాలఁ ద్రోి ♦ వకదేవ కరిఁబట్టి
యొరిజవై వక యెక్కు ♦ నునుటుదనము
తడవింట నేయక ♦ తరఖి గాలిమెకంబు
నుసురుతోఁ గొనివచ్చు ♦ నసమ జవము
వలలొడ్డ కాయుధం ♦ బులు లేక మొదటి పం
దిం బట్టి ఱతఁగట్టి ♦ తెచ్చు బలిమి
యురిలేక జిగురులే ♦ కొగి బుల్గురాయని
లావులతోఁ దెచ్చు ♦ లావు కొలఁది
గీ. మాకు మేమాడుకొనరాము ♦ గాక జోక
వేఁటలాడించి నారెంము ♦ వేఁటలాడి
నారు మునువింటి కనుఁగొంటి ♦ నన్నువంటి
యొరుకు దొరకునె నినువంటి ♦ యెఱుక దొరకు. 47

47. ఓదాలు = ఏనుఁగులఁబట్టు గోతులు. ఒరిజ = మెడ గొలుసు. లావులు = అక్కయీకలు. ఎఱుకదొర = తెలివిగలరాజు.

క. మాయల మొకంబు నేసిన
యాయన నన్నెఱుఁగనలయు ♦ నటకాదె నరుం
డేయక మును గిటిఁబొరిగొను
నాయకుఁడావెన్క మీరె ♦ నన్నెఱుఁగుటకున్. 48

క. ఇవి పందికొమ్ము గాయము
లివి సింగపుకోరజీర ♦ లివి యేనుఁగు పో
ట్లివి పులిగోరుల చెనకులు
నువుగింజకుఁ జోటిడదు త ♦ నువు గనుము నృపా 49

49. చెనకులు - ఆక్రమణములు. (అనఁగా చీరకలు.)

సీ. తన గాలి యింతసో ♦ కిన జారు దిగ్గజం
బుల మోపుఁగని శేష ♦ భోగి ములుగఁ
దన కాలి మట్లచే ♦ జనులకుఁ జొరరాని
కాంతారములు చాప ♦ కట్టు వడఁగఁ
దన ప్రక్క యొరసినఁ ♦ గనకాద్రి మొదలగు
నుర్వీధరంబు లు ♦ ద్భ్రాతలూఁగఁ
దన దాన ఝురులచే ♦ వనధి బాడబ హుత
భుజులకు డాకాల ♦ బొమ్మఁగట్టఁ
గీ. గొమ్ముతాకుల కుసులకుఁ ♦ గూలమబ్బు
లదరి ఫూత్కృతి రవిమధ్య ♦ మంకె గొనఁగఁ
జిక్కువడక చరించు నం ♦ దొక్క కరటి
చందు వంగడపుం దమ్మి ♦ చదలు కెడప. 50

50. మోపు = బరువు. అంకెగొనఁగన్ — కప్పుకోఁగా. కరటి-ఏనుఁగు.

క. దండము దేవర వనవే
దండముపై వైరి బాహు ♦ దండములకు గో
దండముఁ బోలెడు నీకో
దండము పసఁ జూపుటకును ♦ దగు నిర్వేళన్. 51

51. కోదండముబోలెడు - వజ్రాయుధముకలెనన్న.

క. దేవర యరుదెంచిన మే
లే వెరవుననైనఁ బట్టి ♦ యిత్తున్ హత్తిన్
నావంటి బంటు నాపిన
బావగజాఖేటక ప్ర ♦ పంచంబునకున్. 52

51. హత్తి - ఏనుఁగును.

క. వేటాడ దొరల సన్నిధి
మాటాడ మదించు చెంచు ♦ మన్నిలఁ గరం
బూటాడఁజేయు నన్నిఁట
జూటాడనెయుండు నతఁడు ♦ చూచెదరె కదా. 53

53. జూటు = మోసము.

క. అనిన మృగయావినోదము
మనమునఁ బెనఁగొన నృపాల ♦ మణి యాప్తజనం
బులు వాగురికు ల్వెంటం
జనుదేర నరణ్యమునకుఁ ♦ జనియెడు నెడలన్. 54

ఉ. బెబ్బులికూన దానవుఁడు
భీముఁడుగామిడిగట్టుగట్టి వా
గబ్బి కరాళి కాళి సుర
గాలి గయాళి వయాళిపుట్ట చెం
డుబ్బరి సింగిణీ మిసికి

యొంటరి గొంటరిపందిచక్కవా
ల్మబ్బుమొగాల మిత్తియన
మత్తిలి వాగిలు జాగిలంబులన్. 55

క. నిగ నిగని పైఁడి గొలుసులు
నిగుడింపుచుఁ బట్టిపట్టి ♦ నిద్దఁపు చిటికాం
ద్రగణంబు నొటరా విభు
శ్వగణికుఁ డీక్షించి మ్రొక్కి ♦ చక్కఁ జనియెన్. 56

56. చిటికాంద్రుఁడు = కుక్కలు. శ్వగణికుఁడు = కుక్కల సమూహముగలవాఁడు.

క. తేటకరు ల్గల యల వన
వాట గిరుల్నాటి భిల్ల ♦ వరులేనాను
ల్లేట సిరుల్తీటకరు
ల్వేల మరుల్దొరకుఁ గొలుప ♦ విడివడి యంతన్ 57

57. లేటసిరుల్ = కొమ్మలశోభలు. తీట = దురద. (అనఁగా మదకండూతి).

సీ. ఇవి పుట్టఁ గోరాడి ♦ చవిఁజూచి మధుకోశ
ములు భల్లకము సల్లు ♦ పొలము లయ్యె
యివి చెట్టువెంద్రుక ♦ ల్దవుల నూడక నిల్చి
చమరులఁ బులులీడ్చు ♦ జాడ లయ్యె
యివి పొత్తి సొలసిన ♦ మృగనాభి మృగి నెత్తు
రులు గప్పళించిన ♦ నెలవు లయ్యె
యివి పిల్లలకు మేత ♦ లిడి పిల్లులెల్ల సాం
కవ మొంద నెరసిన ♦ కట్ట లయ్యె

గీ. ఇవి కరటి కుంభ దళన వి ♦ జృంభమాణ
శబరి సంహారి సింహ రో ♦ ష చలిత దను
జాత భిల్ల పరాభూత ♦ భూత గహన
సంచరణ పంచముఖ నివా ♦ సంబు లయ్య. 58

58. భల్లకము = ఎలుఁగుబంటి, పొత్తి = పొత్తికడుపు. ప్రాలసిన = వ్యాపించిన. పిల్లులు=సంకుమృగములు.

గీ. అనుచుఁ బలుకుచు నటవీరు ♦ లటవి కిటుల
వలలు ఘటియించి నగర నో ♦ వనులు ద్రవ్వి
బోను లమరించి తెరలెత్తి ♦ ప్రోగువారి
చుట్టియును కుల మెకముల ♦ జోఁపువెట్ట. 59

59. జోఁపువెట్టన్ = బెదరఁగొట్టఁగా.

క. మార్గములఁ బన్నువగలకు
మార్గంబులు చిక్కువడక ♦ మరలిన నెలవు
ల్మార్గికులు గాంచి నిష్ఠుర
మార్గణముల గెడపి రంత ♦ మహీపతి చెంతన్ 60

60. వగలు = ఉపాయములు. మార్గంబులు = మృగ సమూహములు. మార్గికులు = మృగముల వేటవాండ్రు.

క. ఎలుఁగుల మలుఁగుల నలుఁగుల
గులగులలుగఁ జేసి పట్టు ♦ కొని బిట్టలుకం
బలుగుల సలుగుల ములుఁగులఁ
గలఁగంగాఁ గట్టి రట్టి ♦ గట్టి కిరాతుల్. 61

61. మలుఁగులు = తుంట్లు. గులగుల = చూర్ణము. పలుగులు-కాడికిఁగట్టుత్రాళ్ళు. నలుఁగులు - పందులు. ములుగులు = మూల్గుటలు.

క. కరవాలమ్ముల మదకరి
కరవాలమ్ములను జించి ♦ క్రమ్మరి వని ద్రి

మ్మర వాలమ్ములఁ గల చా
మర వాలమ్ముల నొగిల్చె ♦ మఱి యొకఁడలుకన్ 62

62. మద...వాలమ్ములను = మదకరి - మదపుటేనుఁగుల యొక్క, కర - తుండములను. వాలమ్ములను - తోఁకలను. చామర వాలమ్ములన్ - వాలచమరమృగములను.

క. పులిచెలికె లోని రేఁగుం
బులికాయల కరిగి యొక్క ♦ పులి, చింత పొదం
బులియుండ జాగిలముచేఁ
బులిపులి గావించె నొకఁడు ♦ పులి మేనెల్లన్. 63

63. పులిచెలికె = గడ్డిబీడు. పులిపులిఁగావించెన్ - మర్దించెను

క. చెమరుం గాకిం గనిపై
చె మరుద్వేగంబు జేగఁ ♦ జేఁగొని వెంటం
జెమరు బలిమి గల యొక్కఁడు
చమరులపై దృష్టిఁ ద్రిప్పె ♦ జనపతి గనఁగన్. 64

64. చెమరుఁగాకి, చెమరు = చెమర్చు

సీ. నాఁద మబ్బు బలుఁగబ్బు ♦ మఱి బెబ్బులిని నుబ్బు
వడిఁగొబ్బు సను మబ్బు ♦ వొడిచె నొకఁడు
వలఁ దట్టి చనుగట్టి ♦ వగచుట్ట నరిగట్టి
జగజెట్టిఁ బడఁగొట్టి ♦ చనియె నొకఁడు
నెర బింకము దొలంక ♦ నిలుమింక నని కొంక
కకలంక గతి జింక ♦ నంటె నొకఁడు
నడిగొండ చరిదండ ♦ నడ దండమున మొండ
డరుగండకము గండ ♦ డంచె నొకఁడు

గీ. చండ కోదండ కాండ ప్ర ♦ కాండముల స
ఖండ వేదండ కరగండ ♦ మండలముల
గండ భేరుండమును గండ ♦ తుండెములుగ
నండఁ జనుచుండఁ జెండు చెం ♦ డాడె నొకఁడు. ౬౫

65. గబ్బ = దుర్వాసన, మబ్బువాఁడిచెన్ = చీఁకటి పడు నట్లుగాఁజేసెను.

వ. అని వనింజుట్టుకొని తెట్టతెరవు మొకంబులఁ గొట్టి తుట్టలుగాఁ బెట్టి గట్టి చెట్టులకుం బిట్టురికిన ఖడ్గమ్ముల ఖడ్గమ్ముల భల్లమ్ములఁ భల్లమ్ములఁ జిల్లరమ్ముల జుల్లరమ్ములఁ జామరమ్ములఁ దోమరమ్ములఁ వేదండంబులఁ గోదండంబులఁ గొండగొరియల నుండసురియలఁ గొండచరియల తండ ముద్దండతం బెంపుపడఁ జెండాడుచుండఁ జండకిటి యొకటి చిక్కువడక యొక్కనడకతో వెలువడి వడిగల గడలబంట్ల మొత్తమ్ముల కుంతమ్ముల దంతమ్ములఁ దుత్తుమురుగా నప్పళించి యప్పాఁజుల మెప్పించి యప్పటప్పటికిం గనుజిప్పలఁ దెప్పలుగా గుప్పళించు విప్పుగల నిప్పుకల కుప్పలకుం దోడు నప్పళించినం జిప్పిలు దంష్ట్రి లగ దనర్గళ లాలాజాలంబు రాహువు ముక్కాలు గ్రాసంబుగా మెక్కినం జిక్కిన రిక్కదొర ప్రక్కం దొరఁగు సుధాధారలం గేరడంబాడ ననదృశ నిస్వన దళని పాత విశకలితతర నిస్తుల స్థూలప్రస్తర ద్వయాంతర దుస్తర సంకుచితమార్గ నిర్గమ క్రమణోభయపక్ష సంఘటన పార్శ్వవనీప నీప తత్తదుపలయుగళ తట తమాల

సాల నిద్రిత భద్ర దఁతావళాభ్రంకష ఘీఁకారం బెచ్చఁ బెచ్చువుం గడలుఁ గడలుకొన్న కరులు చెవుడుపడ ననిశ నిశాత విలోలతా విశృంఖల రింఖా టంక సముట్టంకిత గ్రావ గ్రామ జాగ్ర దుగ్రానల సద్యస్సముద్యదుద్దామ దావ పావ కావ సరధావన బహుధావనాధ్వావరోధ కుటిల విటపి వాటికా పాటన పాటవంబునకు వేసటలు లేక బాసట కాస టలు సముత్కట నిటల తటంబుల నిటక్కనిలచి యంపకట్టెల నటన ఘటియింప దివస గ్రాస ఘటనా ఫలిత కీచక కోటికోటి త్రుటన పటిష్ఠ నిష్ఠుర త్రోటీ పుటీచటుల గుట గుటార్భటుల భటులం గలగుండు పరచి యల దండు తలఁగుండు గుండు గండంబై గండు మెరసినం గని దుర్ఘట ఘర్ఘర ఘుర్ఘుర ధ్వనులంగరా ళించి గహ్వరిం గాలుద్రవ్వుచు లాంగూల చలనంబు తోఁ జెవులు నిక్కించి మోరయెత్తి యావులించి వెడ లు విడుద నాలుకలు నకనకలు బడఁ బురోభాగంబు దన్ని చక్కసాగి లాగిన వాగురిక సంఘంబు సరిపనులు సడల్పకునికి సవ్యాప సవ్యంబులుగాఁ బెనంగి చుట్టునుం దిరిగి తచ్చరణంబులు మూర్కొని వాపోవుచు మా తంగ సంఘంబులం గను సింగంపు కొదమల తెరంగున మహోత్సుంబుల వీక్షించు తరక్షు శాబకంబుల దక్షు తం ద్రుళ్ళుబిరాలు వీడిసాఁగిన జాగిలంబుల పదనెఱింగి వేఁటకాండ్రు మెడపట్టెఁబూడ్చి క్రోడంబుపై విడిచిన.

66. చెండాడుచుండ (ఇంతవఱకు వేఁటకాండ్రు కర్తలు.) గండుమెఱసినన్ (ఇంతవఱకుఁబందికర్త.) వీడిసాగిన (ఇంతవఱకు జాగిలములు కర్తలు. చండకిటి = కోపముగల పంది. గెలువడికడి = గెలుపుగల వేగము. గడెలబంట్లు = ఈటెబంట్లు. దంష్ట్రిలగత్ = కోరయందుఁ దళుకొన్న. లాలా = చొంగ. ముక్కాలుఁగ్రాసంబుగా = ముప్పాతికమట్టు లోపలికిఁబోవునట్లుగా. చిక్కిన = మిగిలిన. పనీపతత్ = మిక్కిలిపడుచున్న, పెచ్చవు = అతిశయించిన. రింఖా = నడకయనెడు. టంక = ఉలిచేత. సముట్టంకిత = కొట్టఁబడిన. గ్రావగ్రామ = ఱాళ్ళసమూహమందు, కీచకకోటి = అనేకములైన వెదుళ్ళయొక్క. కోటి = అంచులయొక్క. త్రోటి = ముట్టె, తలఁగుండున్ - ఒత్తిగిలఁగా. గహ్వరిన్ = భూమియందు.; నకవకలుబడెన్ = జవజవలాడఁగా. శరిపసులు = గొలుసులు. తరక్షుశాబకంబులు = సివంగి పిల్లలు. పదను = అనుకూలసమయము. (అసదృశ... ఘీంకారంబెచ్చ, పెద్దచప్పుడుగల పిడుగులుబడిఱాళ్ళు బ్రద్దలుకాగా ఆసందులమార్గమున జిరుకుగా వచ్చుచు (జక్కులు దగిలి యాఱాళ్ళు పడిపోయి యక్కడి తాపింఛవృక్షముల క్రింద నిద్రించుచున్న యేనుగులు గీపెట్టుచున్నవని తాత్పర్యము.) (అనిశ...ఘటియింపఱాళ్ళపై) బరుగుబెట్టుచుండఁగా డెక్కలదెబ్బలచేత అగ్గిబుట్టి యడవి కాలుచుండఁగాఁ బారిపోవు త్రోవకడ్డయిన చెట్లు పడఁగొట్టునప్పు డొడలొత్తకుండఁ జేయు వెంట్రుకలునిక్కి బాణములవలెనున్నవని తాత్పర్యము.)

సీ. కొన్నిజాగిలములు ♦ కోలాగ్రమున నిల్వ
నొక కొన్ని వెనుకకా ♦ లికిని నొడియు
నొడియుచోఁ గ్రోడంబు ♦ పెడమరఁ దిరిగిన
నవిజారి యెదిరికి ♦ నట్ల కదియుఁ
గవియుచో మరలి యే ♦ కలమంది సెలసిన
బెట్టుచే నవి కిటి ♦ వెంటఁబెట్టు
బెట్టుచోఁ బిరిదిని ♦ బెడతలఁగొని లాఁగె

కెడపినఁ గడమవి ♦ కడలఁ గదియఁ
గీ. గదిసి కురువీరు లభిమన్యుఁ ♦ గక్కసింప
నిక్కి జిగినొక్క మొగిపెక్కు ♦ కుక్కలెక్కి
పిక్క ప్రక్కయు డొక్కపే ♦ రుక్కుచెక్కి
మక్కుచిక్కించుకొన నుక్రెక్కి ♦ నక్కిటియును. 67

67. కోలాగ్రమునన్ = పందికొమదుట. యేకలము = పంది. సెలసినన్ = విజృంభింపఁగా. గెడపినన్ = కొట్టఁగా. కక్కసింపన్ = బాధింపఁగా. మక్కుచిక్కించుకొనన్ = అవిసిపోవునట్లు చేయఁగా.

సీ. గుహఁజొచ్చి నిదురించు ♦ కోల్పులి మేల్కొల్పి
బడిఁబిల్చుఁ దిట్టుఁబైఁ ♦ బడక యున్నఁ
దగవేఁచి వేఁచి చన ♦ ద్రావు కూనం గొని
వాఁడురాగవిడించి ♦ వచ్చి కాంచి
శిరమెత్తి వెనుక వం ♦ చిన మేనితోఁ దోఁక
చరచి చంగున మీఁది ♦ కుఱక దానిఁ
దల గుడ్డ నొడు పింత ♦ దప్పించి చేయిచ్చి
కుడికేల జముదాళి ♦ కొలఁదిఁ బొడిచి
గీ. చించి తిత్తొల్చి కటిఁ దాల్చి ♦ చిక్కు జింక
కొదమఁ జేఁబట్టి బెబ్బులి ♦ కోర మసుగు
గొడ్డలి ధరించి పులిపిల్ల ♦ నిడ్డవాని
కీశ్వరుఁడు వేఁటకని భూతి ♦ యిచ్చె నృపతి. 68

68. వేఁచివేఁచి = కనిపెట్టికనిపెట్టి. వాఁడు = ఆ వేఁటకాఁడు. జముదాళి = ఆయుధవిశేషము. భూతియిచ్చెన్ = బహుమతిఁజేసెను

సీ. అలజగత్ప్రాణ సా ♦ రంగ భంగ ప్రౌఢి
పావనమూర్తికిఁ ♦ బలుచ ననుచుఁ

బశుపతి హాస్తైణ ♦ శిశుక్రమమథనంబు
సర్వజ్ఞునకుఁ గాని ♦ చందమనుచు
ద్విజరాజ శంబర ♦ విదళ నోల్లాసంబు
రాజచిహ్నమునక ♦ క్రమ మటంచు
నట యజ్ఞ మృగశీర్ష ♦ ♦ హారణ విహారణంబు
ఘనమార్గమునకు లా ♦ ఘవ మటంచు

గీ. దయ దలఁచెఁగాక కాకున్నఁ ♦ దరుల దరులఁ
గరుల వ్యాఘ్రాదుల వధించు ♦ ఘనున కెంత
యని వనీభూమి భూభుజు ♦ లభినుతింప
నఖిల మృగములఁ జెండాడె ♦ నధిప మౌళి. 69

69. పావనమూర్తికిన్ = వాయువుకనియు, పవిత్రునకనియు నర్థము. ఏణశిశుకంబు = లేడిపిల్ల. సర్వజ్ఞునకున్ = శివునికనియు, సమస్తమెఱిఁగినవానికనియు నర్థము. రాజచిహ్నమునకున్ = చంద్రకళంకమునకనియు, రాజలక్షణమునకనియు నర్థము. ఘనమార్గమునకున్ = ఆకాశమునకనియు, గొప్పరీతికనియు నర్థము. తరులదరులన్ = చెట్ల సమీపములయందు

గీ. వేటఁ జాలించి లాలించి ♦ యాటవికుల
నాగ ఘాటీ సమాటీక ♦ నాగ ధన్వి
మాగ ఘాధీశుఁ డపు డేగె ♦ మౌళ వేంద్ర
మానసార మహాద్యమో ♦ ద్యానమునకు. 70

70. నాగఘాటీ = ఏనుఁగులమీఁది దాడియొక్క. సమాటీకన = వెడలుటకు. అగధన్వి = రుద్రుఁడైన.

ఉ. జాతికిఁజుక్కవాల్ పిదప
జాతికిఁ బువ్వులవాఁడు శంబరా

ధాతికి నే స్తకాఁ డివము
రాతికిఁ డంకముఖంబు యామినీ
భూతికి సాంధ్యనిద్ర నల
భూతికిఁ బంచమ శుద్ధి తుమ్మెదల్
వాతికి మేత గోరు తరు
వాతికిఁ వచ్చె వసంతుఁ డంతటన్. 71

71. జాతికిన్ = సూర్యవంశమునకు. చుక్కవాలు = ఎదురుచుక్క అయినది. జాతికిన్ = జాజితీఁగకు. పువ్వులవాడు = పుష్పముల వాడిపోవునట్లుచేయునది. శవముజాతికిన్ = ఘంచనెడు శిలకు. టంకముఖము = ఉలిచివర. సాంధ్యనిద్ర (సంధ్యాకాలనిద్ర వల్ల ఐశ్వర్యహాని) నల = పద్మములయొక్క.

క. కాంత లతాంతామోదా
క్రాంతానంతంబు పాంథ ♦ కాంతా స్వాంతా
త్యంతాగ్ని తాళ వృంతము
శాంత హిమా శాంత మవ్వ ♦ సంతం బలరున్. 72

72. అనంతంబు = ఆకాశముగలది.

మ. అధిగౌరంబును బల్లవాళికిడి బా
ణాది క్షమాజోద్ధతిన్
మధురత్వంబు ఘటించి గోపికల స
మ్మానంబు నిండించి తా
మధువు న్నవ్య మనోనివాసమునకు
స్మన్నించి శైలీముఖా
స్య ధృతోద్దీపికఁ జొక్కు మాధవుఁడు రా
ధాఖ్యా బలాసక్తుఁడై. 73

73. ఈపద్యమందు వసంతర్తుపరముగాను కృష్ణపరముగాను, రెండర్థములు. పల్లవాళికిన్ = చిగుళ్ళపఙ్క్తికి; పల్లవ=పాదలేశము, ఆళికిన్ = స్నేహితుఁడుగలవానికిఁ (అనగా పాదభక్తునికి.) అధిగౌరంబు=అధికమగు తెలుపును. అధికమగు నైర్మల్యమును. బాణా... ద్ధతిన్= (బాణాది = నీలిగోరంటచెట్లు మొదలగు, క్షమాజ = చెట్ల యొక్క, ఉద్ధతిన్ = అతిశయమును. బాణాది = బాణాసురుఁడు మొదలగువారియొక్కయు, క్షమాజ = నరకాసురునియొక్కయు, ఉత్ = గొప్పదియగు, హతిన్ = కొట్టుటచేత ) గో = భూమియందైన. పిక = కోవెలలయొక్క. గోపికల = గోపికాస్త్రీలయొక్క. మధువున్ = మకరందమును ; పాలను. నవ్యమనోనివాసమునకున్ = (అనగా మనసున కింపగుటకు.) శైలీముఖ = తుమ్మెదలసంబంధమైన ; బాణముల సంబాధమైన. ఉద్దీపిక = ప్రకాశము. మాధవుఁడు = వసంతుఁడు; కృష్ణుఁడు, రాధా = వైశాఖపూర్ణిమ ; రాధాదేవి.

క. మగధపతిఁ గాంచి వెలిమరుఁ
డగుదెంచె నటంచుఁ జైత్రుఁ ♦ డలరుల మేల్క
ట్టిగురుల తోరణములుఁ దగ
నగనగరమలంకరించె ♦ నా వనమొనరెన్. 74

శా. పూచెం బొన్నలు, గొన్నినల్ మొనసె, సొం
పు ల్మీఱ సంపంగి పె
ల్లేచెం, బుష్ప సమృద్ధి మల్లియలచా
లిందిందిరీ బృందముల్
బోర్చెం, గందము లందుగుల్ చిగురు గుంపు
ల్నింపె, నింపారఁగాఁ
గాచెం బాల రసాల సాలములు సిం
గారంబుగా నామనిన్. 75

సీ. అంగనా గాత్రాది ♦ సంగోపమానంబు
నవవిల్తు సాన దీ ♦ రిన లకోరి
స్ఫురిత సంకుమద గంధ ♦ చూర్ణ సౌరభ దాత
రాచిల్క దోర మెల్లి ♦ పాప్రు దెలియ
అధ్వన్యచేతో హ ♦ తాశన వ్యజనంబు
బుడుత తెమ్మెరకును ♦ విడిన దంట
రత్యంత తాంత హృ ♦ ద్రసపు నస్థితి కర్త
చిదుమంగఁ దలకెక్కఁ ♦ జేయు దంట
గీ. గర్వితారాము భూమ్యాలం ♦ కారకారి
చూడఁగలవాని చెలికాని ♦ జోడుకోడె
శోభన స్వాంత నామధే ♦ యాభి నవము
క్రొవ్వి యమ్మ్యేడఁ గ్రొవ్విరి ♦ నివ్వటిల్లె. 76

76. ఎల్లి = గొడుగు, చూడ...కోడె=మన్మథునికి మిత్రుడైన వసంతునికి సహాయుఁడైనది. శోభ... నవము = సుమనాఃఅను పేరుచేత నొప్పునది.

క. అంతట నుప వనకేళీ
సాంతత్యంబునకు మాన ♦ సార ధరిత్రీ
కాంత కుమారి యవంతియ
వంతియపురి నుండి యమిత ♦ వనితా వృతయై. 77
సీ. కర్ణాట యొకతె చెం ♦ గాపి పావడ వేయఁ
గరహాట యొకతె బా ♦ గాలొసంగ
గాంధారి యొక్కతె ♦ కాళంజిచే నంద
ద్రమిడి యొక్కతె వీజ ♦ నము వహింప
సౌరాష్ట్రి యొక్కతె ♦ చమరవాలముఁ బూన

బాహ్లీకి యొకతె ద ♦ ర్పణముఁ జూప
పాంచాలి యొక్కతె ♦ పాదుకల్ ధరియింప
నాతి యొక్కతె గిండి ♦ చేతఁబట్ట
గీ. బర్బరీ ఘూర్జరులు బరా ♦ బరులు సేయఁ
బల్లకీ యెక్కి సల్లకీ ♦ పల్లవోష్ఠి
వల్లకీ వాణి వాణీ ప్ర ♦ ఫుల్లకీర్తి
గారవమ్మునఁ జేరె శృం ♦ గార వనము. 78

78. సల్లకీ పల్లవ = అందుగు-చిగురువంటి.

శా. పూవుం దోఁట యొయారి జేరి జలితం
పుం జందు రాతిన్నెఁడం
బూవుం దేనియ సోన వాన చౌతుకుల్
పోవైచు గొజ్జంగి పూ
పై వాటు ల్గలదాసనంబు గరిమం
బన్నీటి మున్నీటి బల్
త్రోవం గట్టిన పచ్చమెట్టికలపైఁ
దోడ్తోడఁ గ్రీడింపఁగాన్. 79

79. చౌతుకుల్ = చెమ్మలు. మెట్టికలు = మెట్లు.

క. గళిత మకరంద లహరీ
కుల కుహరీ లహరి మహీజ ♦ కుసుమ సుగంధా
కుల గమ మహిమ హిమంబులు
మలయఁ దోడఁగెఁ గోమల యచుత ♦ మలయా
నిలముల్. 80

80. లహ...రీలన్=(లహరీ=తరంగములయొక్క. కుల = సమూహము గల. కుహరీ=గుహలయొక్క ఇలన్=భూమియందు.)హరి = పచ్చనైన.

చ. కలువల తావిఁ దావి బలు
కప్రి వనంబుల వంటి జూంటి తే
నెల జడిఁ దోఁగి గొజ్జఁగుల
నీటి కొలంకుల నీఁది పోకమాా్రి
కుల విరిగుత్తు లత్తి చలి
గుప్పెడి పుప్పొడి నప్పళించి య
య్యళి కచ సేదఁ దేర్చె నపు
డందఁపు దాదఁపుఁ గొండ పయ్యెరల్. 81

సీ. శిరము కప్రఁపు దుమ్ము ♦ మరువంపు పాదుల
కెరువాటు వైచిన ♦ యింపు సొంపు
గమ్మ తేనియ నీళ్ళు ♦ గట్టి పుప్పొడి మట్టి
గోడకాల్దీర్చిన పొ్రిడతనము
గందంపు గూచముల్ ♦ పొందించి కురువేళ్ళ
నలవగాఁ గట్టిన ♦ యట్టి మహిమ
పన్ని చెట్టుల చుట్టు ♦ బలు వట్టి వేళ్ళచేఁ
గంచెఁ గావించిన ♦ గారవంబు
గీ. తావి తమ్మి కెళాకూళి ♦ దండ నొప్పు
గొప్ప పన్నీటి కాల్వకు ♦ నుప్పరిగకు
నతుల జలసూత్రి మిడినట్టి - యద్భుతంబుఁ
గాంచి రాజన్య మూర్ధన్య ♦ కన్యఁ బొగడె. 82

82. ఎరువాటు = చెట్లకుఁజేయుదోహదము. గోడకాల్ = అడ్డుగట్టు. కూచముల్ = స్తంభములు. అలవ = దడి. కంచె = కంపకోట.

సీ. తాల్చునా మట్టె మా ♦ ధవుని ముద్దుమఱంది
యా పొన్నమీఁదఁ గ ♦ న్నిడియె నేని

శయనించునా సుధా ♦ జలధిఁ బన్నగశాయి
యీ మంచు దోనఁ గటా ♦ క్షించెనేని
ముడుచునా లేరాచ ♦ మొలక మిక్కిలి కంటి
యీ చల్ల విరజాజిఁ ♦ జూచెనేని
గొనిపోవునా వేల్పు ♦ కూఁటికుండ సుపర్ణుఁ
డీతేనె మావి యొం ♦ టెటిఁగెనేని
గీ. నుండుదురె చైత్రరథ నంద ♦ నోపవనుల
బాహుళ రంభాశ్రయం బీయు ♦ పవన మింత
యిందఱ నలకూబరులుఁగాంచి ♦ రేని యంచు
నచ్చకోరాక్షి నెచ్చెలుల్ ♦ మెచ్చి రపుడు. 83

83. చంద్రునియందు మచ్చ యున్నదని ప్రసిద్ధి. లేరాచమొలక = బాలచంద్రఖండము. వేల్పుకూఁటికుండ = అమృతకలశము. ఒంటె=కులఁవు. రంభా = రంభయను నప్సరస యనియు, అరఁటిచెట్టు అనియును.

ఉ. అమ్మ పరాకు పోక వన
మల్లదె చల్లని మల్లికాగ్ర కుం
జమ్మదె కప్పురం పనఁటి
సారువ లివ్వి రసాల సాలపుం
గమ్మని పువ్వుఁ దేనియల
కాలువ పొన్నదె యద్దె కంటివే
నిమ్మల చాయ గొజ్జఁగుల
నీటఁ దొలంగు దొనం దలోదరీ. 84

84. పొన్నదె = తిన్నఁగాగాన్పించుచున్నది యదిగో. దొన - చిన్న కాలువ.

సీ. ఈ పారిజాతంబు ♦ లేపారినవి కొంత
యీపారి చూతమే ♦ యిందు వదన
యా మల్లియల దాటి ♦ శ్రీమల్లి కుచవాటి
యామల్లుకొనియుండు ♦ నరుఁగ దగదె
యా నిమ్మచాల్ త్రోవఁ ♦ బోనిమ్మ వలదంచు
నానిమ్మగువ వెట్టు ♦ టదియు వినవె
యీ నీరు చన నీకు ♦ రానీరు బడలినా
రీనీరు కైదండ ♦ యింతగలదె
గీ. యమ్మ యిది కమ్మ విరిత్రేనె ♦ యసలు సుమ్మ
కొమ్మ యిది మమ్మరంబైన ♦ కుసుమ రజము
తావులని దెల్పెఁ దేట మా ♦ టల వయాళి
నంగజ హయాళి గయ్యాళి ♦ యగు ప్రియాళి. 85

85. ఈపారి = ఈపర్యాయము. అమల్లుకొని = అవరించి. వలదంచు = అడ్డుకోవద్దని. అన=ఒట్టు. ఈరు బడలినారు = మీరా యాసపడినారు. కైదండయీనీరు=హస్తావలంబమిచ్చ్యు నీయురు. అసలు= బురద. వయాళిన్ = వనవిహారమందు. అంగజహయాళి = చిలుకల పఙ్క్తికి. గయ్యాళి = ధిక్కరించిపలికేది. ప్రియాళి - ఇష్టసఖి.

ఉ. మిన్నరచేత బట్టు కడి
మిం జెలి యొక్కతె కొప్పు చక్కఁజె
క్క న్నటియించు కైతవముఁ
గైకొని వేనలి మోపుజేకొనం
గన్నియ యొర్తు కైయొసఁగు
కైపునఁ జన్గవ మోవ నొక్క క్రీ
డ న్నలినాక్షి యుం బిడికి
ట న్నిలువన్ రహిమధ్యమానఁగన్. 86

86. కైపునన్ = శోభచేత, (అనగా మిమచేతనని తాత్ప ర్యము.) ఇందాచిన్నదాని యవయవములను జెలికత్తె లవలంభించిరని తాత్పర్యము.

సీ. చిఱునవ్వు చిలుకుచోఁ ♦ జెలిమోము తేఁగొమ్మ
రాలు క్రొవ్విరులంచుఁ ♦ గేలుసాచుఁ
గొసరు పల్కించుచో ♦ బిసరుహాక్షి యొకర్తు
వనకీరమంచు న ♦ ల్వంక నెదకెఁ
గీల్గంటు వీడుచోఁ ♦ గిసలయోష్ఠి యొకర్తు
తనుగంధ గమ్యాళు ♦ లనుచు జోపఁ
బయ్యెద యొక్కింత ♦ బైలైనచో నింతి
యొకతె దాడిమ శంక ♦ నొడియఁజూడ
గీ. నొకతె బాగా లొసంగ వే ♦ ఱొకతె సుకటి
వీవ మఱి యొర్తు సమభూమిఁ ♦ బావ లిడఁగ
నెండపొడలకు వ్యజనంబు ♦ నెత్త నొకతె
తేలె నారామ యారామ ♦ కేళి పాళి. 87

87. కొసరు = కోరిక. బాగాలు = పోకచెక్కగుండ మొదలగునది యుంచి చుట్టిన తమలపాకులు. (బిడాలు.) పావలు = పాదుకలు. ఆరామ కేళిపాళిన్ = వనవిహారపఙ్క్తిని (బహువిహారము లనుట.)

సీ. చెంగావి పావడ ♦ చేత నితం బాంబ
రం బెల్ల సుమ ధావ ♦ నంబు గాఁగఁ
గులుకు గుబ్బల నంటి ♦ కొన్న రవికె పచ్చి
గంధంపు నెఱిపూత ♦ యందమొంద
సీమంత సిందూర ♦ సిక్త వజ్ర లలంతి
చొక్కంపుఁ గెంపు చే ♦ ర్చుక్క గాఁగఁ

గరఁగి చెక్కుల పట్టు ♦ గనుపట్టు కస్తూరి
నింతి కంతుని మద ♦ దంతిఁ జెనక
గీ. గమ్మ నీరుదకంబుమై ♦ గంధవొడియుఁ
దరుల విరులకు నొక వింత ♦ తావిఁ గట్ట
దొట్టు కొన్నట్టి చెమటలు ♦ దుడిచె నొక తె
చికిలి కాటుక నును రేక ♦ చెదరకుండ. 88

88. పావడ = గాగరా. సుమధామము = కుసుంబారంగు. సీమంత = పాపిడియందైన. లలంతి = పాపిడిచేరు. చెక్కులపట్టు = గండప్రదేశము. కమ్మనీరు = పన్నీరనెడి, ఉదకము = జలకము. గంధవొడి = బుక్కా. దొట్టుకొన్నట్టి = క్రమ్మిన. చికిలి = నున్నని.

చ. చెమటలు వొప్పఁదోఁగు జిగి
చెక్కులు పువ్వులు రాల మూపులం
దుమికెడి కొప్పులు న్నొసటఁ
దుంపెసలారెడు చేరుచుక్క లుం
గమికెడు గుబ్బ చన్ను గవ
గాసికిఁబాసిన జారు పయ్యెదల్
గమకపు వాలుగన్ను లెసఁ
గం బొసఁగించిరి కేళి బాలికల్. 89

89. దొప్పఁదోఁగు = నిండుగా గ్రిమ్మిన. మూపులన్ = బుజములపైని. దుమికెడు = నటించునట్టి, తుంపెసలారెడు = ఊగుచున్న. కమికెడు = కందునట్టి, గమకపు = సొగసైన.

చ. చనుఁగవ మొగ్గ లన్నిజ భు
జా కుజ శాఖల నవ్వుఁ బువ్వులం
దను లతలం గచ భ్రమర
దంపతులం బదపల్లవంబులం

గన దధరోష్ఠ బింబములఁ
గమ్రి వచో మధుపాళిఁ బొల్చి ర
వ్వనమునఁ దాము కాము వన
వాటికలో యన నవ్వధూటికల్. 90

90. కుజ=చెట్లయొక్క. కచ=కేశములనెడి. కనత్=ప్రకాశించుచున్న. కమ్ర=మనోహరములైన. మధుపాళి = మధు = మకరందము యొక్క. పాళి = ప్రవాహము.

శా. పువ్వుం దీవెల తూఁగు టుయ్యెలల సొం
పుల్ నింపఁగాఁ దూఁగు న
వ్వువ్వుంబోఁడుల గబ్బి గుబ్బ వలిపెం
బుల్ జారి వర్తింపఁగా
నవ్వేళన్ సరిదూఁగ రమ్మనుచు భూ
షా రావ భాషార్భటిం
గ్రొవ్వుల్ మీఱఁగ వేల్పు జవ్వనులకుం
గొంగిచ్చి నట్లొప్పెడిన్. 91

91. వలిపెంబుల్=సన్నబట్టలు. భూషా...ర్భటిన్=(భూషా=అలంకారములయొక్క. ఆరావ = ధ్వనులనెడి. భాషా = వాక్యములయొక్క. ఆర్భటిన్ = ఆటోపముచేత.) కొంగిచ్చినట్లు (శౌర్యముగలవారు శత్రువునపై యుద్ధమునకు రమ్మని కొంగువిసరుట ప్రసిద్ధి.)

ఉ. వాలిక చూపు మించుగమి
వంచి ముఖేందు పరిద్యుదారహా
రాళికమై విహార లసి
తా లసతాగ్రసితాగ్ర ఘర్మవా
ర్యాలి కపోల పాలికప
సం బొసఁగించె లతాంతడోలికా

కేళిక రాజు బాలికవి
కీర్ణ కచం బొాక చేతఁ జెక్కు_మున్. 92

92. ముఖేందు...ళికయై=(ముఖేందు=ముఖచంద్రునికి. పరిధి=పరివేషమై. ఉదార = అతిశయమైన. హారాళిక=హారపఙ్క్తిగలది.) (అనఁగా ఊఁగునప్పు డెగిరిన హారములమధ్యమున ముఖము పరివేషమధ్య చంద్రునివలెఁ గాన్పించెనని. విహార...పాళిక విహార లసిత = వనవిహారములల్లంబ్రకాశించుచున్న. అలసతా=మాంద్యముచేత. గ్రసిత=మ్రింగఁబడిన. అగ్ర = శ్రేష్ఠమైన. ఘర్మవాః = చెమటనీటిచేత. శాలి = ఒప్పుచున్న. కపోలపాళిక=గండస్థలముగలది. వనవిహారముకల్ల చురుకుతగ్గి అందువలన చెమటూర్చుకొనిపోవుచున్నదని.

క. హేలా గతి లీలావతు
లీలాగునఁ జాల లోల ♦ దేలా లతికా
డోలా ఖేలావేలా
ధీ లాలిత లగుచుఁ గేళిఁ ♦ దేలెడు నెడలన్ 93

93. చాలన్ - విస్తారముగాను. లోలత్ = ఆసక్తములగుచున్న, (ధీశబ్దమునకు విశేషణము.) ఏలాలతికా - ఏలకి తీఁగెలనెడు. డోలా - ఉయ్యేలలయొక్క. ఖేలావేలా - క్రీడాసమయమందైన.

క. వేఁటాడిన పిమ్మటఁ బూ
దోఁటకు నిజ మంత్రిసఖుల ♦ తోఁజను నృపుఁడా
పాటల వాటుల నయ్యా
లాటలఁ బొటిల్లు తటిద ♦ పాంగం జూచెన్. 94

94. పాటలవాటులన్ - పాదిరిచెట్లు వరుసలయందు, తటిదపాంగన్ - మెఱుపువలెఁ జలించు క్రీఁగంటిచూపుగల చిన్నదానిని.

ఉ. చూచి మరీచి వీచి పద
చుంబిత బింబ విడంబితాధరం
బీ చనుగబ్బిగుబ్బ వగ

లిట్టి విలోచన రోచి యింత చె
ల్వే చెలి యందుఁ జూడమని
యిక్షు శరాసన వాసనాగ్ర నా
రాద పరంపరాభవ సి
రంతర జర్ఝరితాంతరంగుఁడై. 95

చ. అనధరపాన సౌఖ్య దశ
నాగ్ర వినిర్దళితోష్ఠ కంబచుం
బనయుత లోచనం బనఖ
మర్దిత గండతలం బపాణిఘ
ట్టన మిళితాచలత్కుచత
టం బదృఢీభవదంకపాళి ఖే
లన పరితాంత గాత్రి మబ
లామణి దీని గణింప శక్యమే. 96

96. అచలత్ - పర్వతములై యాచరించుచున్న. అంక
పాళి - ఆలింగనము. ఈ విశేషణములవల్ల ఆచిన్నది పురుషసంయో
గములేని కన్యకయని తోఁచుచున్నది.

చ. అలరుల తీవ యువ్యెల యొ
యారపు టాటల గన్న యిన్నెలం
తల తలమిన్న హార గత
నాయక రత్నము శక్రకార్ముకాం
చల చలచంచలాలతిక
స్మారకరా హృత చాప మౌర్వికా
మిళిత శరం బిట న్నికట
మిత్రి నిధానముగాక కొంచెమే. 97

97. శక్ర కార్ముక - ఇంద్రధనుస్సుయొక్క. చంచలాలతిక - మెఱుపుతీగ. స్మార - మన్మథ సంబంధమైన. ఉయ్యేలలోనున్న చిన్నది హారములోని నాయకమణివలెను, ఇంద్రధనుస్సులోని మెఱుపువలెను, మన్మథ ధనుస్సులోని బాణమువలె నున్నదనియు, దగ్గిరనున్న నిధితో సమానముగా నుండెనని తాత్పర్యము.

క. నెలమట్టు నెమ్మొగము వె
న్నెలమట్టు నడల్చు నగవు ♦ నెత్తమ్ములకుం
దలకట్టులైన యడుగులుఁ
దలచుట్టుఁ గనుంగవయు ని ♦ తంబిని కొప్పున్. 98

క. కనుముక్కుతీరు ♦ కులుకుం
జనుముక్కులసౌరు కొలఁతఁ ♦ జనుచెక్కులు గో
త్రను దొక్కపిఱుఁదు వరుడా
విన మెక్కుడు బిరుదు చెల్లు ♦ వెలఁదికి నీడుగా. 99

99. చనుముక్కులు - చూచుకములు. కొఱఁతఁజను = లోటులేని. గోత్రను - భూమిని. (వెలఁదికి.) ఈడున్ - సమానముగ నుండుదానిని. వినము.

క. మొన్నం దలోదరులచే
విన్నందుల కిందుఁ జూడ్కి ♦ వింపుగఁ దీనిం
గన్నందులకున్ డెందము
విన్నందన ముడిపెఁ గాను ♦ విన్నందంబై. 100

క. శృంగార సరసి నీల భు
జంగఁపుటూష్పవ జనించు ♦ శైవల మధ్యా
భృంగ స్మృతి రీతి జడతో
నం గన సీమంత వీధి ♦ యలరె నయారే. 101

101 వృతి - వ్రివాహము. సీమంతవీధి - పాపిడి. (శృంగార రసమున్నలో జడయను పాము బుసకొట్టఁగా నాచుతోసికొనిపోయి తోవ్రవయేర్పడినట్టుగా పాపిడి ప్రకాశించెనని.

క. తానెంత యొగసిపడినం
గానీ దీని కుచములకుఁ ♦ గందుక మెనయే
నానాటఁ జక్రములెగ
శ్లైన సృతి వన్నెవాసి ♦ యగు జోడునకున్ 102

102. చక్రవాకములే పర్వతములైనట్లయితే చక్రధర్మమున్ను పర్వతధర్మమునుగూడ కలిగియుండుటచేత సమానములగునని.

క. దీని చను గబ్బిగుబ్బలు
లే నఖ వజ్రముల నప్ప ♦ళింపుచు నధరా
నూన సుధారస ధారలె
యానిన దేవేంద్రపదవి ♦ యది మోంతంచున్. 103

క. ఆకాంతారములో నపు
డాకాంతారత్న మోహ ♦ నాకార కళల్
భూకాంత మాళిఁ గనుటకు
నేకాంత లతావితాన ♦ గృహమున నిలచెన్. 104

క. విరి తీవల యుయ్యాలల
హారువు విడిచి సుమ చయాప ♦ హరణ విహరణా
దరణ చణ ప్రచరణలై
యరుణాంబుజ చరణ లప్పు ♦ డలరుం బొదలన్. 105

105. హారువు - విలాసము. అపహరణ - కోయుటయనెడి, ఆదరణ చణ- అదరముతోఁగూడిన.

శా. ఈవే నుంజరి మంజరిం జిదుమవే
లేమల్లికల్ మల్లికా

కోవే మాధవి మాధవిం గదియఁగో
కో పాటలిం బాటలీ
తేవే మాలిక మాలికా నుసలకే
తే కేతకుల్ కేతకీ
రావే వల్లిక వల్లికా యచట నీ
రల్లారగా నేటికిన్. 106

106. కోవె - పుచ్చుకోవే. నుసలక - ఆలస్యముచేయక, ఈరల్ - పొదలు. (ఇందు మంజరి మంజరి ఇత్యాది రెండుశబ్దములలో నొకటి చెలికత్తెలపేరు.

సీ. పాటలీ తరులకై ♦ పాటలీనఁగ నేల
పాటలీకము సుమ్ము ♦ పంకజాక్షి
వట్టి వేరున కీవు ♦ వట్టివేసులుచేయు
వట్టివేరుటము లిం ♦ పైనచెలికి
తే మావి తేనియ ♦ లే మావి యనిచాట
లేమా విచారంబు ♦ లేదె లేమ
పొన్నమా ని పు డింత ♦ పొన్నమానిని కిమ్ము
పొన్నమా నినుబోటి ♦ కన్నెలంత

గీ. పొగడకై లాతిఁ దగునటే ♦ పొగడ మగుడ
ననటి మాత్రంబునకు నట ♦ ననటి యనకు
దాడిమల కేల బాలపై ♦ దాడి మగుప
దిరిసెనము కంటె యిదివిరుల్ ♦ విరిసెననుచు. 107

107. పాటలీనఁగ నేల=పాటలబాడ నెందుకు, పాటు=ఆయాసము. అలీకము = ఇష్టముకానిది, (ఇంపైన చెలికి, రుటములు = రూఢములు. అట్టివే.) (తేనియలే, మావి, అనిచాటలేదా.) పొన్నమానినికిన్-

ఆకఁబడు స్త్రీకి. అమా-తల్లీ. అన్నెలంత-నినుబోఁటికి. పొన్న - బంగారము. (అనఁగ బంగారమువలె గౌరవించఁదగినది.) లాతిన్-అన్యుని. పొగడఁదగునపే. నటన నటి. నటన-నాట్యము జేయునట్టి. నటి-ఆటకత్తె దాడిమలకు-దానిమ్మలకు, దాడి-జగడమునకుఁబోవుట.

లయవిభాతి. మిసమిసని చన్నుఁగవ ♦ పసకువెస మార్మసలు
నసమ కళిక ల్చిదుమ ♦ నెసఁగు తరిశాఖా
విసరములు గ్రమ్మఁగర ♦ బిస నటనఁద్రోఁచి దర
హాసనములతో మలయు ♦ జ ష లహరికాస
త్కుసుమ సమితి న్మసరు♦భసలములసోఁగ జెడ
విసరి పొసఁగించి రొగిఁ ♦ బ్రసవహారణంబుల్
గిసలయ విభాతి పద♦లసనముల శోణరద
వసనములనింపెసఁగు ♦ నసదృశ కృశాంగుల్.

మ. జలజాక్షీ సురపొన్నయు న్వకుళము
న్సంపంగియుం గ్రోవివా
విలి గోఁగుం దిలకంబుఁ జంపకము మా
విం బ్రేంకణంబుం న్వీరుల్
దలపూపెన్ హాసియింపఁ దన్న మొగమె
త్తం గౌఁగిటం జేర్ప నూ
ర్పులిడం బల్క నదల్పఁ గల్గుమియఁ గే
ల్పొందించినం బాడినన్. 109

109 సురపొన్న, వకుళ, సంపఁగి మొదలగునవి, హాసియించుట, తన్నుట మొదలగు దోహదవిశేషము లిందు వర్ణితములు.

సీ. వచనోన్నతికేఁ బ్రస ♦ వము గోఁగు గనిపించె
గంకేళి నన పద ♦ గతి కొసంగె

శ్రీమదిరం జొక్కి ♦ చిల్కఁ బొగడపువ్వు
కమ్మపూల్ వాడఁ బ్రేం ♦ కణము సల్లె
వాదన స్ఫూర్తిని ♦ వచ్చె సంపఁగి విరుల్
హస్తమానఁగ నిచ్చె ♦ నలరు మావి
పుష్పము ల్దర్శనం ♦ బున కీనెఁ దిలకంబు
నవ్వించఁ జూపె సూ ♦ నములఁ బొన్న
గీ. కొఱవి కుసుమంబు లాశ్లేష ♦ గరిమ కిడెను
వావిలి సుమంబు లిడియె నా ♦ శ్వాసమునకు
నల వసంతంబు మించిన ♦ ఫలము లిడఁగ
గడఁగు టబ్రంబె వితరణ ♦ ఘన తరులకు. 110

110 అలవసంతంబుమించినన్-వసంత ఋతువుఅతిశయించఁగా వచన...గనిపించె. మాటాడుటచేత గోగుచెట్టుపూసెను. ఇది గోగునకు దోహదము. ఈప్రకారమంతటనూహించవలెను. కంకేళి-అశోకము. పదగతికిన్ - పాదపుతాఁకునకు. శ్రీమదిరన్-శోభగల మద్యముచేత. పాడన్ - గానముచేయఁగా. వాదన - హస్తవాద్యముయొక్క. దర్శనంబునన్ - చూపుచేత. కొరవి - గోరంటచెట్టు, ఆశ్లేష - ఆలింగనముయొక్క. అశ్వాసము - నిట్టూర్పు, వితరణఘన తరులన్ - (వితరణ ఘన - దాతృత్వముచేత గొప్పవియగు. తరులకున్ - చెట్లకు.) ఈ పద్యమందు విద్యావంతుల విద్యలవల్లఁ బ్రభువులు బహుమతులిచ్చిరని యర్థాంతరము. ఎట్లనిన, వచనోక్తికిన్ - వాక్యగౌరవమునకు. పదగతికిన్ - శబ్దరీతికి. శ్రీమదిరన్ - శ్రీమత్ - శోభగల. ఇరన్ - వాక్యముచేత పాడన్ - గానముచేయఁగా. వాదన - మృదంగాది వాద్యములయొక్క. హస్తమానఁగన్ - తాళముచేయఁగా. దర్శనంబు - శాస్త్రము. నవ్వించన్ - విద్యచేనానందింపఁజేయఁగా. ఆశ్లేష - అట్టిశ్లేషయొక్క. ఆశ్వాసము - గ్రంథముయొక్కఅంశము. వితరణ ఘనతరులకున్ - దాతృత్వముచేత మిక్కిలిగొప్పవారైనవారికి. ఫలములిడఁగఁ గడఁగుట - కోర్కెలియ్య నుద్యోగించుట.

ఉ. కేవల పుష్పభారమున
కే తలవంచుట తత్ఫలాళి సం
సేవకు దూరమైతి నను
చింతలనో యిఁక నీళ్ళుపోసెదం
దావక పల్లవాప్తి రతి
నాలుగు కాయలు గాచినన్ రస
జ్ఞావలి మెచ్చు నూరువగ
లంది చలించుట రంభ మానవే. 111

111, రంభ = ఓఅరటిచెట్టా. పుష్పభారమునకే = పువ్వుబరువునకే. తత్ఫ... సేవకు = దానిపండ్లు దినువారిని బొందుటకు. తావక...రతిన్ = (తావక=నీసంబంధమైన. పల్లవ = చిగురుయొక్క ఆప్తి= పొందుటయందు. రతిన్ = ఆసక్తిచేత.) కాయలు = పండ్లు. రసజ్ఞావళి = నాలుకలగుంపు. ఊరువగలు = తొడలయొక్క విలాసములు. ఈపద్యమందు మఱియొక యర్థము దోచుచున్నది. రంభయను పేరుగల యోచిన్నదానా, కేవలపుష్పభారమునకే=రజస్వలయైనందుకే. తత్ఫ.. సేవకున్ = రజస్వలయైనందుకు ఫలమనుభవించువారిని బొందుటకు. దూరమైతినను చింతలనో = లేనిదాననైతినను విచారముచేతఁగాఁబోలు. నీళ్ళుపోసెదన్, స్నానముజేయించెదను, తావక...రతిన్= (తావకపల్లవ = నీ విటకానియొక్క. ఆప్తి = కలుసుకొనుట చేతనైన. రతిన్ = సంభోగముచేత.) నాలుగుకాయలుగాచినన్=నలుగురుబిడ్డలు గల్గినయెడల, రసజ్ఞావళి = రసికులపఙ్క్తి. నూరువగలు=వంద విచారములు. చలించుట = వణఁకుట.

క. కౌరవులె కౌరవులు కేసర
తరువులె తరువులు సమీర ♦ తరుణాదరముల్
దరముల్ కల జాగరములు
గరములు మనవంటి విరహ ♦ కాంతల కబలా. 112

112. కోరవులె = గోరంటుచెట్లే. కోరవులు = కొరకంచులు, తరువులు = మావర్దబడులు తీసినసొమ్ము తెమ్మని నిర్బంధించువారు. సమీర తరుణ=చిన్నగాలియందు,అదరములు = అసుర్తులు. దరములు =. భయములు. (అనఁగా భయంకరములు.) గరములు = విషములు.

చ. ఇగురుల జొంపముల్ కొరవు
లెచ్చిన క్రొంబొగ తండము ల్పయి
న్నెగయు మిళింద బృందములు
నిండిన పుష్పొడి తేనె జల్లు దు
మ్ముగమియుఁ బోఁత నీరుఁ బిక
ము ల్దెగ బిట్టుగఁ ద్రోఁచువారుగా
జిగిఁ దళుకొత్తెఁ జైత్రుఁ డిదు
చిచ్చుసుమీ యలమావి నెచ్చెలీ. 113

113. తెగబిట్టుగన్ = కష్టమతిశయించునట్లుగా. ద్రోఁచువారుగాన్ = అగ్నినెగఁదోయువారు అగునట్లుగా.

క. కదలి కనుగొంటివా యా
కదలిమరందంబు ముదిత ♦ క దలి నయో ! జోఁ
క దలిర్పఁ దేఁటి పాటల
కదలిక యుఁకఁ జేరి వినవె ♦ కద లికుచ కుచా. 114

114. కదలి = వెల్లి. ఈ కదలి = ఈఅరటియొక్క. ముదిత= సంతోషింపఁజేయఁబడిన. కత్, నిద్యములైన. అలిన్ = తుమ్మెదలు గల. అయో=అక్కటా, జోఁకదలిర్పన్=సొగసొప్పునట్లుగా. కదలిక= చురకుదనము. వినవెకద = వినుచున్నావుకదా, లికుచకుచా = గజనిమ్మపండ్లవంటి స్తనములుగల చిన్నదానా.

వ. అని మఱియు గట్టువాకట్టు చనుకట్టు గట్టివా మిటారులు కలిగొట్టు చెట్టు చుట్టు బిట్టురువడిం దిరుగు రోలంబ కుటుంబ పాళి వనీవనిత తిరుపుగట్టం గనుపట్టు

కాసైనీలిమ యంచు నెంచుచు, మాటిమాటికిఁ గొరవి విరి
గుత్తిపై వ్రాలి యొగయు భసల పఙ్క్తిఁ గొమ్మ పుష్ప
మంజరులు గ్రాయు ముసలంబని గుసగుసలాడుచుఁ దపసి
చిగురాకు నకుం బ్రదక్షిణంబులు సేయు భ్రమరాళికిఁ
దత్సరోజ బీజాక్షమాలికయని పోలికల సందుకొనుచు,
నందంద లతాకుంద బృందంబులకు దూరంబారు నిందిందిరావళి యిందిరానందనుం డిందీవర గంధులపై వైచు
వాటఁబల్లెంబని చాటుచు, సకల వకుల ముకులంబు
లపై వ్రాలు బంభర డింభక వీథి యంభోజబాణుండు
వియోగినీ కుచకుంభంబులు దాకనేయ సాయకంబులం
దగిలిన యందలి కస్తూరిబొట్టులని ప్రస్తుతింపుచుఁ, బొదలు
గదలి యొగసి నడుము నెడ తెగని బాయదీగిన మగ తేఁటి
దాటు నామనిదొర చెలికాని రాకకుఁ గట్టిన కలువతో
రణంబని పేరుకొనుచుఁ, దదీయ దళంబున వ్రాలు షట్చ
రణరాజి రంభ వెన్నంటి రాజిలు కీలుజడయంచు నొడంబ
డుచు, జుమ్ముజుమ్మన నేరేడు తండమ్ములఁ గ్రమ్ము తుమ్మె
దచాలు కాల జాంబవ నికాయంబులని కోయని డాయుచు,
నర విరి బాగునం గనుపట్టు మొట్ట తమ్మిరేకు తుదలం
దట్టమ్ముగాఁ జుట్టుకొన్న పుష్పంధయ శ్రేణి యారామ
రమాకరంబునకుఁ దోడుగ బల్మినిం బట్టిన నీలంపు గాజ
నుచు, గజిబిజింపుచు, నమిత కుసుమిత లతావితాన కుంజ
పుంజోపరి తిర్యక్పరీత చంచరీక రేఖ యనేకపంబునకు
వెలిపట్టుజాలు బిగియించిన వెంట్రుక త్రాఁడని కొనియా
డుచు, మరుం బొడుచుఁ, గురువిందమ్ముల యందములను

మోదించుచు, నరవింద బృందంబులను సోలించుచు, మొల్లలకు నరుగుచు, మల్లెలకుం దిరుగుచు, విరవాదులం జిదుముచు, గన్నెఱ్ఱఁ జేయుచు, గన్నేరులు గోయుచుఁ, గురువకంబుల డాయుచు, మరువకంబుల మూయుచు, సన్నజాజులం దేరుచుఁ, గన్నెమావుల నిలుచుచుఁ, దిన్నెరావులం గొలుచుచును, మదను మావులం బట్టుచు, నదను తావులమెట్టుచుఁ, బరువులు వెట్టుచుఁ, దరువులు సుట్టుచు, మధుపతతిం, దెచ్చుచు, మధుగతి న్మెచ్చుచుఁ, జిగురులు ద్రుంపుచుఁ, బాగరులు దెంపుచుఁ, బువ్వుల రువ్వుచుఁ, గ్రొవ్వుల నవ్వుచు, వికవిక నగుచు, నకనక నగుచుఁ, దలతల మనుచుఁ, గొలకొల మనుచు, మరుల జరింపుచు, విరుల హరింపుచు, విహరించిరి ముక్తానవసరంబులు గునియ నయ్యవసరంబున. 115

115. గట్టువాకట్టు = పర్వతముల నోరఁగట్టునట్టి, చనుకట్టు = స్తనములుగల. గట్టివాకిటూరులు = రాగలైనస్త్రీలు. ఇది మొదలుగా కొనియాడుచు అను పర్యంతమును తుమ్మెదలయొక్క వర్ణనము. రోలంబ=తుమ్మెదలయొక్క. కుటుంబ = జాతులయొక్క. పాళి = పఙ్క్తి. తిరుపుగట్లన్ - తిరుగగా, కాసెనీలిమ - కాసెకోకయొక్క నలుపు, భసలపఙ్క్తిన్ - తుమ్మెదల బారును. పువ్వుమంజరులు - ఈ పేరుగల ధాన్యమును, పువ్వులగుత్తుల ననియును. క్రియముసలంబు- దంపునట్టి రోకలి, తపసి - అవిసెచెట్టు, తపశ్శాలియనియును. సందుకొనుచున్ = గ్రహించుచు. ఇందిందిరావళి - తుమ్మెదలపఙ్క్తి. ఇందిరానందనుండు - మన్మధుఁడు. వాటుబల్లెంబు - దెబ్బవగులుబల్లెము. బంభరడింభక - తుమ్మెద పిల్లల యొక్క. దాటు — సమూహము. ఆమనిదొర = వసంతుఁడు. చెలికానిరాకకున్ = మన్మధుని రావడమునకు. తదీయ = ఆ యరటిచెట్టు సంబంధమైన. వట్టు

రణరాజి = తుమ్మెదలపఙ్క్తి. రంభ=అనటిచెట్టు, ఆపేరుగల స్త్రీయని యును, కాల = నల్లనయిన. జాంబవ = నేరేడుపళ్ళయొక్క. అరవిరి = సగము వికాసముయొక్క. పుష్పంధయ = తుమ్మెదలయొక్క. గజిబిజింపుచున్ = కలతపడుచు, తిర్యక్ప్రరీత = అడ్డముగావ్యాపించిన, చంచరీక = తుమ్మెదలయొక్క. రేఖ = వరుస. అనేకపంబునకున్ = ఏనుఁగునకు. సోలించుచు = మూర్ఛనొందంజేయుచు (అనగాకోయుచు మరువకంబులన్ = మరువములచేత. మాయుచున్ = ధూసరవర్ణము గలవారౌచు, తిన్నెరావులన్ = అరుగులు వేసిన రావిచెట్లను, మదను మావులన్ = చిలుకలను. అదనుతావులు = సమయానుకూలస్థలములు పొగరులు దెంపుచు = ఒకరిగర్వ మొకరు అణచుచు. నకనకనవ్వుచు = అలసినవారౌచు. మనుచున్ = వృద్ధియగుచు, మరులన్ = కామముచేత. ముక్తా = ముత్తెములయొక్క. నవ = నూతనములగు. సరంబులు = హారములు. గునియన్ = కదలుచుండఁగా.

సీ. పూవుఁ గొమ్మలు వంప ♦ బోనేటికే యన్నఁ
జేమించెదే యభి ♦ రామబాహ
చిగురుట కేటికే ♦ చిదిమెదన్నను గయ్యా
ళునకుఁ గాల్దివ్వెదే ♦ మోహనాంగి
పసరు మొగ్గలు గోయఁ ♦ బాడియే యనఁ బంటఁ
బగఁ బూన నేటికే ♦ భవ్యరదన
మల్లికా వల్లికల్ ♦ గిల్లఁ జెల్లదటన్న
నొళ్ళేల విరిచేద ♦ యుజ్వలాంగి
గీ. సంపెఁగలు మూర్కొనఁ జనదు చా ♦ లింపు మనినఁ
బదరి ముక్కునఁ గోపముం ♦ చెదు సునాస
యనుచు నొండొరు సరోస్తు ♦ లాడు కొనుచుఁ
బ్రసవ హరణంబు మాని సం♦భ్రమముఁ బూని. 116

116. ఈపద్యమందు ఆరుచరణముల పర్యంతము సరోక్తులు ఎట్లంటే = పూవుగొమ్మనేల వంచినావని యొక చెలికత్తె అడుగగా

అభిరామబాహ అని సంబోధన చేత మనోహరములయిన చేతులుకల దానవు గనుక. (చేమించెదే = దెబ్బలాటకు వచ్చెదవా అనియును) నేనువంచునట్టి పూవుగొమ్మను హస్తసౌందర్యముచే నతిక్రమించెద వని యును తాత్పర్యము. కడవటికు నీరీతినే సంబోధనలకును, జవాబుల కును, సార్థక్యము నూహించవలెను. చిగురుటాకునకును కాలికిని సామ్యము. అది మోహనాంగి పసరుమొగ్గలకును, దంతములకును సామ్యము. అది భవ్యరదన = మంచిదంతములు గలది. మల్లితీగలకును, ఒళ్ళు = దేహమునకును సామ్యము. ఉజ్వలాంగి = ప్రకాశించుచున్న దేహముగలది. సంపెంగలకును ముక్కునకు సామ్యము. అది సువాస = మంచి ముక్కుగలది.

క. నాళీక మధూళీ సుమ
పాళీ కమనీయ కిసల ♦ ఫల పటల నట
న్నాళీక మరాళీ భ్రమ
రాళీక మహా సరోవి ♦ హారాదరలై. 117

117. భ్రమర = తుమ్మెదలయొక్క. అళీక = పఙ్క్తిగల.

సీ. ఆ సారసేక్షణల్ ♦ కాసార తటిఁ జేరి
మై సొగమణు లంత ♦ మరక తిగిచి
సవరగా సవరించు ♦ సవరముల్ వదలించి
కలికి బాగొలయఁ గీ ♦ లంగ్లు వైచి
తల తల తలమంచుఁ ♦ దల మించు వలి మంచు
వాలించు వలిప పా ♦ వడలు గట్టి
యలగుండు బులుగుండు ♦ బలు పాండు రాబ్జంబు
పజ్జ ప్రవాల్ సతిమేలు ♦ బంతి యనుచుఁ
గీ. గొలను నడుచక్కి కొప్పుల ♦ కుప్పలుప్ప
రముగఁ గుప్పించి రుచివీధి ♦ రాయ గుభగు

భద్వనులలేచు నరసి కాం ♦ భ్రుకణములు
స్వకచ వికచప్రసవ శంక ♦ సంఘటింప. 118

118. కాసారకటిన్ = సరస్త్రీరమును. మై = శరీరమందలి సారమణులు = మంచిరత్నములను, వాలించు = అతిక్రమించునట్టి. గుండుబుఁగు = చక్రవాకము. ఒప్పులకుప్పలు = సౌందర్యవతులనుటం. ఉరుకుటచేత చెదరిననీరు వీరికొప్పులలోని పువ్వులు తూలుచున్నట్లున్నవి.

స్రగ్ధర.

అంతం గాంతల్ లతాంతా ♦ హరణ విహరణా
న్యోన్య సంచార జాత
శ్రాంతుల్ జారంగఁ దన్నీ ♦ రజ రజములపై
ప్రాలుచుం దేలుచుం జ
న్నంతుల్ కాంతుల్ రథాంగీ ♦ పటలి కెరవిడం
బొడ్డువై యీదులాడన్
స్వాంతానంతాను రక్తిన్ ♦ సలిపిరి సరవిన్
సార కాసార సీమన్. 119

119. లతాంత = పువ్వులయొక్క. రథాంగీపటలికిన్ = స్త్రీచక్రవాకసమూహమునకు. ఎరవిడన్ = ఎరువుగానియ్యగా.

ఉ. గట్టుల గట్టు గట్టి చను
కట్టు జిగిం గనుపట్టు గట్టివా
గట్టున కేగి యొార్తు తలఁ
గట్టుక రింగున ప్రాలి లోతు గ
న్పట్ట మునింగి తేలి తన
పాణి నస ల్గొని చూపె దీనిలోఁ

బుట్టిన తమ్మి యింటికయి
పోలు నకే యని చూపు కైనడిన్. 120

120. ఈపద్యము ప్రథమచరణమునకు అర్థము 116 లో మొదటియర్థమువల్లఁదెలియును. అసల్ = బురదను. దీనిలోన్ = ఈ బురదలో. ఇంటికయిపోలునకే = నాకిల్లు గావడమున కనుకూలించునా. (అనఁగా నేను పద్మగృహముగల లక్ష్మివలె నుంటినాఅని తాత్పర్యము)

క. జగరాఁగ యొకతె దిట్టుచు
మగునా ! నాసరికి నీవు ♦ మా, యన నదియున్
మొగ మెగఁ జేయుట కెలయుట
తగినదిగద యీత నీళ్ళఁ ♦ దగు సతి కనియెన్. 121

121. జగరాఁగ = ప్రసిద్ధమైన గడుసుతనముగలది. కెలయుట = విజృంభించుట. ఈతనీళ్లన = ఈదునట్టిజలములయందనియు, ఈతచెట్లయొక్క నీళ్ళచేత (అనఁగా మద్యముచేత) ననియును, మొగ మెత్తుటయు, విజృంభించుటయు రెండిఁటియందునుగలవనుట.

రగడ.

అప్పుడు కొంద అరుణ నంద
నాబ్జబృందములను ద్రుంచి
నిపుణ చాటు ఫణితి నీటు
నిగుడ ద్రోఁటు లాడ నెంచి
జలజ నాళముల విశాల
సరస లీలఁ గొట్టులాడి
కలువ దమ్మి తరుచు గమ్మి
గమ్మి చిమ్ములాటఁ గూడి

వొడలు సన్నజాజి పొన్న
వొఱపుఁ గన్న సరసి నించి
యడరుచుండు బిసముఁ జెండు
నంచ పిండు నొడబడి పొంచి
మొడలఁ బ్రాఁచి మొడలఁ ద్రోఁచి
మొగయు పీచికలను దేలి
కడ తరంగములఁ బొసంగఁ
గదలు చెంగలువల వ్రాలి
చలువ బావి తోవల తావి
జంటమూవి కాత్మఁ జెలఁగి
కులుకు గుండుఁ బులుఁగు దండు
గుబ్బు నిండుటలకుఁ గలఁగి
త్రేట మీటు గన్నజూటు
తేఁటి దాటు పాట మెచ్చి
గాటమైన హంసయాన
కలన పూన డెంద మిచ్చి
గాలి గొట్టి పొరలి నట్టి
కరడుఁ దట్టి యుట్టిపేల
నాలి పాలి హాలిఁ దేలి
యంబు కేళి సల్పువేళ
గుబ్బ బంటి నీట నొంటి
కూలమంటి దుమికె నొకతె
దబ్బరాడి జనములోడి

తరుణిఁగూడి గదిమె నొకతె
తగిలి పట్టు మనుచుఁ దిట్టు
తన్విఁ జుట్టు పెట్టె నొకతె
మగుడి పెట్టు కాని యొట్టు
మాన్పనట్టు గొట్టె నొకతె
యీత నీటిలోనఁజాటి
యిసుము పాటి కెత్తె నొకతె
లోతు గానఁబోయి సేన
లొగి నాన యెత్తె నొకతె
యోల యెన్ను కన్న యన్ను
నొరసి వెన్నుఁ దన్నె నొకతె
సోలి చిక్కువడక నిక్కు
చుట్లఁ జిక్కు వన్నె నొకతె
వెలఁదు లెల్ల నీదు లెల్ల
వెడల నొల్ల దామె నొకతె
పొలది ప్రల్లదములఁ జల్ల
బోరగిల్ల మోదె నొకతె
జాతిఁ బెట్టి యీదు నట్టి
సకియఁ గొట్టి డాగె నొకతె
నాతి దెంచు నెకుల మించు
నాచటంచు లాగె నొకతె
కలిగెఁ దామర యని రామ
కరము ప్రేమ గిల్లె నొకతె

కలికి బేడస యని ప్రోడ
కన్ను జూడ మల్లె నొకతె
గురు రథాంగ మని లతాంగ
కుచము జంగ చరచె నొకతె
తరుణిఁ బొంచి శిరమునంచి
దరిని ముంచి పరచె నొకతె
కనలి కొమ్మఁ గొని కరమ్మ
కలికిరొమ్మ జాచె నొకతె
మొనసి గాత్రమైన నేత్ర
మున సునేత్ర వైచె నొకతె
కొదమ తమ్మికంటిఁ గమ్మ
క్రోవెఁ జిమ్మ నవ్వె నొకతె
ముదిత హత్తి కడకునెత్తి
మొల్లగుత్తి రువ్వె నొకతె 122

122. గమ్మచిమ్మలాట = గమ్మచును నట్టుగా నీళ్ళుఁజల్లుకొనుట. బిసముఁజెండు = తూఁడుఁగొలుసుచున్న. ఎడలన్ = ఆయాస్థలములయందు. పాచి = సాచు. కడ = దగ్గర. జంట - సమీపము. గుబ్బ = గుండెలు గొట్టుకొనుట. మీటు = పెంపు. జూటు = మోసముగల. గాటమైన అతిశయించిన కరడున్ = తరంగమును. తట్టి - తాకి, ఆలిపాలి - చెలికత్తెలపఙ్క్తి. హాళిన్ = విహారమును. గదిమెన్ - బూకరించెను. తిట్టు - ఒట్టుఁబెట్టునట్టి. తుట్టుఁబెట్టెన్ = నష్టము కలుగఁజేసెను. కాని యొట్టు = అయోగ్యమైన యొట్టు. నట్టుగొట్టెన్ = అడ్డుకొనెను. సాటికిన్ - దృష్టాంతమునకు. నేన - విస్తారముగా. లోఁగి = అలసి. ఓలయొన్న = ఓలయని పలుకుచున్న. కన్నయన్నన్ = చూచినస్త్రీని. ఒరసి = దగ్గరయై. చుట్లన్ = తిరగడములచేత. ఎల్ల = హద్దు. వెడలనొల్లనాయెన్ = దాటలేకపోయెను

పొలది - అల్లది, ప్రల్లదములఁజల్లన్ = కారుమాటలాడఁగా. జాతి = ప్రతిజ్ఞ. (అని తోఁచుచున్నది.) (శేక ఒట్టు అని.) తెంచు = కొప్పు విడిసట్ట్రి, నెరులన్ = వెండ్రుకలను. తామరగలిగెన్ = పద్మము దొరకెను. బేడస - మత్స్యవిశేషము. రథాంగమని - చక్రవాకమని. లతాంగి = స్త్రీయొక్క. జంగచరచెన్ = దాటిపట్టుకొనెను. నాతిదెంచుఅను చరణము మొదలు గురురథాంగఅను చరణమువఱకు భ్రాంతులు. కొమ్ము = చిమ్మనగొట్టము. తాచెన్ = కొట్టెను గాత్రమైన = శరీరసంద్రైన. నేత్రమునన్ = వస్త్రముచేత. వైచెన్ = కొట్టెను. క్రోవిఁజిమ్మి = చిమ్మనగ్రోవి విసరి. (అనఁగా నీరు చిమ్మనగ్రోవితోఁజల్లి.) హత్తి - పట్టుకొని.

క. ఈలీలఁ జేలి విహృతులు
సాలించి నృపాల తనయ ♦ సహాయావళియై
కేలీ సరస్తటమునకు
వ్రాలి లతాతన్వి యొకతె ♦ వడిఁ దశియొత్తె. 123

123. సహాయావళియై = స్త్రీసమూహముతోఁగూడినదై.

చ. పనుపడిఁ బూను సారె తెలి
పావడపై నెరి పట్టుకుంచెఁ గ
ట్టిన యపరంజి పువ్వులు ఘ
టించెడు చందురుకావిఁ గట్టి పే
ర్చిన యరజారు కొప్పున ధ
రించి విరుల్ మృగనాభినాభియై
తనరఁగఁ దీర్చి కుంకుమ క
దంబము పూసె విలాస రాశియై. 124

123. పనుపడన్ = అనుకూలముగా. పావడ = గాగరా. కుంచె = కుచ్చెళ్ళు. మృగనాభి = కస్తూరిచేత. నాభి = బొడ్డుగలది. కదంబము = పరిమళవస్తువులన్నియు గలిపిన ముద్ద.

సీ. పరువంపు విరవాది ♦ విరులరంగాన రాఁ
దురిమిన నెరజాఱు ♦ తురుము దసర
గ్రొమ్మించు నిర్మించు ♦ కమ్మపంజుల తళ్కు
లుదిరి చెక్కులతోడఁ ♦ జమురు లాడ
నిగరంపుఁ జనుకట్టు ♦ నగరంపు రవికె మేల్
సరిగ కుట్టుల మెట్టు ♦ సడల నిక్క
బిళ్ళల మొలనూలు ♦ బిగిడాలు పైపెడల్
తొడల నిగ్గు నొకింత ♦ త్రోడుఁ బిలుప
గీ. విలువ యిడరాని చెంగావి ♦ చెలువు నెఱికె
నాభి విభవంబు పొన్నక్రొ ♦ న్ననలు నించఁ
జంచలాపాంగ చెంగట ♦ నుంచు మించు
టద్ద మించుక వీక్షించు ♦ నవసరమున. 125

125. తురిమిన = ముడిచిన, తురుము = కొప్పు. ఉదిరిచెక్కులు. చదురులు = విలాసములు. (అనగా పరిహాసములు) నిగరంపు = మెరుగైన. నగరంపు రవికె. నాగరికత గల రవిక. సరిగ = జలతారు యొక్క. కుట్టులమెట్టు = కుట్టుబడితలు. సడలన్ = విడిపోవునట్లుగా. డాలు = కాంతియొక్క. పైపెడల్ = పైపార్శ్వములు. నెఱికన్ = కుచ్ఛెళ్ళయందు.

సీ. బవిరి సొంపుల చొప ♦ పని కప్పునిడి యొంట్ల
కడినీలములకప్పు ♦ గప్పుగప్పు
నొరయు కుళ్ళాయి పొఁ ♦ విరుల చెక్కుల చక
చ్చకలతో వన్నె వా ♦ సికిఁ బెసంగ
నరచట్టమయి కుంకు ♦ మాంబువు నడికట్టు
చెంగావిమై జిగి ♦ జికిలిచేయ

నడుగు కెంజిగురు సో ♦ యగ నింద్రగోపంబు
పాపోసులకుఁ జాయ ♦ పసలు జూపఁ
గీ. జంద్రికాహాస లఖిలపు ♦ ష్పములఁ జిదుమ
విన్న నైయున్న తోఁటకు ♦ వింత నన లో
సంగ సాక్షాత్కరించు వ ♦ సంతుఁడనఁగ
ధరణికాంతుఁడు పొడచూపెఁ ♦ దరుణి యెదుట 126

126. బవిరసాంపుల = గుంద్రనిసొగసుగల. చెంప పనికిన్ = గండస్థలముల దిద్దుటకు. అప్పున్ = బదులును. ఒంట్ల = పోగుల యొక్క. కప్పు = నలుపు. కప్పుగుప్ప = కప్పునవ్యాపించగా. పొన్ విరులు = బంగారుపువ్వులు. అరచట్టమై = వస్త్రవిశేషమై. కుంకు ...గావి = కుంకుమ నీ రానిన నడుము కట్టుబట్టయొక్క యెఱుపు, మైజిగిన్—శరీరచ్ఛాయను. ఇంద్రగోపఁబు. పాపోసులకున్ = అర్ధ్రపురుగు రంగుగల పైజార్లకు, చంద్రికాహాసలు = స్త్రీలు.

గీ. అప్పు డారాజువాహన ♦ క్ష్మాధిపుఁడు ప్ర
పంచ నాళీక గుణ గణై ♦ కాంచ నార్ఘ్యఁ
గాంచ నాళీకతనుమనో ♦ వంచనార్థ
పంచనాళీకుఁ గాంచె నా ♦ కాంచనాంగి 127

127 ప్రపంచము = జగత్తునందలి. (అళీక = అప్రియము.) నాళీక = ఇష్టములైన. గుణగణ = గుణసమూహములచేత. ఏకాంచన = ముఖ్యమైన పూజతోడ. అర్ఘ్యన్ = కూడుకొనిన కాంచనా... నాళీకున్ ) = కాంచన = బంగారము. ఆళీక = స్నేహితురాలుగా గల. తను=శరీరముగల స్త్రీలయొక్క, మనోవంచనార్థ=మనస్సుయొక్క మోసముచేయుటకొఱకైన. పంచనాళీక = మన్మథుఁడైన. రాజవాహనునికి విశేషణములు.

క. చూచినఁ జెలి లికుచ త్కుచ
చూచుకముల్ మేర మీఱుఁ ♦ జూచెం గన్నుల్

ద్రోచి ముఖమూక్రమించఁగఁ
జూచెం దనయంప వొనలఁ ♦ జూచె మరుండున్. 128

128. లికుచతత్=గజనిమ్మపండ్లయి అచరించుచున్న. మేరమీర
జూచెన్=హద్దుదాటి సారంభించినవి (స్తనములుబ్బినవి నేత్రములు విక
సించినవి. మన్మథుఁడుకొట్టనారంభించెనని తాత్పర్యము.

చ. చెలి యటఁ జూచిలేచి తన
చేడియపై నొరఁగెం జలద్భృగం
చలకులు గ్రమ్మ పంజు నుదు
సానలఁ దీరఁ బదాంబువన్నెగం
టల మొలనూలు జారఁ జర
ణమ్ముల ఆంపున గిల్కుమట్టియల్
ఘుళు ఘుళు ఘుళ్ళనన్నృప శి
ఖామణి యుల్లము ఝల్లు ఝల్లనన్. 129

129. పంజునును సానలన్=పంజులకమ్మల నెడు నున్ననిసానల
యందు. చరణమ్ముల అంపునన్=పాదముల కలకలముచేత.

సీ. కలికి చెక్కుల డాలు ♦ కమ్మ పంజుల మేలు
తళుకుల కసరంజి ♦ బెళుకు గులుక
ముదురువెన్నెల క్రొవ్వఁ ♦ జిరుము క్రొంజిగి నవ్వు
దంతకాంతికి మొల్ల ♦ తావి గట్టఁ
పసిఁడి పంజెల కెగ్గుఁ ♦ బరపు చన్గవ నిగ్గు
పటు కతురుచిఁ తోడ ♦ బంతులాడ
నందంపు మైచాయ ♦ సందిదండల చాయ
నుదిరి సంపఁగి మొగ్గ ♦ యొప్పుగుప్పఁ

గీ. గప్పు నెరిఁగిప్పు కొప్పు న ♦ గ్గలఁపు సొలపు
నిలుపు చూపుచు వలపుల ♦ పొలపుఁ దెలుప
నృపు తలఁపు రేపె నపుడుమా ♦ ధుప దపాంగ
సాన మొనదేరిన యనంగ ♦ శర మనంగ. 130

130. పుటెలు=కుండలు. కక్ష=చంకయొక్క. రుచితోడన్=కాంతితోడ, సందిదండలు = బాజుబందులు. మధూపత్ = తుమ్మెద సమూహమైయాచరించు మన్న. అపాంగ = కోఁగంటి చూపుగలయాచిన్నది.

కం. అబ్బిత్తఱికిం గన్నుల
పబ్బమ్ముగఁ జూచు నపుడు ♦ ప్రమదంబునఁ బె
ల్లుబ్బెడు గబ్బి మెఱుఁగు చన్
గుబ్బలచే రవికె నుగ్గు ♦ నూచములయ్యెన్. 131

131. కన్నుల పబ్బమ్ముగన్=కనుపండువగా. నుగ్గునూచములు=ముక్కముక్కలు.

వ. ఈవైఖరి నారాజశేఖరు నఖిలలేఖాలభ్య రేఖావిలాస
రేఖామయూఖావళికిం జొక్కి యక్కంజముఖీ శిఖా
మణి సఖీగ్రామణితో నిట్లనియె. 132

132. అఖిలలేఖ - సమస్తదేవతలకు. అలభ్య - పొందశక్యము గాని లేఖా - సౌందర్యముయొక్కయు, విలాస - విలాసములయొక్కయు. రేఖా - పఙ్క్తితోఁగూడిన. మయూఖ - కిరణములయొక్క (అనఁగాఁ గాంతియొక్క.) సఖీగ్రామణి - చెలికత్తెలలో శ్రేష్ఠురాలు.

ఉ. కంటివె కల్వకంటి మన
కంటికి వేలుపుగట్టు చంటిపా
లింటికిఁ బంట వింటిదొర
గ్రాలిఁ గ్రాఁచినమేటిబోఁటి యా

పటవలంతి తేఁడు మణి
వంటి చొకారపు వీని మోవిపై
గంటి యొకింత సేయు కల
కంఠి యకుంఠిత భాగ్య మెట్టిదో. 133

133. వేలుపుగట్టుచంటిపాలింటికిన్ - మేరువువంటిచనుములు గల స్త్రీలపాలిటికి. ఈ రాజు మనకంటికిని స్త్రీలపాలిటికిని మన్మథుని విలాసములను మించియున్న వాఁడనుట.

క. చక్కని రాకొమరులలోఁ
జక్కనివాఁ డజర జగపు ♦ జగజోటులకుం
దక్కని దొర ధర సతులకుఁ
జిక్కని రాజన్యపాల ♦ శేఖరుఁడు చెలీ. 134

134. అజర జగపు = స్వర్గసంబంధమైన. జగజోటులకున్= జగత్ప్రసిద్ధులైన స్త్రీలకు.

క. నరులను గనమో సురకి
న్నరులన్ వినమో ముకుంద ♦ నందన పౌరం
దరులంగనుఁగొనమో యీ
ధరణీ ధర తరణిఁబోగడఁ ♦ దరమే తరుణీ. 135

135. ముకుం...దరులన్ = మన్మథ జయంతులను. ధరణీధర తరణి = రాజ సూర్యుఁడు.

సీ. శ్రీకారములు తావ ♦ కాకారములఁ జెందె
నని వీనులకుఁ దెల్ప ♦ నరిగె ననఁగ
ఫాలంబుఁగని చిక్కె ♦ బాలేందుఁడని తమః
కములంబు లిరువంక ♦ గదిమె ననఁగఁ
బలుకుఁ దేనియఁ గూర్చు ♦ పలుమొగ్గ తావికై
బరతెంచు తేఁటేటి ♦ బారనంగఁ

గాండ యుక్తాబ్జ భ్ర ♦ కాండ దళచ్యుతా
గ్రసిత స్ఫుటమౌక్తి ♦ కం బనంగ
గీ. నాయత విలోచనంబులు ♦ నత్యుదంచ
దలక వదనము మీనపు ♦ మొలకచాలు
ఖరయుగళపాణి శాఖా న ♦ ఖంబు లడర
నీతనికి నొప్పుఁ గదె యఖం ♦ డేందువదన. 136

136. ఈ పద్యమందు సీసచరణములలోని యుపమేయ వస్తువులకుఁ గ్రమముగా నన్వయము.

వ. మఱియును. 137

క. తరుణి దొరఁజూచె దొరయుం
దరుణీమణిఁజూచె మధుర ధర్మ ధరుంధున్
ధరణి పురందరు నురమున్
గురు కుచ కుచభరము శరము ♦ గుఱిగాఁజూచెన్. 138

138. మధురధర్మధరుఁడు = తీయనివింటినిదాల్చిన మన్మథుఁడు.

సీ. రాజుపైఁ గొఱగాని ♦ రహిఁజూచి తనవాలు
మొక్క పరచు నగు ♦ మోముఁ దలఁచి
శూరుఁడన్నఁ జలించు ♦ తీరెంచి తనతూపుఁ
జులకఁజేసిన వాడి ♦ చూపుఁ దలఁచి
కాంచనాహృతి పాత ♦ కంబెన్ని తన యల్లిఁ
జెఱకుఁ గూర్చిన సోగ ♦ నెఱులు దలఁచి
పలు మొనఁబేరెత్తు ♦ పసఁగాంచి తన పిల్లు
దునియ నాడిన బొమ ♦ దోయిఁ దలఁచి
గీ. వలచినట్టి యొయారి జ ♦ వ్వనిని గలఁచి
యలఁచి యల చిత్తసంభవుఁ ♦ డనెడు బోయ

సూన నారాచములం దొంటి ♦ సూదుఁ ద్రిప్పెఁ
బగ మరల్పని వాఁడొక ♦ బాఁటె జగతి 139

139. ఇక్కడ రాజుయొక్క అవయవములు మన్మథుని యాయుధములందు దోషము లెన్నినట్లు చెప్పినాఁడు. తనవాలు - పద్మము. రాజుపైన్ చంద్రునిపైనియనియు ; సధికారిపైనవియును. తన తూఁపు - కలువ. శూరుఁడు - శౌర్యముగలవాఁడనియు, సూర్యుఁడనియును. తనయల్లి - నాదియైన తుమ్మెద. కాంచనావ్రృతి - బంగారము దొంగిలించుటయనియును, సంపెంగలచేతనైన హరించుట యనియును. చెఱకుఁగూర్చిన - ఖైదుచేసినయనియు, నిక్షువుతో సంధానముఁజేసిననియును, తనవిల్లు - చెఱకు. పలుమొనఁజే పెత్తు - అనేకముఖములుగా బారిపోవుఅనియు, చాలామొలక లెత్తుఅనియును. అలచి - ఆయాసపెట్టి, సూడున్ - విరోధమును.

క. ఆలోపలనె యవంతి మ
హేళా జనయిత్రి దర్శ ♦ యితీకృత పు
త్రీలాలిత ధాత్రీ నే
త్రాలోకన విఘ్నధాత్రి ♦ యై యచ్చటికిన్. 140

140 అవంతియొక్క. మహత్-పూజ్యయగు ఇలాజనయిత్రి- ఇలయను పేరుగలతల్లి. దర్శయితీకృత- ప్రోవఁజూపునదిగాఁజేయఁబడిన. పుత్రీలాలిత-కౌమార్తెచే గారవించఁబడు చెలికత్తెగలది. (అనఁగాఁ కౌమార్తెయొక్క చెలికత్తెయిలాదేవికి నవ్యనవనపుత్రోత్రిపఁజూపుచున్న దనుట.) ధాత్రీనేతృ-రాజుయొక్క.

ఉ. వే యగుడొంచి కాంచి తగ
వే తగవేగన వచ్చి యెంతసే
పాయె నపాయమే యిది కృ
పాయతలోచన రాచపట్టికి

పాయపు టేఁతి కింపగు ను
పాయము లేయివి యో సువర్ణపు
త్రీ యని తోడుకొంచుఁ జని
యెన్ సనయాం దనయిష్టపుత్రికన్. 141

గీ. పుట్టి సిలుఁడించి యుత్తయి ♦ ల్మెట్టినట్టి
కోడలి తెఱంగు చెఱుకుచే ♦ స్వీడనాడి
బందె దొడ్డికిఁ జనుకోడె ♦ చంద మొంద
నుపవనముఁ బాసి తనయింటి ♦ కువిద జనియె. 142

శా. రాధామాహులరమక్కా కటకధా
రాకొండవీడ్కొండప
ల్లీఢిల్లీనగరాముదానగరఘూ
ళీమందువాపందువా
ప్రౌఢాంభోరుహా లోచనా కుచతటీ
పాటీర పత్రక్రియా
గాఢారూఢ కరాంబుజీ కృత నత
క్ష్మాదేవ కంఠీరవా. 143

143 పండువా అనుపర్యంతము పట్టణముల పేర్లు, క్ష్మాదేవ-రాజులు. శ్రీరామమూర్తికిలోఁగిన రాజులందరును స్త్రీలయొక్క గండస్థలములయందు మకరికాపత్రములు వ్రాయుచు స్వేచ్ఛావిహారులైయున్నా. రనుట.

క. పుష్కర బాంధవ సంభవ
కిష్కిందా రాజ్యపూజ్య ♦ కృద్భుజ శరధా
నుష్కాగ్రణి సేనానీ
పుష్కరిణీ తీర భవన ♦ పోషితభువనా. 144

144 పుష్కరబాంధవసంభవ- సూర్యపుత్రుఁడగుసుగ్రీవునికి. సేవానీపుష్కరిణీ - స్వామిపుష్కరిణియనుసరస్సు.

పంచచామరము.

కృపా ప్రపా విపాటితార్తి ♦ ఖిన్నకిన్నరవ్యథా
తపా ద్విపాద్ద్విపాయితస్వ ♦ ధన్యమాన్యపాదలో
లుపాధిపా జపాధిపాక ♦ లుబ్ధబుద్ధిమత్పత
ద్విపద్ద్విషచ్ఛిదా విధా ప ♦ వీ భవచ్ఛవిచ్ఛటా.

145 కృపా...తపా-దయయనెడు. ప్రపా-చలిపందిరివల్ల. విపాటిత-పోఁగొట్టఁబడినఁ. (ఆతపమునకువిశేషణము. ఆర్తిఖిన్న-పీడచే దుఃఖించుచున్న. కిన్నరవ్యథా-కిన్నరులబాధయనెడు, ఆతపా-యెండ గలవాఁడా, ద్విపాత్-మనుష్యులకు. ద్విపాయిత-ఏనుఁగైయాచరించు చున్న. స్వ - తనయొక్క. ధన్యమాన్య- యోగ్యులకుఁబూజింపఁదగిన. పాద - పాదములయందు. లోలుపాధిపా-ఆసక్తిగలవారికి నధిపతియగు వాఁడా. జప - ధ్యానముయొక్క. అధిపాక - పరిపాకమందు. లుబ్ధ = ఆసక్తిగల. బుద్ధిమత్-బుద్ధిగలవారియొక్క, పతత్-ఆక్రమించు చున్న. విపత్ - ఆపదలనెడు. ద్విషత్ - శత్రులయొక్క. చిదా విధా - బ్రద్దలుచేయుటయందు. పవీభవత్-వజ్రాయుధమగుచున్న. -ఛవిచ్ఛటా = కాంతిసమూహముగలవాఁడా.

గద్య.

ఇది శ్రీమద్రామభద్ర భజనముద్ర కవిపట్టభద్ర కాద్రవే
యాధిప వర సమాగత సరససారస్వత లహరీపరిపాక
కాకమానిమూర్తిప్రబోధ బుధకవిసార్వభౌమ
పౌత్ర రామలింగభట్టపుత్ర కౌండిన్యగోత్ర
భాగధేయ మూర్తినామధేయ ప్రణీ
తంబైన రాజవాహనవిజయం
బను మహాప్రబంధంబునందుఁ
తృతీయాశ్వాసము.

శ్రీ

# రాజవాహన విజయము.

( చతుర్థాశ్వాసము. )

---



శ్రీ వేంకటగిరి వల్లభ
శ్రీవామాక్షీ వతంస ♦ హృల్లభ హుంకా
రావల్గు కంస మల్లభ
భావజ భల్లభయదాయ్య ♦ పాంగతరంగా.

వ. అవధరింపుము. 1

1. శ్రీవామాక్షీవతంస - లక్ష్మియను స్త్రీశ్రేష్ఠురాలియొక్క. హృల్లభ - మనస్సును బొందినవాఁడా. ఆవల్గు - కఠినమైన. కంస - కంసునియొక్క. మత్ - మథనమును. ఆభ - పొందినవాఁడా.

క. అలయాధర ఘృణి తృణిత కి
సలయామణి రమణి యగుఁగు ♦ సమయమున మహీ
వలయాధ్యుఁడు విల యానల
మలయానిల ఖిన్న హృన్న ♦ మన్నయభరుఁడై. 2

2. అలయా...మణి - స్త్రీశ్రేష్ఠురాలు.

ఉ. తాలిమిఁ దూలి తూలి చెలి దర్పకుఁ
డప్పుడె పంపు తమ్మిపూ

వాలికె తూపు క్రొంచెమట
వానకుఁ గారణమైన నిద్దపుం
గోలమెఱుంగో యానన చ
కోర హితాగత రశ్మియో దయా
లోలమృగాక్షి నాపయిఁ ద
ళుక్కున జూచిన చూపు బాపురే. 3

క. ఒప్పులకుప్ప యొకప్పుడు
రెప్పార్పని చూపు బాపు ♦ రే తెక్కలచా
ల్విప్పి కదల్పని తేఁటియ
యొప్పునె సామ్యంబు వికసి ♦ తోత్పల రుచికిన్. 4

క. నిగుడించి వెనుకకా చెలి
సొగసుగఁ గడకంట నాటఁ ♦ జూచిన చూపుం
దెగనిండఁ దిగిచి మరుఁడే
చ్ఛగ విడచిన కలువ తూపు ♦ సుమ్మన నేలా. 5

క. ఉడురాజముఖీ రత్నము
కుడియెడమల బెళఁకిచూచు ♦ కులుకుం జూపుల్
వెడ విల్తుఁ డుభయకరములఁ
దొడఁగి వరుని నేయు కలువ ♦ తూపులు గావే. 6

ఉ. ఆ కడకంటిచూపు టార
పా యపరంజి మెఱుంగుచెక్కులా
చైకుర చంచరీక రుచి
సంచిత మేచక చాకచక్యమా

రాక సుధాంశు రా కదె ప
రాకని రేక నిరాకరించుమెరా
మూ కుచ కుంభ జృంభణము
యూరె యొయూరికి దానికే తగుఁ. 7

7. చైకుర - కేశసమూహమనెడు. చంచరీక - తుమ్మెదల యొక్క. రాకసుధాంశున్ - (రాక - నిండుచంద్రుఁడుగల పున్నమ యొక్క. సుధాంశున్ - చంద్రుని.) రాకు - రావద్దు. అదెపరాకు - అదుగోఅజాగ్రత్తగానున్నావు. రేకఁ - భాగముచేత.

క. ఆ గుణవతి ముఖ కుచ కచ
భా గరిమ సుధాంశు లికుచ ♦ బలభి న్మణికా
ధాగధగీ ధైగధగీ
నైగనగీ వై భవముల ♦ నగనగుమిగులఁ. 8

8. భా = కాంతియొక్క. లికుచ = గజనిమ్మపండ్లయొక్క యు. బలభిన్మణికా = ఇంద్రనీలముల యొక్కయు.

క. ఆమరీ నిభ నఖ జిత శు
భ్రమరీచి ప్రమద సరియె ♦ రమణులు కచ వి
భ్రమ రీతుల భ్రమరీతులఁ
జమరీ కుల సమతఁ జెలఁగు ♦ జలజేక్షణకుఁ. 9

9. అమరీభ=దేవతా స్త్రీలతో సమానురాలగు నవంతి. నఖ... ప్రమద, నఖజిత = గోళ్లచే జయింపఁబడిన.శుభ్రమరీచి = చంద్రుని యొక్క.ప్రమద=స్త్రీలైనక్షత్రములుగలది.కళములచేత=నాడుతుమ్మెద సామ్యముచేతను, చమరీమృగసామ్యము చేతను నొప్పు నవంతికి, రమణులు సరియే = సామాన్యస్త్రీలు సమాన మూదురా.

ఉ. తన్మిగదా మొగంబు నెగ
తావుల తీవుల నీను జాళువా

కమ్మ్రగదామెఱుంగుమొయి
గల్వ కటారి మిటారి కమ్మ్రదో
నమ్మ్రగదా మదాళి తతిఁ
దోలెడు కీల్ జడముద్దుగుమ్మ చె
ల్వమ్మున కెంతయైన విలు
వా చెలువా మఱియుం జగంబులన్. 10

10. దోదుమ్మి = ఆయుధవిశేషము.

ఉ. చక్కెర నీరుగాఁ గఱచుఁ
జక్కని క్రొవ్విన తేనె పల్చనౌ
నక్కసలంబు లేఁత మఱు
లన్నను ద్రాసముఁజెందు దొండపం
డెక్కుడు కోఁత నొందుఁ బని
కెంతయు రాకఱుఁగుం బ్రవాళమ
మ్మక్క వసుంధ రా ధర కు
చాధర మీధర నెంచుచోటులన్. 11

11, వసుంధరాధర = పర్వతములవంటి. కుచా = స్తనములు గల యవంతియొక్క. అధరము = పెదవి. నీరు = చూర్ణము. త్రాసము = భయమనియును, మణిదోషమనియును. ఇచట చక్కెర మొదలగు వానికి నాయాగుణములు స్వతస్సిద్ధములు.

చ. అతిమధురంబుగా పెదవి
యభ్రముగా నెఱికొప్పు జ్యోత్స్నగా
సతతము లేఁతనవ్వు ఘన
సారముగా నునుదేఁటమాట యం

చిత దరదంబుగా గళము
చిత్రముగా నిలు వబ్జనేత్ర స
మ్మతిఁగనుఁగొన్ రసజ్ఞునకు
మందునకుం దగ నంద మందదే. 12

12. రసజ్ఞునకున్ = సరసునకు. అతిమధురంబు = మిక్కిలి తియ్యనిది. అభ్రము = మేఘము. జ్యోత్స్న = వెన్నెల. ఘనసారము = కర్పూరము. దరదము = శంఖమును ఖండించునది. నిలువు = ఆకారము. చిత్రము = చిత్తరువు. ఈ చిన్నదానిఁ జూచిన రసజ్ఞునకే యిట్లుండఁగా. మందునకున్ = మూఢునికి. అందముగా నుండదా. (లోకమందు రసికులకు నెంత సౌందర్యవతియైనను నచ్చదు. మూఢునికి కురూపియయినను సౌందర్యవతిగఁ దోచును.) ఇందు వైద్య పరముగా మఱియొక యర్థముగలదు. అతిమధురమను గ్రంధ్యాణము. అభ్రము = అభ్రకము. జ్యోత్స్న = పొట్లతీగె. ఘనసారము = పచ్చకర్పూరము. దరదము - పాదరసము. చిత్రము = చిత్రమూలము. రసజ్ఞునకున్ = రసప్రయోగము నెఱిఁగిన వైద్యునికి. మందునకున్ = ఔషధమునకు.

క. చెలి డాసి తమిఁ గరంబుల
గిలిగింత లొకింత వింత ♦ గీల్కొన నేఁడు
త్పల పత్త్రము నిలిపె నగాం
చలమున రాజనఁగ దగుట ♦ చక్రిం బెఱుఁగుఁ. 13

13. తా నాచిన్నదానికిఁ దగుదునని చంద్రుని మిషచేసి రెండర్థములుగా రాజు చెప్పుచున్నాఁడు. రాజు = చంద్రుఁడు, రేఁడును. చెలిన్ = కల్వపొదను, అవంతిని. తమిన్ = రాత్రియందును, కామముచేతను. కరంబులన్ - కిరణములచేతను, హస్తములచేతను, గిలిగింతలు - వికసింపఁజేయుటలు, కితకితలు. ఉత్పలపత్త్రము = కలువరేకు, నఖక్షత విశేషమును. నగాంచలమునన్ - పర్వతశిఖరమందును (ఉపమేయ నిగరణముచేత) స్తనాగ్రమందును. చక్రింబు-

చక్రవాకము. దేశమును. సేనాచిన్నదానికిఁ దగుదు ననుట లోకమెల్ల నెరుఁగుననని తాత్పర్యము.

సీ. ఇది కాంత కాంతార ♦ హేలవాటింపుచోఁ
గాలుజారిన పరా ♦ గంపుఁ దిన్నె
యిది కొమ్మ కొమ్మకై ♦ యెగయుచో నందంద
చిందు మాకంద మ ♦ రంద ధార
యిది కన్నె కన్నెనా ♦ రదముల కొకతెతోఁ
గోపించి వెదజల్లు ♦ కుందబృంద
మిఁది చెల్వంబు ♦ గదసిపైఁ బద మూది
మేను జేర్చిన కమ్మ ♦ మెట్టుదమ్మి
గీ. ఇచటఁ గూర్చుండి చెలువ బల్ ♦ హేల లనియె
నిచ్చట మదీయ లావణ్య ♦ మిచ్చ మెచ్చి
తొగరు చిగురాకు పొగరున ♦ సగము గొఱికి
మగువ కిడు కోయిలనుగాంచి ♦ పొగిలె నబల. 14

14. కాంతార - వనవిలాసము. మాకంద - మామిడిపువ్వుల యొక్క. కన్నెనారదములకున్. శేఁతనారింజ చెట్టుకు.

క. అని చింతింపుచు వని జ
వ్వని వనితలఁ గూడి మెలఁగు ♦ వలి చప్పరముల్
నన చిదిమి పొదలు పొదలం
బనివడి వడి వెదకి వెదకి ♦ మద నాలసుఁడై. 15

15. పొదలు పొదలన్ - వృద్ధిఁబొందుచున్న పొదరిండ్లయందు హేల లనియెన్- విలాసవాక్యములు బలికెను.

సీ. చెలియ నెమ్మేను జూ ♦ చితిసేని సంపంగి
దండ నీకర్పించె ♦ దన్మనోజ

కొమ్మ నెమ్మొగముఁ గ ♦ న్గొంటి నేని సరోజ
తతిఁ బూజ నినుఁ జేసె ♦ ద స్మళింద
యింతి వాతెరఁ గంటి ♦ నేని నీకు విపక్వ
బింబఫలంబు ల ♦ ర్పింతుఁ జిలుక
చెలువ పాదములు జూ ♦ చితి నేని నీకు లే
జిగురాకుఁ గాను కి ♦ చ్చెదఁ బికంబ

గీ. మనుపుఁడాపద మ్రొక్కు సం ♦ పద మరపుమఁ
జేయుఁ జిత్తంబురా సేవఁ ♦ జేయ నేర్తు
ననుచు ననుచు వచోరీతు ♦ లరసి సరసి
రుహా శిలీ ముఖ ముఖులఁ బే ♦ ర్కొనియె నృపతి. 16

16. ఇచట రాజు తా నేయవయవముఁ జూచునో దానివంటి వస్తువు నిచ్చెదనని మ్రొక్కుకొన్నాఁడు అనిచమత్కారము. ననుచు వచోరీతులన్ - వికసించు వాక్యపద్ధతులచేత. సరసిరుహాశిలీ ముఖ ముఖులన్ - మన్మథుఁడు మొదలగువారిని.

వ. ఈ కరణి ధరణీపతి తరుణీ మణి వియోగ భోగసమా గత మదన వేదనాక్రాంత నిజస్వాంతుండై లతాంత రసాలవాల రసాలజాల స్మరలీలా ఖురళిం గెలిలి, మరలి మరలి పొరలినం దొలి సరలీకృత చంద్రోపల వేదికా తలంబున శీతల కృత్యంబు లయ్యధిపత్యమా త్య పుంగవు లొనర్చి తేర్చిరి. కొంత కొంత నంత నవంతికా పురంబున నవంతీకాంత యంతిపురంబుఁ జొచ్చి విధుకాంత పృథుకాంత శుద్ధాంత సౌధాంత రాళ కేళికా బాలికా హంసతూలికా తల్పంబున మేను గదియించి యపార చింతా పారావారడోలా

య మానమానస నౌకస్యై ఫాలజిత బాలచంద్రిక
బాలచంద్రిక నిట్లనియె. 17

17. భోగ = అనుభవించుట. లతాంతరస = పుష్పమకరందము. ఆలబాల = పాదులయందుఁ గల, రసాలజాల = మామిడిచెట్ల సమూహమనెడు. స్మరలీలాఖురళిక = మన్మథుని విలాసార్థమగు గరిడీయందు. విధుకాంత = చంద్రకాంతమణులచేత. పృథు = గొప్పలగు. కాంత = సుందరములగు. కేళికాబాలికా = ఆడుకొనుపిల్లలతోఁగూడిన. మానసనౌక = మనస్సనెడి యోడగలది. ఫాల = నుదిటిచేత. జిత = జయింపఁబడిన. బాలచంద్రిక = లేతచంద్రుఁడుఁ గలది.

సీ. మనసుఁ జేరువ చంద ♦ మామైన రామోముఁ
గననీక హృదయంబుఁ♦గందఁజేసె
నమృతంపు నడబావి ♦ యగు భూ విభుని మోవి
యందనీక కళంక ♦ మందఁ జేసెఁ
దంగేటి జున్నైన ♦ ధరణీశు పల్కుఁ గో
రిక వినసీక మేల్ ♦ రేచి విడచెఁ
గొంగు బంగారైన ♦ కువలయాధిపునకా
మొరయంగ నీక కా ♦ కొందఁజేసె
గీ. దృఢ పరీరంభ సుఖవిఘ్న ♦ దేవతా వ
తల్లి గాకిది తనుఁగన్న ♦ తల్లి యేవె
తల్లికుచ కుచ యిప్పుడే ♦ తల్లి కొనియెఁ
దల్లిపై వగపుల నావఁ ♦ దల్లి తరమె. 18

18. ఆమొరయంగనీక = పైకొననీక. కాకు = కష్టము. పరీరంభ = ఆలింగనముచేతనైన. విఘ్న = విఘ్నములకు. దేవతావతల్లి = దేవతాశ్రేష్ఠురాలు. లికుచ కుచ = గజనిమ్మపండ్లవంటి స్తనములు గల యోబాలచంద్రికా. తెతల్ = ఆయాసములు. ఏతు = అతిశయముగా.

అల్లికొనియెన్ = ఆక్రమించెను. తల్లి = అమ్మా! ఓ బాలచంద్రికా. పైవగఫలన్ = ముందువచ్చు దుఃఖములను. ఆపన్ = మాన్పుటకు.

ఉ. తల్లులు లేరొ కల్గరొ సు
తల్ తనుజాతల కాడుపోడుముల్
మొల్లమి నుల్లసిల్లకయ
మున్న సమున్నత విభ్రమాంబురు
డ్భల్లుఁ డనుంగు టల్లుఁడు శు
భావహుఁడెవ్వఁడొయండు)గాక కా
కల్లతవంటి పట్టి కిడు
గామిడిఁ గంటివె కామినీమణీ. 19

19. తనుజాతలకున్ = కొమార్తెలకు ఆడుపోడుములల్ = స్తనములు మొదలగునవి. సమున్న.. ల్లుఁడు = సమున్నతవిభ్రమ = గొప్పవిలాసములచేత = అంబురుట్ = పద్మమే. భల్లుఁడు = బల్లెము గల మన్మథుడైన ) కాకల్ = బాధలు గామిడిన్ = గొప్ప గ్రహాముసు

ఉ. అన్నరపాలు వాలుగుల
కగ్గలమౌ తెలిసోగకన్ను లా
కొన్నెల నెన్నొసల్ వెడద
రొమ్ము చొకారపుఁ తేట చెక్కు ల
భ్యున్నత బాహు పీఠి రొమ్ముర
పు న్నెఱపు న్మరపించు నంగముం
గన్నులఁగట్టి నట్టయినఁ
గంటికి నిద్దుర రాదె నెచ్చెలీ. 20

శా. ఈ యంభోధిపరీత భూభుజుల యం
దెంౘైనఁగన్గొంటివా

యా యాకర్ణవిశాలలోచనయుగం
బాపూర్ణచాహాంతరం
బా యాజాను భుజాభిరమ్యవిభవం
బాయంగ సౌభాగ్యకం
బా యిందోప్పల నీల కుంతల కులం
బంభోజ పత్త్రేక్షణా. 21

క కనుమూసినఁ గనువిచ్చినఁ
గనుపుల విలుకాని వ్రాయఁ ♦ గణఁగిన నేవే
ల్పును దలఁచిన రాపట్టియు
కనుపట్టెడు నెట్టులోర్వఁ ♦ గలఁ గలకంఠీ. 22

22. కనుపులవిలుకానిని = మన్మథుని. రాపట్టియ = రాజకుమారుఁడైన రాజవాహనుఁడే.

ఉ. కన్నియ యెన్నియేళ్ళ విరి
గన్నెరులన్ హరుఁబూజసేసిరో
వెన్నెల బైట సౌధ గృహ
వీధుల నాథుల పేరురంబులం
జన్నులు దార్చి మోవి నడు
చక్కఁజురుక్కునఁ బంటనొక్కు చుం
గొన్ని రహస్యముల్ దడవి
కొంచు రమించు నితంబినీ మణుల్. 23

సీ. కొంద ఱిందీవరా ♦ క్షులు గొల్వ నున్నచో
వెలచెల్వ యేతెంచి ♦ బలు విపంచి
మంచి మార్గము విని ♦ పించి మించినదాని,
యరిది గుబ్బలమించు ♦ లల్లజలధి

కాంచీధవాగ్రణి ♦ గాంచిన యాదృష్టి
యేనెఱింగినఁ గాయ ♦ లెంత గొప్ప
లంచు మాటిడి మేను ♦ పెంచు ఘర్మాంబువుల్
గనఁ జెలివెట్ట బా ♦ గాలొసంగె

గీ. నంచుఁ గిరించ గాత్రకో ♦ మాంచ సమితిఁ
దెలిసియేఁ గన్నెలాఁ జేయ ♦ దీప్త రత్న
కుడ్య బింబిత మామకాం ♦ ఘ్రులకు శిరముఁ
జేర్చి పతిసంజ్ఞఁ గినుకఁ జ ♦ ల్లాచ్చు టెపుడొ. 24

24. వెలచెల్వ=వేశ్య. జలధికాంచీధవాగ్రణీ = రాజశ్రేష్ఠుఁడు. కాయలు = వీణకుగట్టిన యానపకాయలు. వెట్టబాగాలు = వేఁడితాంబూలములు. కిరించన్ = పూటుఁబెట్టగా. రాఁగల దాని నూహించి చేఁడుకపడుచున్నది

మ. అని లేపుం దలయూచుఁ బానుపున మే
నందిచ్చు నిందించు జ
వ్వన మెంత వ్వాలవంతఁజేసె ననుచు
న్వాకుర్చిచ్చు రాపచ్చ వి
ల్తుని మెచ్చుం గనువిచ్చు చూయుఁ బొరలున్
లోవెచ్చ నూర్పుల్ లతాం
త నట త్కుంత దురంత కృంతన కళా
తంతన్య మానాంగియై. 25

25. లతాంత... నాంగి=లతాంత = పువ్వులనెడు. నటత్ = కదలుచున్న. కుంత = బల్లెముయొక్క. దురంత-అంతములేని. కృంతన కళా = ఖండించుట యనెడు విద్యచేత. తంతన్యమాన = మిక్కిలి బాధపడుచున్న. ఇది లాక్షణికార్థము. అంగి శరీరము గలది.

వ. ఇత్తెఱంగున బిత్తరి కురంగనయన వదనాంబుజామో
దాస్వాద వినోదంబున కేతెంచి, నాసికాపుటంబుఁ
గాంచి కాంచన కుసుమ భ్రాంతి బెగడి, సుడివడి, నిల
చిన గండు తేఁటి క్రియ ముక్కెర కట్టాణి దెక్కరంపు బై
పయిం జనుదెంచు వేఁడి నిట్టూర్పు గాడ్పుచేఁ దూలం
గఁ జనుంగవఁ దెలి పట్టురవిక చెఱంగు రేవెలుంగునం
దూలంగు బంగరు గుబ్బలి వలి మంచుఁ దలఁపించ
నఖండ విరహ చండిమ పాండుతర గండంబుల గండ
మరి నిండుకొనిన కన్నీటి చినుకులు మినుకు మినుక్క
నబెళుకు బెడిసలు సుధాకర కాంతకాంతఫలకంబులం
గ్రక్కిన చొక్కంపు ముక్తాఫలంబులపైఁ జలంబులు
సూపఁ మధ్యాంబరమధ్యంబునం గాపురముగు నప
రంజి వీణె మెఱపుల రంజిల్లు నల్లపట్టు పుట్టంబు
మెఱుంగు మొగులని బాహులేయు హరి వచ్చి విరి
విచ్చి పురివిచ్చిన విధంబునఁ బయోదర ధరాధరంబుల
కాకచల్లార్పం జేరి శక్యంబుగామిఁ దొంటుప్రిపము తోయద
పటలి యనఁ జటుల మోహాంధకారంబు ముంచిన
జోక శోకాంబుధి వెల్లి విరిసిన తెల్లమిఁ బెల్లుగాఁ దల
కెక్కిన వలపు మున్నీటం దేలు శైవలపు గమి మొ
ల్లమిఁ బల్లవ భల్లుండు తలమునుకలుగాఁ జరపిన నల్ల
గలువ తూఁపు గమి పెల్లడిఁ హాల్లకబంధుని యల్లుండు
బల్లెంబులఁ జిమ్మ, జల్లివిడిఁ బడిస పగిదిఁ జిగురువిలు
కాఁడు తెగనిండఁ దిగిచి గురుకు వంబు లేయు, నల్ల దెగి

పడిన వసువునఁ గ్రొమ్ముడి విడి కుడిమొసములకుం బొరల నెరుల గుంపు చిఁదరవందరమై చెదర భిదుర దసదృశ దశా వివశాంగియై శుకీ తురంగీకు కెంగేలి సంపంగి పికంగి చేఁదాల్మి దొరంగి తరంగిత చింతంగరంగి చొరం గెఱుదైనం గని కురంగీదృశలు శిశిర కృత్యంబులుసేయ నూహించి గృహారామావనికి రామామణిం దోడ్కొని చని చలువ చప్పరంబున నప్పరంధ్రులుప్పరంబైన కప్పురంపుఁ దిప్ప నప్పుడొప్పుల కుప్ప నుంచి. 26

26. ముక్కారకట్టాణి = అడ్డబాపముత్యము. సుధా...ఫలకంబులన్ = చంద్రకాంతమణుల యొక్క రమ్యంబులయిన పలకలయందు కాపురమగు = ఉన్నట్టి. ఇది పట్టమునకు విశేషణము. బాహులేయహారి = కుమారస్వామియొక్క గుఱ్ఱమైన నెమిలి. విరివిచ్చి = విస్తరించి. అనన్, జోకన్; తెల్లమిన్. మొల్లమిన్, పెల్లడిన్, పగిదిన్, వడువునన్ ఇవి ఉత్ప్రేక్షావాచక శబ్దములు. పల్లవభల్లుండు = మన్మథుఁడు, హల్లకబంధుని = చంద్రునియొక్క. అల్లుఁడు = మేనల్లుఁడైన మన్మథుఁడు, జల్లివిడిన్ = జల్లున. తెగనిఁడన్ = నారియంతయు. అనఁగా ఆకర్ణాంతముగా. తిగిచి - లాగి. అల్ల - నారియైన తుమ్మెదబారు. భిదురత్ - వజ్రాయుధమై యాచరించుచున్న. దశా - అవస్థచేత. శుకీతురంగీకు - మన్మథునియొక్క. కిఱుదు - హీనము. మహీజాని సుధాంశు - రాజచంద్రునియొక్క.

ఉ. బంగరు కమ్మి వంటి మన
బాల తనూలత వెండి తీగెతో
సంగతి సల్పెనమ్మ కర
శాఖలకుం దఱులిచ్చు గాజులున్

ముంగలికేగెనమ్మ చను
ముత్తెము లశ్రునిపాతమూర్తిక్రియాం
సంగములయ్యెనమ్మ నుహి
జాని సుధాంశు కథా వృథా వ్యథన్. 27

ఉ. కోయిల ముద్దరాలి కను
కూల పతిక్రియలేని పెట్టుమం
దాయెఁగదమ్మ తమ్మి విరి
యమ్ముల గాయము గంటులేనిపో
టాయెఁగదమ్మ, మావియును
హాప్రతిలేని మహానలాంబకం
బాయెఁగదమ్మ, యమ్మగధుఁ
డారడిఁ దెచ్చెఁగదమ్మ, కొమ్మకున్. 28

28. పతిక్రియ - పెనిమిటియొక్క సంయోగము.

గీ. మొగులు చిఱుదాయ యాతోఁట ♦ మొగలుదాట
దిగులు పడి చింత గుండియల్ ♦ వగులు కాంతఁ
బొగులు నారాజుతోఁగూర్చి ♦ నెగులు దీర్చి
తగులు సేయమిఁ బరుఁడు వెన్ ♦ దగులు మరుఁడు. 29

29. మొగులు - మేఘముయొక్క. చిఱుదాయ - చిన్న శత్రువు. మొగలు - మొదళ్ళు. (పరుఁడు - విరోధి.)

క. కొమ్మా క్రొమ్మావి చిగురుఁ
గొమ్మా రమ్మా యరంటి ♦ క్రొన్నన తేనెల్
దెమ్మా హైమాంబువు లం
దిమ్మా యని సఖులు శైత్య ♦ కృత్యాదరలై. 30

30. 1 కొమ్మ = ఓచిన్నదానా. 2 కొమ్మ=పుచ్చుకొమ్ము హైమాంబువులు = పన్నీరులు.

ఉ. గంద మలందరే చనుసె
గం దలమంచు నమందకుంద మా
కంద మరంద బృంద మెస
గం దనువల్లికయందుఁ జిందరే
చందన గంధులార ములు
చందన మందక నిందు నిందిరా
నందను వందనంబుఁ గని
నం దనరుం దనయంత గాంతయున్. 31

31. దలము = దళసరిగా. మాకంద = మామిడిచెట్టుయొక్క. ములుచందనము = మూఢత్వము.

మ. కొమలారా కమలాస్త్రవ్రాయుటరుదే
కోదండ మిూయింతి మే
ల్బొమ మేల్బంతిగ వ్రాయుఁ డంబకము లీ
పూఁబోడికన్ దీరుగా
నమరం జేయుఁడు రూపవైభవము నే
డమ్మాగథుం జూడ రా
సమ మయ్యెద్దఁటికంచు వ్రాసి మరుఁబూ
జల్ సేసి కేల్మోడ్చుచున్. 32

32. బొమమేల్బంతి = కనుబొమల తుల్యము. అంబకములు = కన్నులు.

ఉ. దండము నీకు భీమ ధృతి
దండన మండన పండితేతకుకో

దండ జోహారు నీకు యమ
దండ కఠోర నిశాత కాండకో
దండ సలాము నీకు సమ
దండజరాజ విరాజమాన వే
దండ వధూటి కీవె కద
దండము దాపురు శంబ రాంతకా. 33

33, భీమ ..కోదండ - (భీమ = శివునియొక్క. ధృతి = ధైర్యమునయొక్క. దండన = శిక్షించుటయనెడు. మండన = అలంకారమందు, పండిత=నేర్పుగల. ఇక్షుకోదండ = చెఱుకువిల్లు గలవాఁడా) నిశాత = తీక్ష్ణములైన. కాండ = బాణములుగల. సముదం...వేదండ. సముత్ = అతిశయించుచున్న. అండజరాజ = చిల్కయనెడు. విరాజమాన = ప్రకాశించుచున్న, వేదండ = ఏనుఁగుగలవాఁడా.

ఉ. చక్కని వారిలో మొదటి
చక్కని వాఁడవు చొక్కి చక్కరల్
మెక్కెడు తమ్మి పక్కెరల
మిక్కిలి నిక్కిన టెక్కె జక్కి పై
నెక్కెడు నెక్కటీఁడవు మ
హేశ్వరు తోఁ జగజెట్టి వక్కటా
యెక్కడిమాట నీకు నెదు
రే మదిరేక్షణ లిక్షుకార్ముకా. 34

34. తమ్మిపక్కెరల = పద్మకవచములుగల. టెక్కెజిక్కి = టెక్కెలుగల గుజ్జము. చిలుకయనుట. ఎక్కటీఁడు = అసహాయశూరుఁడు.

ఉ. ఆక్కట చొక్కటంపు టిగు
రమ్ముల రొమ్ములు నజ్జు నజ్జుగాఁ

జెక్కడ వంచుఁ గా చకిత
చిత్తత ముగ్గురు వేల్పు లక్కడం
బుక్కిట నొక్క పక్క నొక
పూఁట వధూటుల డించఁబోరు హా
యెక్కడ నీపరాక్రమము
లేమనవచ్చు ముకుంద నందనా. 35

35. చొక్కటంపు = నిర్మలములైన. నజ్జు నజ్జుగాన్ = చిన్న చిన్న ముక్కలుగా.

వ. అని యనేక వాచాడంబరంబుల శంబరధ్వంసిని హంసీగమనావతంసంబులు ప్రశంసింప శంపాలతాపఘనాపరితాప ఘనాటోపం బిక్షుచాప ప్రతాప జాత రూప కలాపంబై యిమ్మడించిన. 36

36. శంపా...టోపంబు = (శంపాలతా = మెఱుపుతీఁగవంటి. అపఘనా = అవయవములుగల స్త్రీయొక్క. పరితాప = బాధయొక్క. ఘన = గొప్పదియైన. ఆటోపంబు = హడావిడి) ఇక్షు...లాపంబు = (ఇక్షుచాపప్రతాప = మన్మథప్రతాపమువల్ల. జాత = పుట్టిన. రూప = స్వరూపము. కలాపంబై = అలంకారముగలదై. అనఁగా శరీరతాప ఘనత మన్మథప్రతాపముతోడైన దనుట. ఇమ్మడించినన్ = రెట్టింపు కాఁగా

ఉ. కన్నులఁ గల్వ లింపుడిగెఁ
గమ్మని మోము సరోజ మంతకున్
ఖిన్నతఁ గాంచెఁ బాదముల
గెంజిగురుల్ వరుగయ్యె బాహులపై
నున్న బిసంబు గందె సతి
యొప్పు దృగాదుల పాటిగాక కుం

దె న్నెరి నుత్పలాదులనఁ
దేరిన తన్వి ప్రతాప మెట్టిదో. 37

37. ప్రతాపము = శౌర్యమనియు. అతిశయ తాపమనియు; చలవకై యుంచిన కల్వలు మొదలైనవి శరీరపువేఁడిచేత వాడిపోయినవి.

సీ. కొమ్మ యూర్పులమిన ♦ తమ్మి కంతుని కమ్మ
గాఁ గాను కొసఁగఁ గై♦కమలుటెంత
వనిత నంటిన చేత ♦ నన తేనెఁ దేఁటికిఁ
జోసిన నోరెల్లఁ ♦ బొక్కుటెంత
చెలి పాన్పుకడ నున్న ♦ చిగురుఁ గోయిల నోటి
కిడిన నాలుక బొబ్బ ♦ లెగయుటెంత
చెలువ గుబ్బ నలందఁ ♦ జిందిన గందంబుఁ
గ్రోల నిచ్చిన గాలి ♦ సూలుటెంత
గీ. యరుణ కర తేజమును సమ్మ ♦ ఖార్భటియు మ
హారసజ్ఞత గంధవ ♦ హాత్వ మతను
ముఖ్యులకుఁ గూడదని కొంత ♦ ముగ్ధకాంత
లంది రంతఃపురమున నే ♦ కాంత చింత. 38

38. కై = చెయ్యి. కమలుట = కాలుట. బొబ్బలు = పొక్కులు. ఈ పద్యమందు సీస చరణములు నాలుఁగింటితోటి అరుణకర తేజము ఇత్యాది నాలుగిటికిఁ గ్రమసంబంధము. అరుణకర తేజము = సూర్యుని వంటి తేజస్సనియు, ఎఱ్ఱని హస్తముయొక్క తేజస్సనియు. సమ్ముఖార్భటి = దగ్గర హడావడియనియు, గొప్ప నోటి హడావడియనియు. మహారసజ్ఞత = గొప్ప రసముల నెఱుఁగుటయనియు. గొప్ప నాలుక గలుగుటనియు, గంధవహాత్వము = గర్వమును బూనుటయనియు, పరిమళముఁ బూనుటయనియును. కూడదు = (మనమీపని కారముఁ చేసినటుయితే) నిలవదు అనఁగా పోవునసుట.

క. అంత నశాంతంబగు నీ
కాంత ప్రతాపంబు మీఁద ♦ గాఁగల గతిచేఁ
గ్రాంత మగు తన ప్రతాపం
బెంతయు జారెనొ యనం ది ♦ నేశుఁడు గ్రుంకెన్. 39

చ. వలపుల రాజు దంపునకు
వైచిన తోఁపు గుడారునాఁగ వె
న్నెల జలకంబుఁగాంచు రజ
నీ గజయానకు మోడ్పుదమ్మి గు
బ్బల సమయాళి ముందె నెరిఁ
బట్టిన చందుకావి నా సము
జ్జ్వలతర సాంధ్యరాగ రుచి
సంధిలె సౌమనసాధ్వ వీధికన్. 40

40. సమయాళి = కాలమను చెలికత్తె. చందుకావి = సిందూరపు రంగుబట్ట. సౌమనస = దేవతల సంబంధమైన. అధ్వవీధికన్ - మార్గవీధియందు. అనఁగా నాకాశమందు.

చ. కొడవలి వ్రేలినట్టు దొర
కూఁతురికిన్ వెసనిడ్డ నాభి చం
దడరఁగఁ గాంచి పంచవిశి
ఖాఖ్య తురుష్క బలంబు వాఁడి కె
క్కుడు సమయంబటం చదరు
గ్రోవులు గాల్పఁగ బిట్టుమందు చిం
దెడి పొగ నా నజాండమున
నిండె నఖండ తమః ప్రకాండముల్. 41

41. దొరకూఁతురికిన్ - అవంతికి. ఇడ్డ = చెలికత్తెలుంచిన. నాభిచందు = బొట్టనెడుచంద్రుఁడు. పంచవిశిఖాఖ్య = మన్మథునిపేరుగల. తురుష్క బలంబు = తురకవానిసేన, వాడికిన్ - శౌర్యమునకు. అదరుగ్రోవులు = సమూహ ములు. దృష్టిదోషాదిబాధలు పోవుటకు నర్ధచంద్రాకారముగా బొట్టుంతురు. తురకలు బాలచంద్రునిఁజూచి యుత్సవముఁజేతురు. అందుచేత వారిశౌర్యము హెచ్చునని వారిమతము.

గీ. సమయ నాడింధమాగ్రణి ♦ సాంధ్యరాగ
విమల శిఖ మింటి తా కమ ♦ టమునఁ గాఁచి
నిశి యలంకారమున కెత్తి ♦ నెల పసిండి
పూదెఁ దోలుఁగట్టు పట్టెడ ♦ మీఁద నిడియె. 42

42. మింటి = ఆకాశమనెడు, తాకమటమునన్ = తాతిపుం పటియందు. పట్టెడ = బంగారము సాగఁగొట్టు నినుపదిమ్మ, నాడింధముడు - అగసాలి వాఁడు.

క. సురలకిడి ధరణిసురలకు
వెరవున నిడకున్నఁబ్రజలు ♦ ద్విజరాజి కొగిం
బరుఁడనఁ గని, ద్విజులకు సుధ
విరివి న్నెలఁగురిసె ననఁగ ♦ వెన్నెల బర్వెన్. 43

43. చంద్రికళలను దేవతలు పానముఁజేతురని శాస్త్రము. ప్రజలు - మనుష్యులు. పరుఁడనన్ - శత్రుఁడనియునుట. అనఁగా విరోధియందురని. కని - ఆలోచించి. నెల - చంద్రుఁడు.

క. కనకరము లేక తన చ
క్కని కరములగాసిఁబెట్టెఁ ♦ గలువలదొర జో
క నికరముగ సాగ్రహుఁడై
కనికరముగ నంత వంతఁ ♦ గాంతా జనముల్. 44

44 శ్లో. ఉత్సాహము. నికరముగన్ = తేటఁదేఱునట్టుగా. సాగ్రహుఁడై = దర్పముతోఁ గూడినవాఁడై. కని - చూచి. కరముగన్ = మిక్కిలిగా. గాసిఁబెట్టెన్ అని యన్వయము.

క. చక్రకుచ తిమిర మేచక
విక్రకచాన్విత సరోజ ♦ వదన సదయుఁడై
చక్రధరు మఱఁది తన కిర
ణాక్రీడలం బ్రోవనేర్చు ♦ నా చెలులారా. 45

45. చక్రవాకము, తిమిరము, సరోజము. ఆచిన్నదాని యవయవముల కుపమానములుగనుక నీచిన్నదానిఁ బ్రోవఁడని తాత్పర్యము.

క. దుమ్ములు రేచు న్మరు దో
దుమ్ములు నెత్తమ్ములాను ♦ తుమ్మెద రామొ
త్తమ్ములు కమ్మని తెమ్మెర
లిమ్ముల నుంబోఁడి వేఁడి ♦ కెట్లు సహించున్. 46

46 దోదుమ్ములు - ఆయుధవిశేషములు, దుమ్ములురేచున్ - ధూళి రేఁగఁ గొట్టును.

పంచచామరము.

మిటారికాని చూచుఁ బొంచు
మించు నించు విల్తుఁడుం
గటారకాని మానితంపు
కమ్మ తమ్మి రేకు చి
క్కటాఁకిగాని గాతచేత
గండు గల్గు చిల్కరా
తుటారికాని నాద రూఢిఁ
దూగు తేఁటి కోర్చునే 47

47. మిటారి = ఓచిన్నదానా. కానియుంచున్ = కానిమ్మని. అనఁగా నీపనిబట్టెదనని. కటారికిన్ = కత్తికి. ఆని = గుఱిఁజేసి పొంచున్ అనిసంబంధము. చిక్కటారి = చిన్నకత్తియొక్క. కానిగాత చేతన్ = తెప్పశక్యముగాని దెబ్బచేత, చిల్కరాతుటారికిన్ = రాచిలుకయనెడు దిట్టరికిని. ఆ నాదరూఢిఁదూగు తేఁటికిన్ = ఆధ్వనిచేయు తుమ్మెదకును.

క. అని యనివారితమగు నీ
సున సిట్లని పల్కి రవి కి ♦ శోరక వేఁబల్
గని శుకసా ద్యరి మదభే
ద్యనిలాద్య సముద్య దాగ్ర ♦ హ గ్రాహిణులై 48

48. శుక...హిణులై = శుకసాది = చిలుకనెక్కినమన్మథుని యందును. అరిమదభేది = చక్రవాకములయొక్క, మదమును గొట్టివేయు చంద్రునియందును. అనిలాద్య = వాయువు మొదలగువారియందును, సముద్యత్ = పుట్టుచున్న. అగ్రహ = అహంకారమును. గ్రాహిణులై = స్వీకరించిన వారలై.

సీ. గురుశరంబుల భవ ♦ తుక్కవలయంబును రేకు
మణఁగించు ప్రభు సగ ♦ ల్భాన్నిప్పి కొనుటో
లలి నీపురము ఏక ♦ లముగఁజేసిన మహో
గ్రహ వీరుఁ జేపట్టి ♦ గడపి కొనుటో
నిను వంతఁబొరల బం ♦ ధన మొనర్చిన యుగ్రు
సటలు సమస్తముల్ ♦ జవిరి కొనుటో
సల్లీలఁ దమిని రా ♦ జిల్లఁగూర్చని సదా
పరపక్ష దుఃఖాబ్ధిఁ ♦ బాపికొనుటో
గీ. మీకుఁ దగువారిపైఁ గోప ♦ మే ఘనంబు
గాక యబలలపై వట్టి ♦ కాక పుట్టి

రాజవై యూఁపు విరహాగ్ని ♦ రాజవైచు
నోజవై తౌ గణింపఁ బ ♦ యోజవైరి. 49

49. పయోజవైరి = చంద్రుఁడా. రాజువై = ఱేఁడవై యనియును. చంద్రుఁడవై యనియును, గురుకరంబులన్ = విస్తారపు పన్నులచేత భవత్కువలయంబున్ = నీభూమండలమును. రేకుమణఁగించు = అణఁగఁ గొట్టుచున్న. ప్రభుపగల్ = రాజుయొక్క విరోధములు అని రాజ పరమైనయర్థము. గురుకరంబులన్ = విస్తారపు కిరణములచేత. భవత్కువలయంబున్ = నీకలువను. రేకుమణఁగించు. రేకు ముళ్ళి పోవునట్టుగాఁజేయు. ప్రభుపగల్ = సూర్యునిపగటి కాలమునని చంద్రపరమైన యర్థము. నీపురము వికలముగఁజేసిన = నీపట్నము పాడుఁజేసిన. మహాగ్రహా = గొప్పఆగ్రహముగల వీరున్= పరాక్రమవంతుని అని రాజ. నీపురము వికలముగఁజేసిన = నీశరీరముఁ గళా హీనముగాఁ జేసిన. మహత్ = గొప్పవాఁడగు, గ్రహవీరున్ = గ్రహ శ్రేష్ఠుఁడగు రాహువునని చంద్ర. ఉగ్రపటులు - భయంకరుఁడైనవాని మోసములు అని రాజ శివునిజటలుఅని చంద్ర. సల్లీలన్ - యోగ్యమగు విలాసముచేత. తమిని - కామముచేత. పరపక్ష - శత్రు బలము యొక్క అని రాజ. సల్లీలన్ - నక్షత్రముల విలాసముచేత. తమిని - రాత్రియందు. అపరపక్ష-కృష్ణపక్షముయొక్క అని చంద్ర. అబలలపైన్ - బలములేని స్త్రీలమీఁద. ఓజవు - ఒజ్జవుఅనఁగా గొప్ప వాఁడవు.

సీ. ఉపరాగ వేళ నీ ♦ కృపలేవి కల్వచొ
గట నిల్వఁ గన్నులఁ ♦ గప్పికొనదొ
విహిత కుహూ యోగ ♦ వివశత శరణొంద
సమ్ముఖంబున నిన్నుఁ ♦ గ్రమ్మకొనదొ
జలధరచ్ఛన్నత ♦ జడిసి నీసతు లడు
గులవ్రాల నఖర రీ ♦ తులమనుపదొ

దిన గండమునఁ గాము ♦ దియుఁ గాపుమని వేఁడ
చోటఁ జల్లని చూపుఁ ♦ జూడ లేదొ
గీ. వనిత యిఁకెట్టి సమయ మె ♦ వ్వరికి లేదు
నేఁటి యామని బుగ బుగ ♦ ల్నీకు సతమె
కాల మిఁటువలెనుండునే ♦ కాలకంఠ
కంఠ గరళ కళంక రా ♦ కా శశాంక. 50

50. ఉపరాగవేళన్ = గ్రహణకాలమందు. కన్నులఁగప్పి కొనదొ = కన్నులలోఁబెట్టుకొని రక్షింపలేదా కన్నులకు కలువలకును సామ్యముగనుక కన్నులతో సమానముగాఁ జేసికొన్నదని భావము. పై మూఁడు పాదములయందు నట్లుగానే యూహింపవలెను. కుహూయోగ = నశించిన చంద్రకళగల అమావాస్యయొక్క సంబంధముచేతనైన నీసతులు = నీభార్యలయిన చుక్కలు. ఆమని బుగబుగల్ - వసంతఋతుసంబంధమైన పరిమళములు. సతమె యెల్లపుడు నుండునా. కాల ...కళంక. కాలకంఠ - శివునియొక్క. కంఠ - కంఠ మందయిన. గరళ - విషమువంటి కళంక - కళంకముగలవాఁడా,

మ. వరుస న్సారస వైరివైన నిను స
ద్విజా వతంసం బనం
దరమారానే కుముదాప్తుఁడైన నిను స
న్మార్గస్థుఁ డీతం డనన్
సరసంబే విషజుండ వీ వమృత దా
నఖ్యాతుఁడన్నన్ విన
న్సరళంబౌనె తమోవిహారి యనినన్
ధర్మంబు దోషాకరా. 51

51. దోషకరా — పాపములకు స్థానమైనవాఁడా అనియు, రాత్రినిఁజేయు చంద్రుఁడా అనియు. సారసవైరివి — సరసిజల సమూహమునకు విరోధివనియు, పద్మవిరోధివనియును. సద్వి

జ్ఞానవంతుఁడు - సర్వము నెఱిఁగినవారిలో శ్రేష్ఠుఁడనియు, శివుని శిరోభూషణమనియు, కుముదప్తుడు - (కుముత్ - కుత్సిత సంతోషము గలవారికి. ఆప్తుఁడు - ఇష్టుఁడు అని కలువల కిష్టుఁడనియు.) సన్మార్గస్థుఁడు - యోగ్యమార్గమందున్నవాఁడని, నక్షత్రమార్గమందున్నవాఁడనియును. విషజుండవు - గరళమందుఁబుట్టినవాఁడనియును, నీటియందుఁ బుట్టినవాఁడవనియును. తమోవిహారి- అజ్ఞానము చేత సంచరించువాఁడనియు. చీకటియందుఁ దిరుఁగువాఁడనియును.

శా. చంద్రా ! చంద్రకహాస నేచెదవ యో
చంద్రాఖ్య నీ కేల నీ
చంద్రత్వంబునఁ బాంథకోటి తనువుల్
శైత్యంబునుం జెందెనో
సాంద్రామోదము నొందెనో తుదిఁ దలం
చం బాండు వర్ణంబు భో
గీంద్రాక్రాంతత శారదాభ్యుదయ మిం
దే వింత శౌర్యాప్తికిన్. 52

52. చంద్రకహాసన్ = కర్పూరమువంటి నవ్వుగల యువంతిని. చంద్రాఖ్య = కర్పూరమను సంజ్ఞ. పాంథ...జెందెనో = మార్గస్థులాటచేత విరహులైనవారి శరీరములు బాధపడుచున్నవనుట. కర్పూరమువల్లనైతే శరీరములు చల్లఁబడును. సాంద్రా...నొందెనో = ఆనందమును నొందలేదనుట. కర్పూరమువల్లనైతే పరిమళము నొందును. పాండువర్ణంబు= తెలుపు, బొల్లియును. భోగీంద్రాక్రాంతత = పాముచేత ననఁగా రాహువుచేత నాక్రమించఁబడుట. భోగముగలవారిచేత స్వీకరించబడుట అని కర్పూరపక్షమందు. శారదాభ్యుదయము = శరత్కాల సంబంధమైన యభివృద్ధి. ఏడాకుల అనటి చెట్టునలనఁ బుట్టుట. తెలుపు మొదలగు మూఁడుగుణములు నీకును కర్పూరమునకును తుల్యములనుట.. ఇందే = ఈ గుణములయందే. శౌర్యాప్తికి వింత. అనఁగా నీగుణములలో శౌర్యముండుట చిత్రమని తాత్పర్యము.

గీ. పాంథకోటి విపాటన ♦ పాటవమున
నీకు వలరాజునకు భేద ♦ నియతి గలదె
యోకువలరాజ పేరొ్కన ♦ నొక్క తీరె
యాది వర్ణంబు నీ కింత ♦ యధికమగుట. 53

53. కువలరాజ - కలవరాజగు చంద్రుడా. వలరాజుకంటె కువలరాజుకు పేరుమొదట నొక కు అను నక్షర మెక్కువగాని తక్కినదంతయు సమానమేయని తాత్పర్యము.

క. తెలివ నపరాధ రహితం
గలికటిఁ బెట్టెదవు భ్రమిగఁ ♦ గావచ్చు నరిం
దటిఁ జూపఁ గొనవు నిన్నిం
దకు చేతులచెడ్డ వాఁడ ♦ నరె పాండుకరా. 54

54. కలికటి=బాధ.పాండుకరా-తెల్లని కిరణములు గలవాఁడా యనియు, బొల్లిచేతుల వాఁడాయనియును. కనుకనే చేతులు చెడ్డవాఁడనరా.

ఉ. చక్కెర బొమ్మపైఁ గరము
సాచుట కొండలపిండి నీకు నీ
వెక్కట యుక్కటం గలుగ
మన్నఁ గలంగవు తారఁ గొంటెరికాల్
దొక్కిన లీల శూలి తలఁ
దొక్కఁ దలంతురె యొల్ల చెడ్డవాఁ
డెక్కటి దేవి మిండఁడను
బెల్ల యథార్థము పాండురాంగకా. 55

55. కొండలపిండి = పంచదార బొమ్మగదా అని చెయ్యిదాపుట, కొండలు పిండిచేయఁ దలంచినట్టు కఠినమైనపని, ఉక్కటక్ = గర్వముచేత. పాండురాంగకా = తెల్లని శరీరముగలవాఁడా. బొల్లివాఁ

డా అనియు. కనుక నే మొల్ళు చెడ్డవాఁడు. ఎక్కటి = ఒంటి గానుండు నట్టి. దేవి = పూజ్యస్త్రీకి. మిండఁడు = విటకాఁడు.

ఉ. మాత దరిద్రతా దమని
మామయుఁ జల్లని రాచ మిన్న నీ
తాత గభీరతా తనుఁడు
తండ్రియునుం బురుషోత్తముండు నీ
భ్రాత జగద్విధాత మధు
బాంధవ యీ తెగవారి నేరి నీ
రీతినిఁ బోలవైతి వొక
రి న్మకరీ సుకరీ కృత ధ్వజా. 56

56. మకరీసుకరీకృతధ్వజా = మొసలిచేత సులభమైచేయఁబడిన జెండాగలవాఁడా.

క. ఏరీతి నుదయు మందితొ
సారస నాభోదరమున ♦ సర్వజ్ఞులకున్
మారుఁడ కుతికకు దిగ వం
భోరాశికి హాలహాలము ♦ బుట్టిన మాట్కిన్. 57

57. సర్వజ్ఞులకున్ = గొప్ప విద్వాంసులకైనను, కుతికకు దిగవు = గొంతుకఁబడెదవు, అనఁగా బాధించెదవు. హాలహాలము = విషము. అదియును. సర్వజ్ఞులకున్ = పూజ్యులైన సాంబమూర్తివారికి కంఠముదిగదు.

ఆ. కమల మథన వదన ♦ కళ సంచు నెంచవు
కమల మదనవ దన ♦ ఘ ప్రమథన
కమల వదనవద్య ♦ ఖర దృష్టి నాఁడేల
కమల వదన మదన ♦ కఠిన కదన. 58

58. కమలమథన = చంద్రునివంటి. వదన = ముఖముగల అవంతియొక్క, కళికంచుక్ = శోభయొక్క రీతిని. ఎంకవు = ఆలోచించవు. కమల = లక్ష్మి అనఁగా నీచిన్నది మాతల్లివంటిది. మదన = మన్మథుఁడా. కలికదనా = కలహయుద్ధముగలవాఁడా. మదనవత్ = సంతోషముగల. అనఘ = దోషములేనివారిని. ప్రమథన-కలపివేయువాఁడా. కమలవత్ = వేడిగల సాంబమూర్తియొక్క. అనవద్య = దోషములేని. ఖర = తీక్ష్ణమగు, దృష్టిన్ = చూపుచేత. నాథః = అప్పుడు. అదనన్ = సమయమందు. ఏల కమలవు = ఎందుకుఁ గాసిపోవైతివి.

క. మదనా నీదాడికి మే
మదనా మదనాగయాన ♦ నలయింతురె మ
ర్మద నాళీకాంబకముల
మదనారత భక్తి శక్తి ♦ మదనా రదనా. 59

59. అదనా - తగుదుమా. మర్మద - మర్మస్థానములను గొట్టునట్టి. మదనారతభక్తిశక్తిన్ - మత్-నాయొక్క. అనారత - ఎడతెగని. భక్తిశక్తిన్ - ఈశ్వరభక్తి సామర్థ్యముచేత. మదను - నీ మత్తు. అరదనా - నశించదటోయి.

క. గంధవహా యీచంపక
గంధవహామణి గరంపఁ ♦ గాఁ దగునె మృగీ
సైంధవ హా! హుతవాహన
బాంధవ హారంబుఁ జూడఁ ♦ బాడియె యిచటన్. 60

60. చంప...మణిన్ - (చంపక - సంపెంగపువ్వువంటి గంధవహా - మక్కువగల స్త్రీలలో. మణిన్ - శ్రేష్ఠురాలగు నీచిన్నదానిని) మృగీసైంధవ - లేడిగుఱ్ఱము గలవాఁడా. హా - అయ్యో. హుతవాహన బాంధవ - అగ్నికి బంధువైనవాఁడా. హారంబున్ - హరించుటను.

క. పవమాన యిందు నీ తల
పవమానప్రదమ యనఁ ద ♦ లంచును దయఁ జూ

పవ మానవ చరితా రై
పవ మానప్రహృతిగాదు ♦ పవ మానవనా. 61

61. నీతలపు = నీయూహ. అవమానప్రదపు = అవమాన మిచ్చునదే. అనద లంచున్=శక్తిలేనివారని, దయఁజూపవు, అమానవ చరితా = రాక్షసకృత్యముగలవాఁడా. రై పవ = శత్రుసంబంధమైన. మానప్రహృతిగాదు = గర్వమును హరించుటగాదు. పవ = విరోధము. మానవనా = మానుకోవయ్యా.

శా. ప్రాణి శ్రేణి హరింపఁజూచిన జగ
త్ప్రాణంబవౌదే జగ
త్ప్రాణ క్రీడఁ జలించు నే భువనముల్
బల్మారు శ్రీకంధరా
క్షీణ క్రోధ ఘటిల్లు నే ప్రసవముల్
గేడించు నే సూనవ
త్తూణస్యందన యాత్మ హత్యయు గురు
ద్రోహంబు నీ కేటికిన్. 62

62. నీవు ప్రాణులఁ జంపఁజూచితివా. నీవు జగత్ప్రాణ మవుగదా అందువల్ల ఆత్మహత్య వచ్చును. జగత్ప్రాణక్రీడన్ = లోకముల ప్రాణములతో నాడుకొనుటచేత. అనఁగా సంహరించుటచేత, లోకములు చలించునుగదా = లోకస్వరూపుఁడైన శివునికి క్రోధగర్భము గదా. మతియు. సూనవత్ = పువ్వులగల. తూణ = అంబులపొదిగల మన్మథునికి స్యందన = రథమైనవాఁడా. ప్రసవముల్ గేడించునే = పువ్వులు రాలునేగదా. శివునికిని మన్మథునికిని బాధ కలిగించుటచేత గురుద్రోహము.

క. ఇందిందిర, వనమందిర
యుం దిందిరనందనుండ ♦ వేలిన వెడ నీ

మందిం దిరస్థై తేనియ
మం డిందు రహింతు ననుచు ♦ మద మేమిటికిన్. 63

63. వనమందిర = అడవి యిల్లుగాఁగల. ఇందిందిర = తుమ్మెదా. ఇందున్ = ఇక్కడ. ఇందిర నందనుండ = మన్మథుఁడే. ఏలినయెడన్ = రక్షించినట్లయితే. ఈమందిన్=ఈజనులను. తిరస్థై= స్థిరపడి. తేనియమందు = తే నెయ నెడు మత్తుమందు. ఇందున్ = ఈ జనులయందు. రహించు ననుచున్ = వృద్ధిజేసెదనని. మద మేమిటికిన్= గర్వ మెందకు. మన్మథుఁడు రక్షించినా నీ వేమి చేయఁగలవని తాత్పర్యము.

క. పదమా మొరయిక చెలియా
పద మాటికి నీకు బ్రహ్మ ♦ పదమా నలినీ
పద మానిని యే డ్పా హరి
పదమా నే డింతయేల ♦ పద మడ్డపమా. 64

64. మొరయిక = అరచుట. పదమా = పాటా. లేక యుడే ఉద్యోగమా. చెలియొక్క ఆపద నీకు బ్రహ్మపదమా. అనఁగా బ్రహ్మ స్థానము దొరకడము వంటిదా. నలినీపద = తామరపూవ నివాసముగల దానా. మానినియొక్క యేడ్పు. ఆ హరిపదమా = వైకుంఠమా. నేడు. ఇంతియేల = ఇంత గొడవయెందుకు. పద = అవతలికి నడువు.

క. శుకమా చంచూజిత కిం
శుకమా మోహీకృతైక ♦ శుక హే మాభాం
శుకమా పరిపూర్ణ సుధాం
శుకమానిత పదస యార్తి ♦ సొంపే నీకున్. 65

65. చంచూజితకింశుకమా = ముట్టెచేత జయింపఁబడిన మోదుగమొగ్గగలదానా. మోహీకృత = మోహాముగలవాఁడై చేయఁ బడిన. ఏక = ముఖ్యుఁడగు. శుక=శ్రీశుకులుగలదానా. హేమ=బంగా రమువంటి. ఆభ = శోభగల. అంశుక = కిరణములుగలదానా. పరి పూర్ణసుధాంశుక = పూర్ణచంద్రునివలె, మానిత = గౌరవించఁబడిన.

వదన = ముఖముగల మా అవంతియొక్క. ఆర్తి = పీడ. సొంపే = మంచిదా.

ఉ. చక్కెరవిల్తు పక్కెరల
జక్కినటంచును ఏక్కి ఏక్కి నే
డెక్కడు మాటలం బదరె
దింతియొ కాని యవారి యానవా
ల్చక్కెరఁ బెట్టి రాము కతఁ
జక్కఁగ నేర్పుచుఁ బెంచినట్టి మా
యక్కను జూడవైతివిగ
దా ప్రమదాళి నిగూఢ కీరమా. 66

66. పక్కెరలజక్కి - కవచముగలగుఱ్ఱము. అవారి - ఆనందముగా. అనవాల్ - చిక్కఁగాఁ గాచిన పాలు. అక్కను - అవంతిని. ప్రమదాళి - మదపంక్తిచేత. నిగూఢ - కప్పఁబడిన దానా.

మ. వనవాసంబు ఫలింపలేదొ ద్విజభా
వంబూనలేదో రతీం
ద్రుని పర్యాళినిఁ బెంపలేదొ మఱియుం
దుర్గ రామ నామామృతా
ప్త నవానందమునందలేదొ కో శుక
త్వం బెందుఁబోయెన్ సహిం
పని పక్కేటికి నీకు మానము వహిం
పన్ భారమా కీరమా. 67

67. ఈ పద్యమందు చిలుకపక్షి యొక్క యర్థమును, శ్రీశుకులవారిపక్షి యొక్క యర్థమును గలవు. వనవాసంబు రెండర్థములయందు సమము. ద్విజభావంబు - పక్షిత్వము, బ్రాహ్మణత్వమును. రతీంద్రుని

వయ్యాళిని = మన్మథ విహారమును. పెంపలేదో = వృద్ధిజేయలేదా అనియును, పొంగొట్టలేదా అనియును. రామనామ = రామ అను పేరు, రామమంత్రమనియును. శుకత్వంబు = చిలుకయాట. శిరీషకులాట మానమువహింపన్ = మాటాడకుండుట. మునిత్వమునొందుట యనియును.

వ. అనిపలికి చిలుకలకొలుకు లపరిమిత పరితాపంబునం గుందుకుంద దశన యుపదశ దశానశంవదయైన యశం కట పటీర పన్నీర నీహార పూర కర్పూర కల్హార దళంబులం జెంగావి చలువం జలువఁ గావింప నచ్చెలువ కొంతకొంత దెలసె నంతఁ బ్రభాత సమయంబగుటయు నవంతీ సీమంతినిం గూర్చి బాలచంద్రిక యిట్లనియె 68

68. ఉపదశ = తొమ్మిదవదైన. దశా = మన్మథావస్థకు అనఁగా మూర్ఛకు. వశంవద = స్వాధీనురాలు. చెంగావి చలువన్ = ఎఱ్ఱబట్టచేత.

ఉ. జాగరమాయెనమ్మ మన
సన్నుతగాత్రికి నిన్న రాత్రియో
హో జాగరమాయెనమ్మ చెలి
కోగిర మింతి లలాటపట్టికన్
నాగరమాయెనమ్మ మృగ
నాభిక పట్టి లతాంగి యశ్రువుల్
సాగరమాయెనమ్మ యని
జాలిఁ గలంగెదరమ్మ నీ సఖుల్. 69

66. ఓగిరము = అన్నము. గరము = విషము, నాభిక = కస్తురి పట్టి - పట్టు. నాగరము - సొంటి. సొంటి పట్టువలె నుండుననుట. సాగరము - సముద్రము.

ఉ. తూర్పుదె తెల్లనై మెఱుపు
తోఁ బొలిచెన్ రవిదోఁచెఁ గ్రొవ్విదల్
చేర్పరదేమి ధాత ముఖ
సీమలఁ గ్రొన్నెల వంక నామముల్
దీర్పరదేమి చన్నుగవ
దిన్నెలఁ జెన్నలకార వీణియల్
జార్పరదేమి యంచుఁ బలు
తప్పఁ దలంచుఁగదే తలోదరీ. 70

70. క్రొవ్విదల్ - కొప్పులు. నామముల్-బొట్లు, సూర్యుడు తలంచును.

క. అమ్మా శీతల జలములు
గొమ్మా ముఖమార్జమున ♦ కున్ లేలెమ్మా
రమ్మా యనుచుం బిలచెద
రిమ్మానిను లింత చింత ♦ యేల కృశాంగీ. 71

చ. వలచినవారు లేరొ మగు
వల్ మగవారికి వార లింతికి
న్వలచెడిచోటు లేదొ మఱి
వారలు గూడఁగఁజూడ లేదొ సొం
పొలయ వియోగ తాపమును
యోగ వికాస మమూస పున్నమల్
చిలుకలకొల్కి యుల్కి మదిఁ
జింతిల నేటికి మాటిమాటికిన్. 72

క. తెం పరసి పర శితాస్త్ర ప
రంపర వర సాంపరాయ ♦ రతుఁడై నిన్నుం

బెంపరలాడ మనోజున
కింపరఁగా నొంపుటెంత ♦ పృథ్వీకాంతున్, 73

73. తెంపు - తెగువ. సాంపరాయ రతుఁడు = యుద్ధమందాసక్తుఁడు. పెంపరలాడన్ - కలిపివేయఁగా. ఇంపరఁగాన్ - సంతోషము పోవునట్టుగా. నొంపుట = బాధించుట.

క. కావున భూమీధవునకు
నీవిధ మెఱిఁగించి ♦ యెల్లి నేఁటనె తేనా
యీవేల వగలఁ బొగిలెదు
నావంటి ప్రియాళి గలుఁగ ♦ నాళీకముఖీ. 74

74. పిరియాళి - ఇష్టురాలగు చెలికత్తె. నాళీముఖీ. పద్మవదనా. నేటనె తేనా=నేడెతోడికొనిరాలేనా.

క. అని యూరడిలఁ బలికి కలి
కినిఁ జెలులకు నప్పు డప్పు ♦ గించి తుహిన జీ
వన జని కామన ధునికా
ఘన వని కావనికిఁ జసి పి ♦ కధ్వని వినుచున్. 75

75. తుహినజీవన - మంచునీటివల్ల జని-పుట్టువుగల,కామన-కామమును గలిగించునట్టి, ధునికా - నదులచేత, ఘన - గొప్పదియగు. వనికా - వనముయొక్క, అవనికిన్ - భూమికి.

ఉ. వాచవులేఁ గడంగి వలు
వంపులఁ దుంపురు లీను తేనెఁ జె
ల్వొ చలివాఁకచే వనపు
టూరునఁ గాంతులఁ బొల్చి పూచి పె
ల్లేచిన గుజ్జుమావి కడ
నెల్లెడ నీడలు గానవచ్చు లే

రాచ మెఱుంగు టాజగతిఁ
గ్రమ్మిన కమ్మని తమ్మి పానుపునన్. 76

76. చలివాఁకచేన్ = చల్లని కాలువచేత. వనపుటాకునన్=వన మురుటుక్క ఆకులచేత. తేరాచ మెఱుంగు టాజగతిన్ = తేటయైన అనఁగా పెంకిచాయలేని తళతళగల చంద్రకాంత శిలల అరుగునందు. కమ్మని= పరిమళించుచున్న.

చ. జిలుగు మృణాళ తంతు కృత
చేలముతోఁ జిగురాకు టోపితో
నోలయ మెఱుఁగు కప్పురపు
టుండల యొంటుల జంటతో విని
స్తుల బిసఖండ హారముల
తో జిగిచందువ తాళితో పసల్
దోలుకు సరోజ పాదుకల
తో గలితోన్నతిఁ బొల్చు భూపతిన్. 77

77. జిలుగు = సన్నమైన. ఒంటులజంట = చౌకట్లజోడు. విని స్తుల = సామ్యములేని. చందువ=వెన్నెలవంటి, తాళి=పతకము. తోలు కు=వ్యాపించుచున్న.

సీ. పుష్పొదు ల్గప్పు క ♦ పోలమెండకు నిండి
భానుబింబాచ్ఛ ద ♦ ర్పణమొసర్ప
విరి తేనె దోఁగిన ♦ చరణంబు గండుక్రొం
జెమ టందు మరునిచేఁ ♦ జిగురుఁ జిమ్మఁ
బన్నీరపూర మి ♦ ళన్నేత్ర యుగళంబు
పదనిచ్చు మదను సం ♦ బకముఁ బగట

ఘనసార తనువు ను ♦ ప్పనఁగ్రాచి వైచిన
శ్రీకన త్కనక శ ♦ లాకఁ జెనఁగ
గీ. జందన కరంబులు విభాసి ♦ కుంద హిమ స
మన్వితపుఁ దమ్మి న గనున్న ♦ మగధ నృపతిఁ
జక్కఁగాఁ గాంచి నాచేతఁ ♦ జిక్కె ననుచు
నక్కసలయోష్ఠి చక్రేశు ♦ చక్కి కరిగి. 78

78. ఎండకునిండు=ఎండచేతనిండి. చేఁజిగురున్ =చేతిలోనా యుధముగానున్న చిగురును, పదనిచ్చు=పదునెక్కిన, అంబకమున్ =బాణమును. పగటున్=ప్రకటింపఁగా. ఘనసారతనువు=కర్పూరముఁబూసిన శరీరము. శ్రీకనత్ = శోభచేతఁబ్రకాశించుచున్న. కనకశలాకన్ = బంగారు కణికను. చందన కరంబులు=గంధముఁబూసినచేతులు.

శా. పంచే షూగ్ర జయాంక కంకణ రణ
త్పాదాందు కాగ్ర చ్ఛిదా
చంచ చ్ఛాతన చుంచు చంచు హృత మో
చం బంచ వర్ణ చ్ఛదో
దంచ ద్రత్నమయీ భవ ద్భవన రా
మాఖ్యా సమాఖ్యాత్రి వై
రించాంభోజ ముఖీ శుకీజ నొక కీ
రిం గేలఁ గీలింపుచున్. 79

79. పంచేషూ... మోచన్ = పంచేషు = మన్మథునియొక్క. ఉగ్రజయ= భయంకరమైనజయమునకు. అంక=చిహ్నములైన. కంకణ= కడియములచేత. రణత్ =ధ్వనించుచున్న. పాదాందుకా= కాలిగొలుసుల యొక్క. అగ్ర=చివరలయొక్క. ఛిదా=కొరుకుటచేత. చంచత్ =కదలుచున్న. శాతనచుంచు=వాడితోఁగూడిన. చంచు=ముక్కుచేత. హృత= హరింపఁబడుచున్న అనఁగా దినఁబడుచున్న. మోచన్=అరటి పండు

గల.) పంచ... భవన్ = పంచవర్ణ = అయినురంగులుగల. ఛద = ఱెక్కల చేతను. ఉదంచత్ = ఒప్పుచున్న. రత్నమయీభవత్ = రత్నవికారమైవదో చున్న. భవన = గృహముగల. రామాఖ్యాసమాఖ్యాతిర్న్ = రామనామమును బలుకుచున్న. వైరించాం... శుకీజన్ = వైరించాంభోజముఖీ = సరస్వతియొక్క. శుకీజన్ = ఆడుచిలుకవలనఁబుట్టిన. కీరిన్ = ఆడుచిలుకను.

క. ఇందుముఖి చింద నొరపు
"ల్వం దేవాల్మీకికోకి ♦ లమ్మ"ను నవ మా
కంద మకరంద బృందము
గ్రందుకొనం బలుకు చిలుకఁ ♦ గానుక యిడుచున్. 80

80. నవ...బృందము - నవ - క్రొత్తదియగు. మాకంద - మామిడిచెట్లయొక్క. మకరంద - పూదేనెలయొక్క. బృందము - సమూహము. ఒరపుల్ చిందన్ - శోభలువ్యాపించఁగా.

క. కెంజూపింతట విడుమం
చుం జిరితో దొరకు శరణుఁ ♦ జొచ్చిన ముకుళ
త్కంజాతము బలె రంజిల
నంజలి ఫాలమునఁ జేర్చి ♦ యల్లనఁ బల్కెన్. 81

81. కెంజూపు = ఎఱ్ఱనిచూపు కోపదృష్టిననుట. చిరితోన్ = చిలుకతోఁగూడ. ముకుళత్ = ముణిఁగియున్న. అల్లనన్ = మెల్లగా.

క. విన్నపమేమున్నది చెలి
నిన్నటి వావేళ నిచట ♦ నిన్నటు తుదఁ గ
న్గొన్నది మొదలొదవిన దయ
కన్నది విన్నదియుఁగాదు ♦ గామగధ నృపా. 82

82. నిన్నటివావేళన్ = నిన్నటిపొద్దుట. నిన్ను. అటు = ఆప్రకారముగా. తుదన్ = చిగురువరకు, దయ = కరుణరసము అనఁగా విచారము.

ఉ. హారముఁద్రోచి నిష్కుటవి
హారముమైచి పరిమళైక నీ
హారముమాని గానపరి
హారముఁబూని ప్రియోక్తి నిడ్డయా
హారముడించి కూర్మినవ్వవ
హారముఁదెంచి కృశించె నయ్యవం
తీ రమణీలలామ యిట
నిన్నుఁ గనుంగొను నాఁట నుండియున్. 83

83. నిష్కుట = ఇంటిపెరటితోఁటయందలి. విహారమున్ = క్రీడను. పరిమళైక = పరిమళము ముఖ్యముగాఁగల. నీహారమున్ = మంచును అనఁగా పన్నీటిని.

మ. అలివేణీ పరిపూర్ణచంద్రవదనా
యంభోజపత్రాక్షి చి
లుకలకొల్కి కలకంఠకంఠి సుమనో
గాత్రి ప్రవాళాంఘ్రియో
కలహంసీ మృదుయానయంచుఁ జెలి వ
ల్కంగ ల్కియుల్కున్ లతా
లలితాంగి విరహ వ్యథా కథనముల్
వాక్రువ్వ మాఁబోఁటులే. 84

84. ఇక్కడ సంబోధనములయందలి యుపమానవస్తువులైన తుమ్మెదలు, చంద్రుఁడు, పద్మము, చిలుకలు, కోవెల, పువ్వులు, చిగుళ్ళు, హంసయును మన్మథోద్రేకముగలిగించునవి యాటచేత వానిని వినుటకు సహింపఁజాలదని తాత్పర్యము.

సీ. పలికించదు విపంచిఁ ♦ బంచి పైచిన రీతి
సతత ప్రవాళ సం ♦ స్మరణ మొదవ

శ్రుతి షడ్జ పంచమో ♦ న్నతిఁగూడి పాడదు
దండియ శిఖి పిక ♦ ధ్వనులఁ బెనుప
నాటక సందర్భ ♦ నయమును జెందదు తదీ
యాంకంబు లేయించ ♦ హావణుఁ దెలుప
భాగవత పురాణ ♦ భణితికిఁ జెవి యీదు
శుకముఖోద్గత వచ ♦ స్స్ఫురణ మెసఁగ

గీ. బద్మరాగంబు వలయముల్ ♦ పాణిఁ దొడదు
హాటకప్రసవాంబరం ♦ బన్నఁ జూడ
దేమనఁగవచ్చు నయ్యయ ♦ య్యిందువదన
హృదయ వేదన సుదతీ స ♦ ముదయ మదన. 85

85. పంచిపైచినరీతిన్ = ఎవరికో యిచ్చివేసినట్లుగా, వీణ కట్టును జెప్పు పరివాళశబ్దము చిగుళ్లనుగూడఁ జెప్పుటచేతఁ జిగుళ్లు జ్ఞప్తికి వచ్చునుగావునఁ గామోద్రేకము గల్గును. షడ్జ పంచమస్వరముల వలన వానినిఁ బల్కునట్టి నెమిళ్ళును గోయిలలును జ్ఞప్తికి వచ్చును. దండియు = వీణకట్టు. నాటకాంకములుజూడఁగా గజ్జెలచప్పుడువలెఁ బలుకునట్టి హంసలు జ్ఞప్తికివచ్చును. హావణు = ఒప్పిదము. భాగవతమంతయు శ్రీశుకవాక్యములౌటచేత శుకశబ్దమున కర్థమగు చిలుకలు జ్ఞప్తికివచ్చును. పద్మరాగమువల్లఁ బద్మములు జ్ఞప్తికివచ్చును. తొడదు = ధరించదు. హాటకప్రసవ = బంగారుపువ్వులుగల. అంబరము = వస్త్రము ఇందులోఁ బువ్వులు జ్ఞప్తికివచ్చును.

సీ. ముకుర చారు కపోల ♦ చికురమంచుం జుమీ
ఘనుల విరోధంబు ♦ గాదప్ప గనుట
లసన వతీ మణి ♦ హాసన మంచుం జుమీ
చైత్రేందు జాతికి ♦ శత్రుఁ డగుట

మదన బాణ కటాక్ష ♦ వదనమంచుం జుమీ
తమ్మికి రేరాజు ♦ దాయ యగుట
కధర పయోధర ♦ యధరమంచుం జుమీ
తలిరుఁ గోయిల చించఁ ♦ దలఁచు సెల్లఁ
గీ. గన్నులను గల్కి వలిగుబ్బ ♦ చన్నులని సు
మీ చిలుకదాడిమ నశించఁ ♦ జూచు సెంచు
ద్వి భుజ గజ రాజ గిరిషాన్మర్క ♦ తేజ సకల
దక్ష రామాంక సంకుమ ♦ ద ద్రవాంక. 86

86. ఘనులు = మేఘములు, గొప్పవారును. ఁసనవతీ = విలాపములుగల స్త్రీలలోపల, జాతికిన్ = కులమునకు, జాజితీఁగకును, దాడిమన్ = దానిమ్మపండును కన్నులన్ అనునది చూచుటఅను దానితో సంబంధించును. ద్విభుజ గజరాజా = రెండుచేతులుగల గజశ్రేష్ఠమైనవాఁడా. రామాంక = మనోహరమగు చిహ్నము గలవాఁడా.

క. ఎక్కడి నలకూబర సురు
లెక్కడి రతికాంతుఁ ♦ డింక ♦ నేడ వసంతుఁ
డెక్కడి చుక్కలదొర యని
చక్కని యక్కన్నె నిన్ను ♦ సన్నుతి సేయున్. 87

87. నలకూబరుఁడు=కుబేరునికొడుకు. సురులు=దేవతలు.

ఉ. మాళవదేశనాథుఁడు గ
మా ధవ బోధ సనాథుఁ డగ్రనే
పాళి సరత్న కంకణ వి
భాసుర సేవక హ స్త దర్పణుం
డోలి నిజాంకపీఠమున
నొక్కెడ డించని ధన్య కన్య నీ

మేలుదిగానఁ జూనఁదర
మే పరమేష్ఠికి నిన్ను సన్నుతుల్. 88

క. కంటికిఁ బ్రియమంటక మన
మంటునె యొకపాటి పాట ♦ లావోద పయిన్
వింటి నినువంటి దొర కిటు
వంటిది యని పొగడ నేల ♦ బాల నృపాలా. 89

89. సామాన్యస్త్రీలయందు చూపునకిష్టముగాక మనస్సు నిలచునా నీవంటి రాజునకు. ఇది లోకములో వినియున్నాను. అయితే ఆచిన్నదానియందు నీమనస్సు నిలచియుండఁగా నాచిన్నది యిటువంటిసౌందర్యముకలదని చెప్పనెందుకు.

ఉ. లంచముఁ బట్టుసంచల బ
లంగముచే నడలంగ బంగరుం
గొంచెముగాని మేని తళు
కు ల్బెళుకుల్ బచరించుఁ జూపులు
న్మించులఁ గుంచు మోము రజ
నీవిటు గుప్పునఁ దప్పుఁ బొపునున్
సంచపు రేకు రేకుమడ
చం గను నంగన నిక్కుచెక్కులున్. 90

90. బలంగముచేన్=సమూహముచేత. నడ లంగ=నడలు=నడకల యొక్క. అంగ=చాచివేసినయడుగు. సంచపురేకున్=బంగారపురేకును. రేకుమడచన్=అణఁగఁగొట్టుటకు.

ఉ. వెన్నెలవన్నెలాడి నెల
వి న్నెలకొల్పెడు నవ్వుఁ బువ్వుచాల్
కొన్నెల కున్నె లాగునఁ ద
ళుక్కను నిక్కిన యన్ను నెన్నొసల్

వెన్నెల నున్నెలందమును
బేర్కొను బిత్తరిమోము దమ్మియున్
మిన్నెలమి న్నెలంత తల
మిన్న మిటారపు కౌను దీగయున్. 91

91. సెలవిన్=పెదవిప్రక్కయందు. నవ్వుఁబువ్వుచాల్=పువ్వు వంటినవ్వుయొక్క పఙ్క్తి. క్రొన్నెల నున్న=బాల చంద్రుఁడు. వెన్నెల మన్నెల=అనేక పూర్ణచంద్రులయొక్క. ఎలమిన్=శోభచేత. మిటారపు=చాకచక్యముగల.

ఉ. కమ్మకదంబ మేల చెలిఁ
గౌఁగిట గూర్చినఁ జాలు మించుట
ద్దమ్మును జూడ నేల యల
తన్వి కపోలమె చాలుఁ గప్పురం
బిమ్మననేల వీడెమున
కింతి నవాధర మానిసంతఁ జా
లెమ్మననేల వీణ సుద
తీమణి పల్కినఁ జాలు భూవరా. 92

92. కదంబము=అనేకపరిమళద్రవ్యములుకలిపినముద్ద.

సీ. ఇటులుండవలదా చె ♦ లీ నెరుల్ హారిమణుల్
దెచ్చి కమ్మచ్చునఁ ♦ దిగిచి నటుల
ఇటులుండవలదా చె ♦ లీసోగ వగచూపు
మెఱుఁగువెన్నెలరేకు ♦ చఱచి నటుల
ఇటులుండవలదా చె ♦ లీసోయగపు మొగం
బేణాంకుఁ జిగిలి సే ♦ యించి నటుల

ఇటులుండవలదా చె ♦ లీ గుబ్బలెడ గావి
మలదోయియున్న గా ♦ మలచినటుల
గీ. ఆహాహా యిటులుండవలదా యొ ♦ యారి తోడలు
పద్మికరములు తరుమణిఁ ♦ బట్టి నటుల
నంచు మొక్కి నుతించుఁగా ♦ కతివఁ గన్న
నంగభవుఁడోపఁ డవ్వాల ♦ నడు గిడంగ. 93

93 కమ్మచ్చుగా = బంగారము తీఁగ దీయునట్టి కన్నతోలలు గల యినుపకమ్మియందు, రేకుచరచినట్లు = రేకువేసినట్లు. చికిలి = మెఱుఁగు, మలదోయి = రెండుపర్వతములు. మలచినట్లు = చెక్కినట్లు. పద్మికరములు = ఏనుఁగుతుండములు. తరుమణి = కట్టెలకు మెరకపల్లములు దిద్దు యంత్రము.

సీ. చపలానుభవము కా ♦ కిపుడు సాటియె యంబు
దంబు విష్ణుపదంబు ♦ దండఁగన్నఁ
బద బలమేకాక ♦ భ్రమరంబు సమమౌనె
కృష్ణాబ్జ సాంగత్య ♦ మొనసియున్న
ననిశంబు విషమన్న ♦ మగుటగాకెనయె శై
వల మల శూలితో ♦ నలరియున్న
వక్రగతియెకాక ♦ చక్రితా నీడౌనె
తాపసాశ్రయ శిఖ ♦ దండమున్న
గీ. రసము విడువక కడచూపు ♦ లొసఁగి చంప
కాన్వితంబయి భానుమో ♦ హాకర మగుచుఁ
జిక్కు విడచి జిగి విడక ♦ స్నేహ మూనఁ
దగి కొమరు డించకుండు బి ♦ త్తరి నెరులకుం 94

94 చపలానుభవము = చంచలమైన అనుభవము, మెఱుపు యొక్క అనుభవమును. విష్ణుపదంబు = ఆకాశము. విష్ణుస్థానమును.

పదబలము = స్థానబలము. కాళ్ళబలము. అనఁగా నారుకాళ్లుగలవని యును. కృష్ణాబ్జ = నల్లగలువయొక్క, కృష్ణమూర్తియొక్క. అని ధ్వని. విషము = కాలకూటము, నీరును, శూలితోన్ = త్రిశూలిగడ్డితో. శివునితోననియు. వక్రగతి=వంకరచేష్ట, వంకరనడకయు, చక్రి= పాము తాపసాళియ = తపశ్శాలుల కాధారభూతుఁడైన శివునియొక్క. శిఖదండక్ = సిగదగ్గరను. మహాతపశ్శాలి దగ్గరనని ధ్వని. రసమున్= శృంగారరసమును. మేఘమైతే. రసము = నీటినివిడుచును. కడచూపు లోనుఁగి చూడఁదగినదై, ఆకాశమైతే కనఁబడదు. చంపకాన్వితంబు= సంపెంగపువ్వులతోఁ గూడినది. తుమ్మెదలైతే అట్లుగావు. భానుమోహాకరము = కాంతులచేతఁ గామమును బుట్టించునని, నల్లగల్వైతే. భాను = సూర్యునికి మోహాకరముగాదు. చిక్కువిడచి, నాచైతే అట్లుగాదు. జిగివిడక = శోభవదలక, గడ్డియైతే కొన్నాళ్ళకు శోభ తగ్గిపోవును. స్నేహమానఁదగి = చమురు నొందఁదగి, పామైతే. స్నేహము = మైత్రిచేయఁదగినదిగాదు. కోమరు డించక = కోమలత్వము వదలక. శివునిశిఖయైనతే అట్లుగాదు.

చ. కలికి మొగంబుసాటిఁ గనఁ
గంజము పుష్పోడి మంటలో వన
స్థలమున నిల్చి చక్రగతి
సంభ్రమిత భ్రమ రాక్షుదామ మిం
పొలయ మరు చ్ఛల ద్దశజ
వోష్మత వే తపమాచరించియున్
బలిమి ముడింగి హాస దశ
పారము ముట్టక భంగ మొందెడిన్ 95

95 వనస్థలమునన్ = అరణ్య ప్రదేశమందు, నీటియందును. చక్రగతి = గుండ్రముగాఁ దిరుగుటచేత. సంభ్రమిత = తిరుగుచున్న. హాసదశ = నవ్వుయొక్క అవస్థ. అనఁగా నందరిచేత నవ్వఁబడుట, వికసించుట.

గీ. తమకు భవనంబులీరెంటి ♦ దయ దలంపు
మని శ్రుతి శ్రీలు ముఖ చంద్రు ♦ నడుగులనును.
వైచు నెత్తమ్ములా కొమ్మ ♦ లోచనమ్ము
నతఁడు తలనిడ్డశరము సు ♦ న్మశివ చూపు 96

96 శ్రీలు = శ్రీకారములు, లక్ష్ములును. తమకు భవనమ్ములు = లక్ష్ములకు పద్మములు, గృహము, తలనిడ్డ = శరణుఁ జొచ్చినవారిని భయము లేదని శిరస్సుపైఁ జేయియుంచుట ప్రసిద్ధము.

క. శ్రుతి నుల్లంఘించుట ము
ఖ్యత కెల్లం గొదవ యండ్రు ♦ గద మర్యాదా
హ్రాతి చుంచువు లతి చంచల
గతులట్లంచుం జలించుఁ ♦ గామిని కన్నుల్ 97

97. శ్రుతిన్ = వేదమును, చెవినియునిను ముఖ్యత=ప్రాధాన్యము, ముఖమందనుట, చెవిదాటిపోతే ముఖముమీఁద నుండుట కలుగదు. అతిచంచలగతులు = మనచంచల వ్యాపారములు. మర్యాదాహ్రాతి చుంచువులు = హద్దుమొక్కపారించడముతోఁ గూడినవి.

క. మాధుర్య మార్దవంబుల
సాధింపన్ యువతి వచన ♦ సఖ్యంబున కా
రాధింపఁ జేరినట్టి గు
ణాధిక మణి సుమ్ము రమణి ♦ యధరం బధిపా. 98

ఉ. రామపయోధరంబు లదె
రా తనపై ఘనమున్నెనంచుఁ డా
వేమరు వేరెరూపుచుఁ బ్ర
వీణత గ్రిందొనరింప మేనుపు

ద్దామత నుండియుం గను స్వ
తంత్రముగా నఖ వజ్ర ఘాతమున్
గాత్రిమము లెంత వింతలయి
న న్మరి కర్మము లెంత వింతలే. 99

99. పయోధరంబులు,-స్తనములు మేఘములును. అదెరా-ఆశ్చర్యము. ఘనము = గొప్పది, మేఘమును. మేరువు = మేరుపర్వతము. వేరెరూపున్ = హారమందలి మేరువుపూసయొక్క రూపముచేతను. ఉద్దామత్ = అతిశయముచేత, ఉత్ = అతిశయమైన. దామతన్ = ముత్యాలమాలికయాటచేతననియును. నఖవజ్రఘాతమునన్ = స్తనములయందు నఖక్షతము లుంచునప్పుడు హారమునకు దగులుననుట. పొరుగూరు వెళ్ళినను తనకర్మతప్పదు.

క. ఇంపువిరుల్ గుణహితముల్
తెంపున సరసిజ శరుఁడు శిలీముఖములకున్
సొంపిది గాదని విడిచిన
సంపెఁగ సరియగుటయెట్లు సఖి మేనునకున్. 100

100. గుణహితముల్ = పరిమళముచేత నిష్టములు, నారికి ఇష్టమైనవి. తెంపునన్ = సాహసముచేత, తెగిపోవడము చేతననియును. శిలీముఖములకున్ = తుమ్మెదలకు. బాణములకును. ఇది = ఈ తెగిపోయిననారి, ఈ సంపెంగపువ్వును.

చ. కలువలయొప్పు నీలముల
కప్పు చకోరపు ఖంజరీటపుఁ
గొలములసొంపు తేఁటి జిగి
గుంపును యౌవన శిల్పి మార్చి వ
ర్తుల కుచదృష్టియొత్తఁ గర
తూలిక బొట్టిరుగుబ్బ సంది యం

దుఃలఁ బడి నాభిపై డిగియె
నో యనఁ జెల్వకునారు డెల్వగున్. 101

101. కప్పు = నలుపు. ఖంజరీటము = కాటుకపిట్ట. ఒత్తన్ = వ్రాయగా. తూలిక = చిత్తరువువ్రాయు కలము. యావనశిల్పి = యావనమనునట్టి మూచ్చివాఁడు. బొట్టు = రంగుచినుకు. సంది = మధ్య భాగము.

క. చనుగొండ కెంకి గల యౌ
వన మదకరి యూరు కదళి ♦ పట్టుకుఁ జనునో
యని నిగళము వెనుబడఁ ద్రొ
క్కినఁ గర్తక మారుతో స ♦ ఖి నాభి నృపా. 102

102. కెంకి = నివాసము. నిగళము = సంకిలి. వెనుబడిన్ = వెనుకనుండునట్లుగా. త్రొక్కిన = త్రవ్విన. నూగారుతో గూడిననాభి సంకిలితోఁ గూడిన గొయ్యివలె నుండుననుట.

క. ఒసపరి యడుగుల కెనయున
వసమా నానాట మొదటి ♦ వర్ణము దొలఁగం
గిసలయము పసరు చూపఁగ
నస దనవల దపుడు తెలియు ♦ నాకులపాటుఁ. 103

103. ఒసపరి = సుందరి. వసమా = తరమా. మొదటివర్ణము = ఎఱుపు. కిసలయశబ్దములో మొదటియక్షరము పోఁగా. సలయము = అణఁగిపోటుతోఁగూడినది, పసరు = పసరురంగు, హీనవర్ణమును. అసదు = తక్కువ, ఆకులపాటు = వ్యాకులపడుట, ఆకులయొక్క రీతి.

క. చిత్తరువున వ్రాయఁగ రాఁ
దత్తరుణి కనత్తనూ వు ♦ హాత్తర కుచముల్
ముత్తరులు నెరులు మఱియుం
జిత్తరులో చిత్తజన్మ♦చెలువయ తక్కన్. 104

క. రెండవ రతి సతి సుమ కో
దండుని మూఁడవ భుజంబు♦దర్పకు తుర్యో
ద్దండతర శక్తి శుకవే
దండుని యైదవ బలాంగ♦మారవ శరమే. 105

సీ. భవ జటాటవిఁ గట్టు♦వడకున్న శశిరేఖ,
భ్రమరిచేఁ ద్రొక్కుడు♦వడని తమ్మి
సూదివాటులు లేని♦సుగుణ రత్న శలాక
కై నంట మాయని ♦ కలికి యద్ద
మొకపూఁట నే తావి♦యుడివోని విరి దండ
పైఁబెట్టు సోక ని♦పసిఁడి కుండ
దిన గండములు లేని♦తేట వెన్నెల సోగ
పొడి పొడిగాని క♦ప్పురపుఁ గుప్ప
గీ. యే నెరసు లేని యయ్యింతి ♦ దాని యమిత
కళ నిటల దీర్ఘ నయనముల్♦కమ్మ మోవి
తరుణ గండ ద్వయీ మ్లాన ♦ తను పృథు కుచ
మండలాజడహాసము ♦ ల్మధురవాణి. 106

106. భ్రమరి = అడుతుమ్మెగ. కైన్ = చేతిచే. కలికి = సొగసైన. పైఁబెట్టుసోకని = మీఁద దెబ్బదగలని, నెరసు = కళంకము ఆయింతివెనుకఁ జెప్పినవానివలె నున్నది. మఱియు దాని నిటలము మొదలగునవి వరుసగా చంద్రకళ మొదలగువానివలె నున్నవి యనుట.

క. గంభీర నాభినటనా
రంభకళారంభయూరు♦రంభాస్తంభో
త్తంభిత కుంభికర తరమె
జాభ కుచంబాగడ జంభ ♦సంభేధి కహా, 107

107. నటనారంభకళారంభ = నాట్యారంభవిద్యచేత రంభ యైనది. ఊరురరంభాస్తంభ = అరటిస్తంభములవంటి తొడలచేత. ఉత్తంభిత = మార్పినవడఁ జేయబడిన. కుంభికర = యేనుఁగుతుండమునుగలది. జంభకుచన్ = నిమ్మపండ్లవంటి స్తనములుగల యువతిని. జంభసంభేదికిన్ = ఇంద్రునికి.

క. గానము సొబఁగులసోనై
తేనెలవానై సరస్వ ♦ తీ కర వీణా
తానపు టక్కైయమృత వి
తానము తానైతగును సు ♦ దతి సుతి గూడన్. 108

108. సోన=ప్రవాహము. తానపు = స్వరవిశేషముయొక్క, టుక్కు = మోసము. తాను = తానే, సుతి = స్వరమును ప్రవర్తింపజేయుస్వరము.

క. రతి మదనునకున్ మదనుఁడు
రతికిన్ భారతికి బ్రహ్మ ♦ బ్రహ్మకు నల భా
రతి దగు సంగతి నట్టి యు
వతి కీవు న్నీకు నయ్యు ♦ వతి దగు నృపతీ. 109

క. పంచ ముఖ మధ్యమకు వై
పంచ సమంచ త్కళా ప్ర ♦ పంచ ఖనికి నీ
పంచశర కేళి వంచన
బంచలు పాటించు టరుదె ♦ పంచజనేశా. 110

110. పంచముఖమధ్యమ - సింహముయొక్క నడుముగలది. వైపంచ - వీణాసంబంధమైన. సమంచత్కళాప్రపంచ - ఒప్పుచున్న విద్యాతిశయమునకు. ఖని - గనియైనది. పంచశరకేళి వంచనన్ - సంభోగమందైన మోసమును. పంచలుపాటించుట - చెల్లాచెదరుఁజేయుట, పంచజన - మనుష్యులకు. ఈశా - ప్రభువైనవాఁడా.

క. అని యిట్లు బాల చంద్రిక
విని పించిన విన్నపంబు ♦ విని యాడం బో
యిన తీర్థమెదురుగా వ
చ్చిన యట్లని పలికి కలికి♦చెలి కిట్లనియెన్. 111

శా. ఏలా చింతిల విూ యవంతికిని యిం
తీ దారుణాస్మ ద్భుజ
వ్యా శౌవక్ర పరాక్రమ క్రమణ చ
ర్య ల్మాళవాధీశుపైఁ
జాలం జూపి సమస్త లోకములు మె
చ్చ న్నాల్గు మున్నాళ్ళలో
బాలారత్నమునూత్నరత్న మనసం
భావించి లాలించెదన్. 112

వ. అని దుకూలాదుల నబ్బాలచంద్రికాతలోదరి నాదరించి పంచిన నవ్విపంచికా వాణియు నిజప్రాణ వయ స్యోప వనంబునకుఁ బవన వేగంబునం జనుదెంచి. 113

113. దుకూలాదులన్ - పట్టుబట్టలు మొదలగువానిచేత. విపంచికావాణి - వీణవంటి వాక్యములుఁగల బాలచంద్రిక.

క. దృ క్తరళ జీవ భారన్
ముక్తా హారన్ నిరస్త ♦ ముక్తాహారన్
నక్తం దివా శ్రుధారా
సిక్త కటం వ్యక్త వలయఁ ♦ జెలియం గాంచెన్. 114

114. దృక్తరళ జీవభారన్ -దృష్టివలెఁ జలించుచున్న ప్రాణ సమూహముగల. అనఁగాఁ బ్రాణములు విరహబాధచేఁ గదలిపోవు చున్నవనుట. ముక్తాహారన్ - ముక్త - విడువబడిన. ఆహారన్ - భోజ

నముగల. నిరస్త - విడువఁబడిన. ముక్తా-ముత్యములయొక్క. హారన్-హారములుఁగల. నక్తం దివ - రేయుంబగళ్ళు, కటన్ - గండస్థలములుగల త్యక్తవలయన్ - విడువఁబడిన కడియములుగల.

క. కాంచి దృగంచల వంచిత
చంచల మద చంచరీక ♦ చంచ చ్చికురం
గుంచిత ముకుర కపోల ను
దంచిత గతిఁజేరి హృదయ ♦ దయ దయివారన్. 115

115. దృంగచల - నేత్రకోణములచేత. వంచిత - వంచింపఁబడిని. చంచల - మెఱుపుగలది. చంచరీక - తుమ్మెదలవలె. కుంచిత-వంచఁబడిన. ముకుర - అద్దములవంటి. కపోల - గండస్థలములుగలది. దయివారన్ - అతిశయించఁగా.

ఉ. చక్కని మేనఁ గట్టిన బి
సప్రసవాదులుద్రోచివైచి లేఁ
జెక్కుల నప్పళించిన య
శీత దృగంబులు చేల నద్ది చన్
జక్కవ జారు పయ్యెదయుఁ
జక్కఁగఁ జేర్చి వికీర్ణ కేశముల్
మక్కువ దువ్వి క్రొవ్వెద య
మర్చి సఖీమణిఁ గూర్చి యిట్లనెన్. 116

116. బిస ప్రసవాదులన్ - పద్మములు మొదలగువానిని. అశీత - వెచ్చనైన. దృగంబులు - కన్నీళ్ళు. చేలన్ - బట్టచేత. క్రొవ్వెద - కొప్పు.

ఉ. నీ చలపట్టి నట్టి పని
నిశ్చల మాయెఁ గదమ్మ, కొమ్మ, నీ

నోఁచిన తొంటి నోము లవి
నూరు ఫలించెఁ గదమ్మ, సత్యభా
మా చతురుండు ద్విత్రి దివ
సంబులలోఁ గరుణించునన్ దయం
జూచెఁ గదమ్మ, యమ్మరుని
సోఁకుల కుల్కకు మమ్మ, నెచ్చెలీ. 117

117. చలపట్టినట్టి = పట్టుబట్టి నటుఁవంటి. ద్విత్రిదివసంబుల లోన్ = రెండు మూఁడు రోజులలో. ఉల్కకు = భయపడకు.

మ. వల దీవంత యనంగ దంత జిత భా
స్వత్కుంద సానందయై
జలకం బాడి దుకూలమూని వరచ
ర్చాగాత్రియై కాంచనో
జ్జ్వల చంచన్మణి నూపుర ధ్వనికి వం
చెల్బారులై ముంచి యం
చలఁ బొంచం జను దెంచి పాసె వసియిం
చం గేళి సౌధంబునన్. 118

118, దంతజితభాస్వత్కుంద = దంతములచేత జయించబడిన ప్రకాశించుచున్న మల్లెపువ్వులుఁగలది. అంచల్ = హంసలు. అంచలన్ = ప్రాంతములందు. పాసెన్ = వదలెను.

సీ. చినుకు వెల్తురు మబ్బు ♦ చే నడ్డపాటించ
వోకార్చు రేరాచ ♦ రేక యనఁగ
దన చిప్ప యున్కిఁబోఁ ♦ దట్టి వచ్చిన హురు
మంజి మేల్కట్టాణి ♦ మౌక్తిక మన

మించిన దట్టంపు ♦ మించి జాడించిన
తలిరు సోయఁపు నె ♦ త్తమ్మి యనఁగ
నప్పసం బెడయని ♦ కుప్పసం బూడిచి
కొలఁతఁ ద్రోఁచిన త్రాఁచు ♦ కూనయనఁగ
గీ. నింతి దాఁగ రేకు చిగురాకు ♦ తేకుఁదమ్మి
దొమ్మిగాఁ గ్రమ్మిన మిటారి ♦ దొర కటారి
వాడిమై వేఁడి మై తెల్పు ♦ వీడనాడి
పోడిమిఁ జెలంగె నప్పు డ ♦ ప్పువ్వుఁబోఁడి 119

119. పోకార్చు = పోగొట్టిన. రేరాచరేక = చంద్రరేఖ. హురుమంజి = హురుమంజి దేశమందైన. కట్టాణి = మిక్కిలి యాణి మైన. జాడించిన = పోగొట్టిన. అప్పసంబు = ఎల్లప్పుడును. ఎడయని = విడువని. కుప్పసము = పొర. త్రాఁచుకూన = పాముపిల్ల. చిగురాకు తేకున్ = దూదిపింజెవంటి చిగురాకును. దొమ్మిగాన్ = సమ్మర్దముగా. క్రమ్మిన = వ్యాపింపఁజేసిన. మిటారి = మదముగల. దొర మన్మథునియొక్క. కటారివాడిమైన్ = కత్తియొక్క తీక్ష్ణత్వముచేత నైన. వేడిన్ = కాకచేతఁగల. మైతెల్పున్ = శరీరపాండిమను. వీడ నాడి = పోఁగొట్టి.

వ. అట్టియెడ నమ్మార్గధేయ వసుధా మండలాఖండలుం డుద్దండ వేదండ కాండాది బలంబులఁ గూడుకొని మానసార మానవపాల శైలభేదను మీఁదికిం గదలి కదలికా క్రముకాది వనవాటంబుల వాటంబై కోటకుం బాక సాటనదిశ పిరంగి వాటునకుం జోటని యొక్క తటాక తటాగ్రంబున మెండుగా దండువిడిచి యుండె నంత నయ్యవంతీ పురంబున. 120

120. వసుధా మండలా ఖండలుండు = భూ దేవేంద్రుఁడు. కాండాది = గుఱ్ఱములు మొదలుగాఁగల, మానవపాలశైలభేదనుఁడు =

రాజదేవేంద్రుఁడు. పాకశాసన = దేవేంద్రునియొక్క దిశ = దిక్కు. తూర్పనుట. పిరంగి వాటునకున్ - పిరంగిదెబ్బకు. చోటు తగిన స్థలము.

ఉ. కన్నడరాయఁ డాత్మకర
కంజ సమాహిత శాహుమూలుఁడై
వన్నెగఁ గొల్వ నశ్వపతి
వస్త్రి సమన్విత హస్తవక్త్రుఁడై
విన్నప మాచరింప నర
విందముఖీ శయ చామరానిలా
భ్యున్నతి నిర్గళ త్కచము
లుత్కలభర్త పొసంగ దువ్వఁగన్. 121

121. కన్నడరాయుఁడు = కర్ణాటదేశపురాజు. ఆత్మకర కంజ సమాహితశాహుమూలుఁడు = తన హస్తపద్మములచేతఁ గూర్చఁబడిన చంకలగలవాఁడు. అనఁగా మడిచేతులు బట్టినాఁడు. వస్త్రిసమన్విత హస్త్రివక్త్రుఁడు. గొప్పవారితో భృత్యులు మొదలగువారు మాటాడునప్పుడు నోటియొద్ద బట్టనుంచుకొనుట వినయ లక్షణము. అరవిందముఖీ = స్త్రీలయొక్క. శయ = హస్తములయందైన, చామర = వింజామరలయొక్క. అభ్యున్నతి = అతిశయముచేత. నిర్గళత్ = జారుచున్న, కచములు = వెండ్రుకలు.

సీ. గాయనీ గాన రే ♦ ఖాద్రివ న్మణి చంచు
బగదాత్మ భూ హాయ ♦ ప్రతిమకంబు
వైణికీ వల్లకీ ♦ వాద్య శ్వాస దృఖ్యంగ
శంకాప్రద స్తంభ శక్రి శిలము
గణికా కటాక్షాంబక ♦ ప్రయోగ ప్రవీ
ణ ధనుర్ధర చ్ఛిత్రి ♦ నలిన శరము

పరిచారికా భుజా ♦ పరిచల చామర చంద్రి
కా చంద్రి దురుభిత్తి ♦ కా ముకురము
గీ. భూసు రాశీ ర్విజృంభమా ♦ ణా సమాంచ
ద్వర్హ పట్టాభిషేక ధా ♦ మాభిరామ
పటలికా పటు మంటపా ♦ భ్యంతరమున
మానసారుఁడు గొలువుండె ♦ మహిత మహిమ. 122

122. గాయనీ = గానముఁజేయు స్త్రీలయొక్క. గాన రేఖచేత. ద్రవత్ = జలము గారుచున్న. మణిచంచు = మాణిక్య వికారములగు ముట్టెలుగల. బకత్ = కొంగలవలె నాచరించుచున్న. ఆత్మభూహాయ = మన్మథుని గుఱ్ఱములైన చిలుకలయొక్క. ప్రతిమ కంబు = ప్రతిమలుగలది. స్త్రీలపాటలవల్ల చిలుకబొమ్మల ముట్టెలు మాణిక్యములౌటచేత నవి కరఁగి నీరు గారుటచేత కొంగలవలె నుండు ననుట. కొంగముట్టెలు నీరు గారుచుండుట న్యాయము. వైణికీ = వీణబాడు స్త్రీలయొక్క వల్లకీవాద్య = వీణావాద్యములచేత. శ్వసత్ - ప్రాణములఁగలవైన. ఇది నీలములకు విశేషము. భృంగకంకాప్రద - తుమ్మెదలన్న సంశయము నిచ్చుచున్న. స్తంభములయందైన. శక్రశిలము - ఇంద్రనీలములుగలది. వీణపాటవల్ల నింద్రనీలములు ప్రాణయుక్తములై తుమ్మెదలన్న భ్రాంతిని గల్గించుచున్నవి. గణికా = వేశ్యలయొక్క. కటాక్షాంబక = కడ్రకంటి చూపులనెడు బాణముల యొక్క ప్రయోగమందు. ప్రవీణ - నేర్పుగల. ధనుః = ధనుస్సును. ధరత్ - ధరించుచున్న. చిత్రినలినశరము - చిత్తరువైన మన్మథుఁడు గలది. చంద్రిత్ = చంద్రునివలె నాచరించుచున్న. అసమ - సమానములేనట్టుగా. అంచత్ - ఒప్పుచున్న ధామ = తేజస్సులయొక్క అభిరామ = మనోహరమగు. పటలికా - సమూహముచేత.

క. పేరోలగ మీగతి జగ
తీ రమణుండొంద వసుమ ♦ తీ నందనుఁ డీ

చేరువకు వచ్చె నను చుం
జారులు వినిపించి రపుడు ♦ చారు ప్రౌఢిన్. 123

సీ. విడిదియల్ బలుసేసి ♦ వెస సంపుకొనుటకై
చెవిఁ జేరి యదలించి ♦ చెప్ప బంధు
లొండొరుల్ బొమసన్న ♦ లొందించి యరచేత
నడివ్రేసి తొడ నింత ♦ యదుము మంత్రు
లే నిందులకు సామి ♦ లోనీకుమని యంత
చాటి చెప్పితి నను ♦ జోటుబంట్లు
మోచి వచ్చిన దాఁక ♦ ముందెఱుంగఁడు కార్య
మిఁటుపయి నేమంచు ♦ నెంచు హితులు
గీ. తండ్రివలెఁ గాఁడు తా బంటు ♦ తాకు తప్పు
లెఱుఁగు బ్రజ పట్టు మానిసి ♦ యితఁడు మగధుఁ
డనెడు పరివారములు గాంచి ♦ రతని కొల్వు
రాజవాహన ధాటికా ♦ శ్రవణ వేళ. 124

124 విడిదియల్ - రాజవాహనునకుఁ దగిన బసలు, పలు - విస్తారముగా. అందుకొనుటకై - అతనితోఁ గలసుకొనుటకు. అనఁగా నతనిని దీసుకరమ్మని. అరచేతనడివ్రేసి - అరచే యడ్డుచేసుకొని. తమ రహస్యము లితరులకుఁ దెలియకుండ మెల్లగను ప్రక్కను చేయుంచి. కార్యము మించి నపుడు ఏమియుఁ దోచక తొడ నొక్కుకొనుటగలదు. ఇందులకు - ఇందునిమిత్తమే. లోనీకుమని - శత్రువుల కెడమియ్య వద్దని. ఏను అని ప్రత్యేకవివక్షచేత నేకవచనము. తాకుతప్పులు - దెబ్బ వేయుటయుఁ దప్పించుటయును. ప్రజపట్టుమానిసి - ప్రజల యందుఁ బక్షపాతము గలవాఁడు. ధాటికాశ్రవణవేళన్ - దాడివచ్చి నట్టు విన్న సమయమందు.

శా. ఆసద్దుల్ విని చేఁగృపాణిఁగొని బా
హాయుగ్మ మీక్షించి బల్

మీసంబుల్ వడిఁ గొల్పి బల్మి నగవుల్
మీరం దృగారుణ్యముల్
మోసుల్ బూనఁగ మానసార మహీపా
లుం డాప్తులం గాంచి యో
హోహో సూరుం డనుదెంచె నంచుఁ బలికెన్
హుంకార మేపారఁగన్. 125

125 కృపాణిన్ - చిన్నకత్తిని. దృగారుణ్యముల్ - కన్నుల యెఱుపులు. మోసుల్ బూనఁగన్ - మొలకలెత్తగా. సూరుడు - శూరుఁడు.

క. జంబుకము చెనకి మత్తగ
జంబుం బోరిఁ గొనఁగ మొనయు ♦ జగమున మండూ
కంబు ప్రభంజన భుజు జగ
డంబునకుం బిలిచె నక్క ♦ టా వింతలుగా. 126

126. ప్రభంజన భుజున్ - పామును.

శా. ఔరా మాగధరాజ కుంజరము నేఁ
డత్యద్భుతాహంక్రియన్
మేరం జెందిన మాళవాధిప హరిన్
మేల్కొల్పె నస్మద్భుజా
ధారా నర్గళ మండలాగ్ర లతికా
ధారా రుచుల్ మానునే
యారాజన్యుని తండ్రి కిప్పటికి శౌ
ర్యౌదార్యముల్ గల్గెనే. 127

127. మాళవాధిప హరిన్ - మానసారుఁడను సింహమును. అస్మ...రుచుల్ - అస్మద్భుజ - మాచెయ్యి. అధార - ఆధారముగల.

మండలాగ్రలతికా - లతవంటి కత్తియొక్క. ధారా=అంచుయొక్క. రుచుల్ - కాంతులు. ఔదార్యముల్ - అతిశయములు.

క. దగఁబరచి చనిన గిరి చె
ట్లిగిరించెను దొనలునిండె ♦ నే మెట్టినచో
ట్లాగి మూసెను తామర చివఁ
బొగడొందిన భిల్లవల్ల ♦ భుఁడు మరఁడంచున్. 128

128 దగన్ - భయముచేత. దొనలు - అంబుల పొదులు. మునుపటి యుద్ధములో బాణశూన్యములైన యంబులపొదులలో మరల బాణములు సంపాదించెనాయనుట. పొగడొందిన భిల్లవల్లభుఁడు అనఁగా మునుపు భిల్లరాజుచేత మానసారుఁడు రాజహంసుని జయింపఁజేసినట్టు తోఁచుచున్నది.

క. ఆట హరి విక్రముఁ డత్యు
ద్భట హయ భట హస్తి ఘటలు ♦ దగరా నగరా
దట హావణిక వెడలిన మహి
పట హరమై చటుల లటక ♦ పటహము మొఱసెన్.

129 ఘటలు - ఏనుఁగు గుంపులు. నగరు - పట్టణము. హావణిక వెడలిశన్ - అలంకార శూన్యముగాఁగా. మహిపట - సముద్రము. లటక - దుష్టమైన.

శా. లంకా రాణ్మద భంగ భంగ నిభ నీ
లా నీలవేణీ వల
త్సంకేతోద్య దపాంగ పాంగవ పదా
బ్జకేళ హృద్ధినిరా
తం కోత్సాహ తరంగ రంగ దిషుసం
ధాభిన్న మాయావి ని

శ్శంక స్వర్ణ కురంగ రంగపతి సం
జ్ఞా శేష శయ్యాశయా. 130

130. భంగ...పాంగ - భంగనిభ - తరంగమువంటి. నీలా నీలవేణీ = నీలాదేవియొక్క. వలత్ - చలించుచున్న. ఖంకేత - సంజ్ఞ యందు. ఉద్యత్ - అభిముఖమైన. అపాంగ - (కడగంటిచూపు గల వాఁడా.) పాంగవ...తరంగ - పాంగవ - పొట్టవాని సంబంధ మయిన. పదాబ్జక్లేశహృత్ - పాదాయాసమును బోఁగొట్టిన. ధీ - బుద్ధి యందు. నిరాతంకోత్సాహతరంగ - అడ్డులేనితరంగమువంటి యుత్సాహముగలవాఁడా. రంగదిషు...కురంగ - రంగత్ - ప్రకాశించు చున్న. ఇషు - బాణముయొక్క. సంధా - కూర్చడముచేత. భిన్న - కొట్టఁబడిన. మాయావి - మాయగలిగినట్టి యు. నిశ్శంక - భయములేని. స్వర్ణకురంగ - బంగారపులేడిగలవాఁడా, శేషశయ్యాశయా - శేష శయ్యయందుఁ బరున్నవాఁడా

క. ప్రవిదారణ రాత్రిమట
ప్రవిదారణదారుణారి ♦ పాణిపయోజా
పవి ధారణ పరిబృఢ కో
ప విధారణ దళసహస్ర ♦ భాస్వత్తేజా. 131

131. ప్రవిదా...పయోజా - ప్రవిదారణ - యుద్ధమందు. రాత్రిమట-శత్రువులయొక్క. ప్రవిదారణ - కొట్టడమందు. దారుణ- భయంకరమయిన. అరి - చక్రాయుధము. పాణి పయోజా - హస్త పద్మమందుఁగలవాఁడా. పవిధారణ...దళ - పవిధారణ - వజ్రా యుధమును ధరించిన. పరిబృఢ - ప్రభువైనయింద్రునియొక్క. కోపము యొక్క. విధా - కొట్టివేయుడమువిషయమై, రణదళ - యుద్ధావస్థ గలవాఁడా.

తోటకము.

కమలా లికుచాకృతి ♦ కమ్రకుచా
సమ మేచక చామర ♦ చారుకచా

భిమతోత్సవ చాపల ♦ పేలవచా
రమనో నవ చాటుస ♦ రాగ వచా. 132

132. కమలా - లక్ష్మియొక్క. లికుచాకృతి - నిమ్మపండ్ల యాకారముగల. కమ్ర - మనోహరములైన. కుచ - స్తనములయందును. అసమ - సమానములేకున్నట్టుగా. మేచక - నల్లనైనట్టియు. చామర చారు - వింజామరవలెసుందరమైన. కచ - కేశములయందును. అభిమత - ఇష్టమైన ఉత్సవమందైన. చాపల - చాంచల్యముచేతను. పేలవ - మృదువైన. చార - ప్రవృత్తిగల. మనః - మనస్సుచేత. నవ - నూతనములైన. చాటు - హితములైన. సురాగ - అనురాగముతోఁగూడిన. వచా - వాక్యములుగలవాఁడా.

గద్య.

ఇది శ్రీమద్రామభద్రభజనముద్రకవి పట్టభద్ర కాద్రవేయాధిప
వరసమాగత సరస సారస్వతలహరీ పరిపాక కాకమాని
ప్రబోధబుధకవి సార్వభౌమపౌత్ర రామలింగభట్ట
పుత్ర కౌండిన్యగోత్ర భాగధేయమూర్తి
నామధేయప్రణీతంబైన రాజవాహన విజ
యంబనుమహాప్రబంధంబునం
దు జతుర్థాశ్వాసము.

శ్రీ

శ్రీ పరమాత్మనే నమః

# రాజవాహన విజయము.

## పంచమాశ్వాసము.



మ దమేలుమంగా
సీమంత ప్రాంత కాంధ ◆ సింధూర గ వ
క్షో మా నఖాంక శంక్యు
ర్వీముఖహాసదాస్యసోమ ◆ వెంకటధామా.

1. అలమేలుమంగయొక్క. సీమంతప్రాంత=పాపిటదగ్గరనున్న కాంత=సుందరమైన. సిందూర=సిందూరమును. గ = పొందిన. వక్షః= వక్షస్థలమందు. మా = లక్ష్మి యొక్క. నఖాంక = నఖక్షతములను. శంకి = ఊహించుచున్న. ఉర్వీ = భూదేవియొక్క. ముఖ = ముఖమునుగూర్చి. హాసత్ = నవ్వుచున్న. ఆస్యసోమ = చంద్రునివంటిముఖము గలవాఁడా.

వ. అవధరింపు మప్పుడమి తేఁ డూరివాకిలి వెడలి కడలి వెల్లివిరిసిన పెల్లున సకల బలంబులం గూడుకొని కుమారుని దర్పసారునిఁ గతిపయ పరివారునిం గావించి కోటలోనుంచి రాజవాహనుపాలెంబు దివియించెద నని చలపట్టి చెరువు కట్ట యుత్తరంపు గట్టున బారు

వెట్టించి మెండుగ దండు గుడారు బిడారులంట నూ
రారు లంటించి బాణంబులు పరగించిన. 2

2. పాలెంబు = సేనాస్థానము. తివియించెదన్ = సంహరించె
దను. గుడారులు = డేరాలు. బిడారు = సమూహము.

క. అలబలముల నల బలముల
యెలగోలే మేమిదొక్క ♦ డెక్కడ నిలు నిల్.
దలతల పదపద పోదుమని
కలఁగెం దండెల్ల హల్ల ♦ కల్లోలంబై. 3

3. అల బలములన్=ఆసేనలను. అలబలముల = ధాతులయొక్క.
ఎలగోలు = గందరగోళము. తలతల = ప్రతిమనుష్యుఁడును. హల్లకల్లో
లము = కలవిలపడ్డది.

శా. కల్లెంబుల్ సవరింప కళ్వముల నె
క్కంబూను రాహుత్తులుం
బల్లెంబు ల్గొని యర్థభోజనము ల
బ్బన్ లేమ యోధాగ్రణు
లెల్ల ల్బలుకుచు నోంటిఁ బంచల నగ
ళ్ళన్ వెళ్ళ భూవల్లభుల్
జల్లింపం దలపోయు కూటమి దొరల్
జవ్వాడి రవ్వాడికిన్. 4

4. అగళ్ళన్ = సందులయందు. జల్లింపన్ = నరుకుటకు.
కూటమిదొరల్ = కూడినరాజులు. సహాయులనుట. జవ్వాడిరి =
చలించిరి.

సీ. ఓయి నాడొక మాట ♦ కొడ్డోలగమున నే
మంటివి చూడు నే ♦ డనెదు వారు

పిల్చినాఁ డితఁడు పో ♦ నిం డల్కనుంట బం
డ్రౌతు పాడియె యని ♦ డాయువారు
నెలకేఁబది దినాల ♦ నెడు తుష్టి లెక్కల
కరణాలఁ జూడఁ గని ♦ కదియువారు
బంతికూళ్లకుఁ బాలుఁ ♦ పడు పోటుబంట్లు వా
రేరయూయని యని ♦ కేగువారు
గీ. బఁటు నెఱుఁగవు గాస మి ♦ మ్మాటెఁ గసరె
దవసరము వచ్చె మముఁజూడు ♦ మనెడు వారు
నైరి మగధేంద్రు పాలెంబు ♦ నందు రిపులు
డాసి చేవాసి యెలజాలు ♦ జేసినపుడు. 5

5. గాసము = జీతము. చేవాసి=భుజపరాక్రమము. ఎలజాలు= వ్యాపించినది.

క. ఆయెడ మాగధ వసుధా
నాయకుఁడు గుడారు వెడలి ♦ నానా విధ సే
నా యోధ సనాథుండై
యాయోధన సముచితాయు ♦ ధాయత భుజుఁడై. 6
క. పర దళముఁ గనిన పార్థివుఁ
డరదంబుల కరదములను ♦ హరులకు హరులం
గరులకుఁ గరుల న్నరులకు
నరులం దగఁ బంచి వైచి ♦ నడచెం గలనన్. 7
సీ. సింధు రాజీ లబ్ధ ♦ బంధు రానందుండు
నవ ముక్త శర తుష్ట ♦ నారదుండు
తన యాభ్యుదయ లీలఁ ♦ గని పోటునెరపుచుఁ
బాటుఁ జూపిన యట్టి ♦ ప్రబలకీర్తి

మంద రాగమ్మును ♦ మ్మలిఁ బారమునుజేస్పు
తరి బుధస్తుతిఁ గన్నఁ ♦ తత గుణమణి
వడిగల వారిదిఁ ♦ బడబాది బల మిట్లు
గడలఁ బోవఁగనీక ♦ నడపు దాత
గీ. సాగరమ్మను పలుకుమిం ♦ చంగఁ గరము
పీచి బైటికిఁ జెత్తలఁ ♦ ద్రోచి వైచి
వాహినీనాథుఁ డోకఁ డోకఁ ♦ డాహవమునఁ
గలయఁ బవుటమ్ముఁ గనిపట్టె ♦ ఖచర తతికి. 8

8. ఈ పద్యమందు (వాహినిపతి-సేనానాయకుఁడు అనియు నదులకుఁ బెనిమిటియగు సముద్రుఁడనియు) రెండుపక్షముల యందర్థము గలదు. సింధురాజీ - సింధుర - ఏనుఁగుల యొక్క. అజీ - యుద్ధమందు అని, సింధు - నదులయొక్క. రాజీ - పఙ్క్తిచేత అనియును. నవ...నారదుఁడు - నవ - నూతనముగ. ముక్త - విడువఁబడిన శర - బాణములచేత. తుష్ట - సంతోషించుచున్న. నారదుండు = నారదమునిగలవాఁడు అని, నవముక్త- క్రొత్తముత్యములుగలవాఁడును. శర - ఉదకముచేత. తుష్ట - సంతోషించుచున్న. నారదుండు = మేఘములుగలవాఁడును అనియును. తన కీర్తి - తనయొక్క. అభ్యుదయ - అభివృద్ధిసంబంధమయిన. లీలన్ - చేష్టను. పోటునెరపుచున్ - ఆయుధప్రయోగముఁజేయుచు. పాటుఁజూపిన - ఆయాసముఁ జూపించిన. ప్రబల - ప్రకృష్ట సేనయొక్క. కీర్తి - యశముగలవాఁడు అని. తనయ=కొమారుఁడైన చంద్రునియొక్క. అభ్యుదయ=ఉదయముయొక్క. లీలన్=విలాసమును. పోటునెరపుచున్ = పొంగుచు. పాటుఁజూపిన = తగ్గుటఁజూపిన. ప్రబలకీర్తి = గొప్పబురదగలవాఁడు. సముద్రము పోటెక్కునపుడు కలతచే బురదబయలుదేరును. అనియును. మంద...మణి=మందకొద్దియైన. రాగమ్మును = ప్రేమయును. ఉమ్మలిన్=కోపమును. పారమునుజేస్పుతరిన్=కడ ముట్టించినపుడు. నిగ్రహములుజూపించునపు డనుట. బుధస్తుతిన్=విద్వాంసుల స్తోత్రమును.గుణ

మణి=షణులవంటి గుణములుఁగలవాఁడు అని., మందరాగమ్మ=మందర పర్వతముయొక్క. ఉమ్మలిన్=మథముచేత. పారమును=ఒడ్డును. బుధస్తుతిన్=దేవతలయొక్క పొగడికను. తతగుణ=విస్తారపు గుణములుగల. మణి = చింతామణిమొదలగురత్నములుగలవాడు అనియును. వడి... దాత = వడిగలవారిని = వేగముగలవారిని. పడనూది = పడఁగొట్టి. బలము = సేనను. కడలఁబోవఁగనీక = పైకిఁబోనీక. దాత=నరికేవాడుఅని. వడి గలవారిని = వేగముగల నీటిని. బడబాది = బడబాగ్ని మొదలగు. ఇక్కడబడబయును, అగ్నికిని అభేదము. బలము=సమూహము. కడలన్=తరంగములచేత. దాత = దాతృత్వముగలవాఁడు. సాగన్=జరుగునట్లు. రమ్మను = రావలసినదనునట్టి. కరమువీచి = చెయ్యివిసరి. చెత్తలన్=బలహీనులను అని. సాగరమ్మను = సాగరమునునట్టి. కరము=మిక్కిలి. వీచినన్=తరంగముచేత. చెత్తలన్=తుక్కులను అనియును.

క. అరదం బరదము హారి హారి
కరి కరియు న్భటుఁడు భటుఁడు ♦ గాఢ చ్ఛలనం
జోరఁ బారి పోరు తఱి బం
ధురమై తరమెన్నరాని ♦ దురమై దొరసెన్. 9

ఉ. మాళవ మాగధుల్ వరపు
మార్గణ మొక్కటి పెక్కురూపులై
వ్రాలిన వాజి రాజి మహి
వ్రాలె రథ ధ్వజ పాళి నుగ్గులై
వ్రేలెభట చ్ఛటాంగములు
వ్రీలె మదావళ దంత కుంతముల్
గూలె సమ స్తభూతములు
గ్రోలెఁ గళేబర ముక్త రక్తముల్ 10

10 దంత కుంతముల్ = ఈటెలవంటి దంతములు.

చ. సరసికిడాయు మత్తకరి
చాదృపన మాగధుపైని దంతిరా

జరిగినఁ గేసరి ప్రకృతి
నమ్మాగధుండును మాళవేంద్రుపై
దుర మొనరించె మాళవుఁడు
దోడనె జాంబవదాకృతి న్భుజా
సరసతఁ జూప మాగధుఁడు
జాంబవతీ పతి భాతిఁ బోరుచున్ 11

11 జాంబవదాకృతిన్ - జాంబవంతునివలె. జాంబవతీపతి భాతిన్ - కృష్ణునివలె. ఈయుపమానములవల్ల జాంబవంతుఁడు తొమాౘైను కృష్ణమూర్తికిచ్చినట్టు యుద్ధమందోడిపోయి మానసారుఁడవంతిని రాజహంసునికిచ్చుట తోఁచుచున్నది.

సీ. చేరి యెక్కినచోటఁ ♦ బూరి మెక్కిన చోట
భయదోక్తి దయశక్తిఁ ♦ బరగఁ జూపె
బోరుముట్టిన చాయఁ ♦ బేరువెట్టిన చాయఁ
గరహేతి వరభూతి ♦ గడలుకొల్పె
దండ వెట్టిన వారి ♦ దండ ముట్టిన వారి
శయ శక్తి నయ యుక్తి ♦ సంఘటించెఁ
గిట్టఁబూనిన చక్కిఁ ♦ బుట్టలాసిన చక్కి
గురుశక్తి యుకుభక్తిఁ ♦ గుదురుపరచె
గీ. వగలు మీఱఁ బొదలుదూర ♦ సిగలజార
గదలు జారఁ గ్రమకమ ♦ క్షమలు జరపె
సమర తలమున నమరెవి ♦ క్రమ రసమున
రణ విహార ణాధ్వరధ్వంసి ♦ రాజహంసి. 12

12 చేరియెక్కినచోటన్ - ఎదురుకొన్నచోట. పూరిమెక్కినచోటన్ - గడ్డికరచినచోట, భయద - భయమునిచ్చునట్టి.

ఉక్తిన్-వాక్యమును. పేరుబెట్టినచాయన్ - మారుపేరు బెట్టినచోట. హేతి - కత్తి. దంటబెట్టినవారిన్ - దండెత్తివచ్చినవారిని. దండము - నమస్కారము. ఉట్టినవారికిన్ - ఉట్టుధాతువునకు జారుట అర్థమైనను ఇక్కడ లక్షణచేత అర్పించుట చెప్పవలెను. శయ = హస్తముయొక్క. రణవిహారణ = యుద్ధవిహారమందు. అధ్వరధ్వంసి=రుద్రుడైన.

సీ. అఖిల సీమామూల ♦ మైన దుర్గమ్ములు
మ్మలికలు గల కమ్మ ♦ వెలమ దొరలు
చేతికై దేసి వేల్ ♦ శివరాయల వరాల
నెలకట్టడల పటా ♦ ణీ గరీబు
లూళ్ళాయముల మీఁద ♦ హారపుత్తరువు గన్న
రాయకైజీతంపు ♦ రాయవారు
పగటి గాసంబు ద ♦ ప్పక యుండ దినరోజు
మాదిరి నొంటిరి ♦ జోదుమూక
గీ. మొదలుగాఁగల వారులు ♦ మొనకు నిచ్చి
పొడిచి పేర్వాడి వీధులేర్ప ♦ డఁగఁజేసి
గాసిఁ గావించి యరులఁ జే ♦ వాసిమెదుట
జూపి నిలరేఁడు మూఁడు మె ♦ చ్చులనమెచ్చ. 13

13. సీమామూలమైనదుర్గమ్ములు = దేశపుహద్దులకోటలు. ఉమ్మలికలు = మొఖాసాలుఅనితోఁచుచున్నది. శివరాయలవరాలు = వరహాలలోభేదము. నెలకట్టడలు=నెలజీతములు. పటాణీలు, గరీబులు= అయాదేశస్థులు. ఊళ్లాయములమీదహారపుత్తరువుగన్న = గ్రామములు సొమ్ములదస్తుచేయుటకు హుకుమునుబొందిన. రాయకైజీతపురాయవారు నెలజీతములు లేకుండా గొప్పగొప్ప ముజరాలుగల అధికారులు. పగటి గాసంబుదప్పక యుండన్ = బత్తెము మానకుండగా. దినరోజుమాదిరిన్ ఏరోజు సొమ్మారోజే ముట్టేపద్ధతినున్న. ఒంటరిజోదు = అసహాయ శూరులైన యోధులయొక్క.

మ. భటులం గీటణఁగించి ఘోటకములన్
    భర్జించి భద్రేభ రా
    ఘటలం జెక్కులుచేసి సైనిక శతాం
    గశ్రేణి నుగ్గాడి యు
    ద్భట కాలానల కాలకంఠ నిభ జా
    గ్రద్విక్రమోదగ్రుఁడై
    దిటమై మాగధుఁడొప్పిన న్మరలె భీ
    తిన్మానసారుం డనిన్. 14

14 ఘోటకములన్ = గుఱ్ఱములను. ఘటలన్ = యేనుఁగు సమూహములను. కాలకంఠ = రుద్రుఁడు. దిటమై = దృఢమై.

సీ. గడగడ వడఁకి న ♦ ల్గడ గడ ల్విడచి క
        కాపిక లైపోయె ♦ గడల పౌజు
    చేతి క్రోవులు వైచి ♦ భీతిఁ ♦ జైవులు జారె
        బగ్గముపాడై తు ♦ పాకి మూక
    కేడెముల్ విడి మాని ♦ వేడెముల్ పంచ
        బంగాళమై పారె గు ♦ ఱాలబారు
    కరమెత్తి ఘీంకార ♦ భరమత్తి పరువెత్తి
        యళికి యథాయథ ♦ లయ్యెఁ గరులు
గీ. గగన మణి ఘృణి విక్రమ ♦ క్రమ ధురీణ
    మగధ మహీధవ భుజదండ ♦ మండలాగ్ర
    దవ ధనంజయ ధగధగ ♦ ద్ధగల బెగడి
    మానసారుండు వెనుకముం ♦ దైన యపుడు. 15

15 గడలు = కొవ్విటెలు. క్రోవులు = తుపాకులు. కేడెముల్ = డాళ్ళు. వేడెముల్ = శౌర్యములు. అత్తి = పొంది. అళికి=

భయపడి. యధాయధలు = చెదిరిపోయినవి. గగనమణి = సూర్యుని యొక్క. ఘృణి = కిరణములవంటి. మండలాగ్రి = కత్తియనెడు. దవధనంజయ = కార్చిచ్చుయొక్క.

క. దగదొట్టి కలన బెట్టిన
మగఁటిమి వెన్నిచ్చి పారు ♦ మాళవ నృపతిన్
మగధపతి యట్టితతినా
శుగతిన్వెన్నాడి కోటఁ ♦ జొరదోలివడిన్. 16

16 దగదొట్టి = దాహముగొని. అట్టి తరిన్ = ఆసమయమందు. ఆశుగతిన్ = వేగిరపు నడకచేత.

చ. అటుల జయంబుఁగాంచిన ధ
రాధిప యోధులు వంకదార మి
క్కుటముగఁ జొచ్చిరాఁగ విని
గొబ్బున వైచిరి పేఁటి కోట వా
కిటి భటు లంత మాగధుని
కిం గల బా ట్టిరుగంట నిప్పుకల్
చిటచిటరాల నేనుఁగుల
చేరువ కాసికిఁ బాపు వెట్టినన్. 17

17 వంకదార = కోటవాకిటి వంకత్రోవ. వైచి = తలుపు వేసిరి. నిప్పుకల్ = అగ్నికణములు. చేరువ = సమూహము యేనుఁగుల చేరువకానికిన్ = గజసేనానాయకునికి. పాపువెట్టినన్ = నీపనియని చెప్పఁగా.

క. గోపుర కవాట పాటన
నైపుణ చణ చరణవార ♦ ణ సమారోపాశా
దీపిత భాషా వర సం
జ్ఞా పటుగతి మావటీఁడు ♦ చనుదెంచె వడిన్. 18

18 పాటన = బ్రద్దలుచేయుటయందు. నైపుణ చణ = నేర్పుతోఁగూడిన. చరణ = పాదములుగల. వారణ = ఏనుఁగుయొక్క. మావటీఁడు = ఏనుఁగునెక్కినవాఁడు.

చ. వడిఁ జనుదెంచి కోట తల
వాకిటి గాఢ కవాట పీఠముల్
పడ గెడిపించి దంతి బారఁ
బారఁగ నిల్చిన తత్పురీ భటుల్
గడల మదావళోరసము
కాయము గాయముఁ జేసి మై జిరా
పొడిపొడి సేయుచుం దిరిగి
పోవక మావతుఁ డాగ్ర హోగ్రుఁడై. 19

19 పడగెడిపించి = పడఁదన్నించి, మదావళోరసము = రొమ్మెదిరించి యుద్ధముచేయు ఏనుఁగు. జిరా = కవచము. మావతుఁడు = యేనుఁగువాఁడు.

గీ. మోటుపలుక నిజాంగంబు ♦ మాటుగాఁగ
వెలయ మావంతుఁ డెసకొల్ప ♦ మలయు మత్త
వారణేంద్రంబు ద్వారంబుఁ ♦ జేరి పెద్ద
బారిచే వైరిబారులఁ ♦ బారి సమరె. 20

20. మోటుపలుక - పెద్దడాలు. ఎసకొల్పన్ = ప్రేరేపించఁగా. మలయు = ఉద్రేకించునట్టి. బారిచేన్ - ఏనుఁగుకాలిగొలుసు చేత. బారులన్ = పఙ్క్తులను. సమరెన్ = చంపెను.

శా. ఈజాడం జెడమోదు దంతిఁ బ్రతి మ
త్తేభంబు నానించి త
ద్రాజత్కుంజర పార్శ్వయోధవరులం
దండించి సేజాలు నా

రాజుల్ గ్రైకొని కోటలోఁగొలుచు నా
రాజుల్ తదంగంబు లు
గ్రాజిం జెక్కులు సేయుచో మరలె గం
ధానేకపం భార్భటిన్. 21

21. ప్రతిమత్తేభంబున్ = ఎదురేనుఁగను. నేజాలు = కత్తులు. నారాజుల్ = ఒకతరహాకత్తులు. గంధానేకపంబు = మదగజము.

గీ. బాణములఁ జివ్వవిలచిన ♦ బాణములను
గ్రోవులను గుంటిక్రోవుల ♦ గోటమూక
యలముఖంబునఁ దొట్టిన ♦ బలము నెల్ల
మంగలములోని పేలాల ♦ మాట్కిఁ బేల్చె. 22

వ. అట్టియెడ. 23

ఉ. తొంటి నృపాల జాలముల
తోఁ దులఁదూగెడు మాగధేంద్రు చే
నంటిన వింటి మంటకు భ
యమ్రితుఁడై సరివారు నవ్వఁగా
గొంటుతనంబునం దుదిని
గోట మరుంగున డాగియుండెనే
బంటుఁడు మానసారుఁడని
పల్కరు మాగధయోధు లాడినన్. 24

24. గొంటుతనంబు = కాఠిన్యము.

చ. పగ మరలింపఁ దండ్రి వను
పం బనిఁబూని యవంతికోటపై
జగడము సేయుఁబూని యటు
సాయకు రాక యరాబుకొమ్మచాల్

తెగువను దేరిచూచుటకు
దిట్టఁడుగాఁడట రాజహంసికిన్
మగతనమేడదాయనియె
మాళవ భృత్యుఁడు కొత్తడంబునన్. 25

25. తండ్రి = రాజహంసుఁడు, అటుసాయకున్ - అటువైపు
నకు. అరాబుకొమ్మచాల్ - కోటకొమ్మలవరుస. అని తోఁచుచున్నది.
కొత్తడంబునన్ - కోటబురుజుమీఁద.

చ. కటిని ఘటిల్లు కొమ్మపుడు
గైకొని మందు తుపాకి వించి గుం
డటుల శలాకఁగూరి తగు
నట్లుగ రంజకముంచి కొమ్మమీఁ
దట నిడి క్రోవి వత్తి వెసఁ
దార్చి పిరంగికి గండిఁజూచు త
ద్భటుఁబడనేసియార్చె మగ
ధ క్షితినాథుని యొద్ద నుద్ధతిన్. 26

26. శలాకన్ = తుపాకి గజముచేత. రంజకము - నిప్పంటించు
టకు మందుగూరిన చిన్నసందు, కొమ్మ - కోటకొమ్మ. గండి = సందు.

క. సరిగాయము లరికాయముఁ
గరకరి గావించి చాయఁ • గని మాగధ రా
ట్కరి తురగ స్యందన భట
మరిగె న్నిజ శిబిరమునకు • నయ్యోడఁ గడకన్. 27

27. కరకరి - బాధ. చాయఁగని - త్రోవఁజూచి. శిబిరము-
సేనాస్థానము.

క. పూని మరునాఁడు మగధ
క్ష్మానాథుం డలుక రేఁగి ♦ మది లగ్గలకున్
సేనానీ కాన్వితుఁ దన
సేనానిం జూచి కోట ♦ సెలవిడియె వశీన్. 28

28. లగ్గలు - గోడలుదిగివెళ్ళిదోచుకొనుట. సేనానిన్-సేనానాయకుని.

శా. దిగ్రాజాగ్రణి పంపునం జని యరా
తి క్రూర నారాచ పా
తాగ్రజ్వాలల నాత్మ బెగ్గిలక తృ
ణ్యాగణ్యభూరుణ్ని కా
య గ్రావాళి నగడ్తఁ బూడ్చి నృపయో
ధాగ్రేసరుల్ కేసరీం
ద్ర గ్రైవేయక మండలాగ్రకర జా
గ్ర ద్విక్రమోదగ్రులై. 29

29. తృణా...వాళిన్ - తృణ్యా - గడ్డిమోపులయొక్క. అగణ్య - లెక్కించ శక్యముగాని. భూరుట్-చెట్లయొక్క. నికాయ-సమూహములయొక్క. గ్రావ - రాళ్ళయొక్కయు. ఆళిన్ - పఙ్క్తిచేత. కేసరీంద్ర - సింహశ్రేష్ఠమువంటి. గ్రైవేయక-కంఠాలంకారము గల, అనఁగా సింహతలాటము పిడిగలది. మండలాగ్ర - కత్తులుగల.

ఉ. చివ్వునఁ గోటయెక్కి బలు
చివ్వ యొనర్చి విరోధి వప్రముం
గొవ్వునఁ గొంట యొండె, రిపు
ఘోర కఠోర కుఠార ధారలం

దెబ్బవ్వట యొండె యెవ్వరటఁ
దిమ్మరి వచ్చిన నొట్టటంచు వా
కుబ్బవ్వఁగ రాని యూన లిడి
కోటకు నెక్కిరి నాల్గుదిక్కులన్. 30

30 చివ్వ = యుద్ధము, కొంట = పుచ్చుకొనుట, త్రెవ్వుట = తెగిపోట, ఆనలు = ఒట్లు.

చ. లసికిరి జోదు లగ్గలి క
లగ్గల కెక్కినఁ గుంతపఙ్క్తులన్
వసుమతిఁగూల్చియున్ గదల
వైచియుఁ గత్తుల వ్రక్కలించియున్
వసుల వధించియున్ ముసల
వర్గములం బడమోది వాలుకల్
మసలక వేసి వంచియును
మందుల తిత్తులు గాల్చి వైచియున్. 31

31 అగ్గలికన్ = శౌర్యముచేత, లగ్గలు = గోడలు. వసు లన్ = కొనలుసన్నముగాఁజెక్కినకొయ్యలు, వాలుకల్ = ఇసుకలు లసికిరి = నశింపజేసిరి.

సీ. నిబిడంబుగా వైచు ♦ నిశ్శ్రేణికా శ్రేణి
తోడఁ బాణిఁ గృపాణిఁ దునిమి తునిమి
యున్న నిచ్చెనలుబో ♦ నొకనిపై నొకఁ డెక్కి
కోట కెక్కఁగ జాలఁ ♦ గూల్చికూల్చి
గట్టిగా సారువల్ ♦ గట్టి యట్టడి మీఁది
కురికి వచ్చినఁ దలల్ ♦ నరికి నరికి

వెనుక బాయి శరంబు♦లను బేచ్చిపైనిల్చి
జగడవించినఁ బార ♦ జంపి చంపి
గీ. కడమ భట సంఘములు సురం♦గం బిడంగ
గాంచి పోంచియె మఱి సురంగ ♦ మునఁ ద్రుంచు
మాళవాధిపు బలము లి♦మ్మాటిక్రొ నొంచె
మగధ నృపుసేన నొకనాటి ♦ పగటిలోన. 32

32. నిశ్రేణికా-నిచ్చెనలయొక్క. కృపాణి-కత్తి, సాయవల్-దిబ్బలు. సురంగము - కన్నము. వెనుకబాయి - వెనుకవైపు, అట్టడి - గృహవిశేషము.

వ. ఇట్టి తెరంగునం బిట్టువడి గుట్టుచెడి గట్టువడిం జేరుటకై యగడతంబడి మునింగి దరిఁజేరి పారి రోఁజు దిన రోజు రాహుత్తులును, రాహుత్తులకుం దోడు తుపాకి వేట్లకు నిలుపోపక గుభులు గుభుల్లునంబరిఖాక్రోడంబునం బడి చేయూడింప నేరమి నడుగు పట్టి బిట్టిలి యొడ్డునకుం దేలిన మోఁడొండు నాయక వాడీలును, నాయకవాడీలం గాంచి భీతాంతరంగులై మాతంగ పాతంగంబు జిబురు జుగుల రవలిం దగిలి గుండియ లవిసి యవనిపై వ్రాలి శవ నిచయంబుల కరణి నిశ్చేష్టితులై వడియేమరించి చను తోడు చూపరి పోమరి దొరపోతులను దొరపోతుల నీక్షించి రోసి యాభీలంబుగా నాలఁబుఁగావించి కాలు కాలుం బెనచికొని యనింబడి పెనుగు బలగంపు పాంతపరివారంబునుం గని జునిగి యనీకంబులకు స్రుక్కి తృణౌనీకంబులు మెక్కి,వల్మీకంబు లెక్కి చెయ్యెత్తిమొక్కి. కుంతలంబులు విడి కుంతలంబులు దిగనాడి వేళ్ళు గఱచి

భయభరంబునం బరచి చను గాటంపు కూటమి మూకల
య్యె, నయ్యవసరంబున హతశేషుల శేషంబు విన్నవించిన
రాజవాహనుండు కటకటం బడి కటంబులు నొడుగఱచి
కోపాటోపం బంకురింప శంకారరహిత హుంకార పూర్వకం
బుగా రేపు సర్వలగ్గ యని చాటింపం బంచి కకుబంత
సామంతుల నవలోకించి యిట్లనియె. 33

33 రోజు-వగర్చునట్టి. రాహుత్తులు-యోధులు, క్రోడంబునన్=మధ్యమందు. బిట్టిలి = తేలి, నాయకవాడీలు = ఉద్దాయలు మాతంగ పాతంగంబు = మిడతగుంపువలెఁగ్రమ్మిన యేనుగులు. జబురు=క్రమ్మిన. జంగులు=మువ్వలు. శేక ఆగ్నిప్రసారణములు. రవళి=ధ్వని. ఏచురించి=పరధ్యానముగానుండుటఁగాని పెట్టి. జుఁగి = అదలి, ఔడుగఱచి = పళ్లుబిగించి. సర్వలగ్గ=అంతయు దోచుకొనుట కకుబంత = దిగంతముల యందైన

క. రే పామాళవ దాఘునిఁ
జేపట్టుగఁ బట్టి కోటఁ ♦ జేకొనమన్నన్
నా పేరు రాజవాహనుఁ
డే పుట్టిన యట్టి వంశ ♦ మిది యైందవమే. 34

34. చేపట్టుగన్ - చేతులతోఁ బట్టుకొనునట్టుగా. అనఁగా సాధనములు లేకుండఁగా. ఐందవము - చంద్రుని సంబంధమైనది.

శా. అంచుం బల్కి యెఱింగి మాళవ విభుం
డారాజుతో మైత్రి వా
టించం బంచె నమాత్యు లవ్వచన ధా
టీ పాటి తాంభోధిరా
ట్కాంచీభృద్ధర మంత్రుల న్నిజమహీ
కాంతాను కూలక్రియా

చంచత్ప్రజ్ఞా ఽభిన్న సంధి ఘటనా
చాతుర్య మాధుర్యలన్. 35

35. వచనమంత్రులన్ - వచనధాటి - వాక్యపటుత్వముచేత పాటిత - కొట్టఁబడిన. అనఁగా జయింపఁబడిన. అంభోధిరాట్ - సముద్రములు. కాంచీ - మొలనూలుగల భూమిని. భృత్ - భరించుచున్న పర్వతములను. హార - కొట్టిన, యింద్రునియొక్క మంత్రులన్ - మంత్రియైన బృహస్పతి గల, నిజ... ప్రజ్ఞులన్ - నిజమహీకాంత - తమ రాజుయొక్క. అనుకూల క్రియాచంచత్ - అనుకూలములయిన పనుల తో నొప్పుచున్న. ప్రజ్ఞులన్ - పజ్ఞలుగల. భిన్నసంధిఘటనా - విడిపోయి నాకలయికను గూర్చుటయందలి. చాతుర్య - నేర్పుయొక్క మా - సంపత్తిగాయొక్క. ధుర్యులన్ - భారమును వహించిన.

సీ. ఆగుల్ఫ లలితంపు ♦ టంచు దోవతి కావి
యరచిట్ట పింజల ♦ కరుణ మెసఁగఁ
దళుకొంద నడుదట్టి ♦ దారు దన్నెడి యింద్ర
గోపంబు పాపోసు ♦ లేపుచూప
వలివంపు టంగిపై ♦ వలెవాటు వేసిన
పైఠాణి తగటు దు ♦ ప్పటి నటింప
దగుపాటిగా వెన్క ♦ సిగ నిల్పిచుట్టిన
నిడుద యుంద పుపాగ ♦ నీటుగుల్క.
గీ. నుభయ కటముల శ్రీముద్రి ♦ యూర్ధ్వపుండ్రి
సంగతాంగార నవయవ ♦ త్సార లోహి
తాక్షణ శ్రీల హేజీబు ♦ లపుడు వచ్చి
రగణిత స్థితి సాహేబు ♦ నగరి కడకు. 36

36. ఆగుల్ఫ - చీలమండల పర్యంతము. పింజెలకున్ - పై మోఁదిఖండువా పింజెలకు. అరుణము - ఎరుపు. దారు-కాంతి. ఇంద్ర

గోపంపు పాపోసులు - ఆర్ద్రపురుగువంటి హైజార్లు. పలివంపు=పల
చనైన. అంగార = బొగ్గుమసి, అక్షీణ = తక్కువగాని హేజీబు =
మంత్రులు. సాహేబు = ప్రభువు. నగరి = సేనాస్థానము.

క. వచ్చిన మంత్రుల నృపతివి
యచ్చర నాయకు ననుజ్ఞ ♦ నవసర సచివుల్
చెచ్చెర హుజూరునకుఁ బిల
వచ్చిన డిగ్గున నరుంగు ♦ వడి డిగ్గి తగన్ 37

37. నృపతి వియచ్చరనాయకుఁడు = రాజదేవేంద్రుఁడు.
హుజూరునకున్ = రాజ సమీపమునకు.

చ. కడువడి పీడియం బుమిసి
గ్రక్కునఁ బాద సరోజపాదుకల్
కడు నట డీడఁదన్ని పోసఁ
గస్వలెవాటు ఘటిల్లు శాటి న
న్నడుమ బిగించి పాగ జత
నంబునఁ గైఁ గరమంటి మీసముల్
వడినిడి యంగిచేతు లెగ
వైచుచు వచ్చి రమాత్యు లత్తఱిన్. 38

గీ. వచ్చి కొలువున్నయెడ నర ♦ వర వతంసు
నుడుగర లొసంగి పొడఁగని ♦ యుచిత సరణి
నంత బరివార మేకాంత ♦ మగు టెఱింగి
చనిన నిట్లన పల్కిరా ♦ సచివ మణులు. 39

39. ఉడుగరలు - కానుకలు.

శా. తస్మా రతహా నిధి రాజహంసునికి క్షే
మంబే, యహోబాలకుల్

మీరల్ భోగులు దండుసేయఁగలరే
మీకమ్మ యింతాపువో
రారాదిక్సతులెల్లఁ గప్పములు దే
రాయంచు మీకెంతయున్
మారాజెంతయు విన్నవించు మనియెన్
రాజాన్వయగ్రామణీ. 40

40. కమ్మ = ఉత్తరము. జాబు. కప్పములు=పన్నులు.

గీ. తండ్రి కొడుకుల కెం దన్న ♦ దమ్ములకును
గలహములు గల్గు నొరులకు ♦ గల్గు టెంత
కలదు మారాజుతో మీకుఁ ♦ గల న టంచు
గల నెఱుంగుదు మే గ్రహ ♦ గతియుగాక. 41

41. కఁను = యుద్ధము.

సీ. జౌగాములకు నెన్న ♦ దైన రెండిళ్ళరా
జులు వట్టిపూడిన ♦ చోటుగలదె
మీమీకుఁ బోదు సు ♦ మ్మీ మేమె తుద వేర
గునె నీళ్ళ నడుమఁ గొ ♦ ట్టినను రెండు
హెచ్చు మాటలకేమి ♦ యింక నొక్కటి మనే
దారులు దారినఁ ♦ దారసిలిన
పంపుచేతనె పారఁ ♦ బట్టించి నపుడు గ
దా స్వామివారి చి ♦ త్తంబువచ్చు
గీ. నీ నియోగులు సీమలో ♦ లేని సుద్దు
లుం గదసి మాయసాగి ర ♦ నంగ వలదు
మాటొకటి సేతొకటిగా ద ♦ దేటి కింత
నాటి నాటికిఁ దెలియుఁగా ♦ నడతలోన. 42

42. మనేదారులు = సామంతరాజులు. తారినన్=డాఁగియున్నను, తారసిలినన్=ఎదురైనను. పంపుచేతనె=ఆజ్ఞాప్రకారమే. అనఁగా సామంతరాజులు పన్నియ్యక చిక్కులుబెట్టుచుండఁగా, మీ సెలవుప్రకారము పట్టుకొని మీకప్పగింతుమని తాత్పర్యము. నీనియోగులు=నీయాజ్ఞలోనివారు మాయసాగిరి=మాయఁజేయుట కారంభించిరి.

క. మీరాజధాని కడకున్
మారా జుపంగవలయు ♦ మంత్రుల నని ముం
దేరుపరచి నాఁడొకపని
కీరలె చనుదెంచినార ♦ లేమనవచ్చున్. 43

ఉ. రూప కళా కలాపకు సు
రుగ్జిత దీపకు నిట్టి కోకిలా
రాపకుఁ జిన్నిపాపకు వి
లాస బిసప్రసవాయుధుండహో
హా! పతి ధాత్రినెవ్వఁడో క
దాయని చూచి భవద్గుణాభి లీ
లా పటిమంబు మాదొరఁ గ
లంపఁగ మాటలు వేయు నేటికిన్. 44

44. సురుగ్జితదీపకున్=లెస్సయగుకాంతిచేత జయింపఁబడిన దీపముగలదియైన విలాసముల చేత. బిసవాయుధుండు=పద్మ మాయుధముగలమన్మథుఁడైన.

క. అల మానసారుఁ డాత్మజ
లలనా మణి నుబుసుపోక ♦ లకుఁ బిన్నపుడే
కలభాషిణి యెవ్వనిఁ బెం
డిలియాడెదవన్న మగధ ♦ నృపుఁడని పల్కెన్. 45

45. ఉబుసుపోకకు = కాలక్షేపమునకు.

క. మాళవపతి నిజ నందన
మేలారసి పెండ్లిఁజేసి ♦ మిూకాత్మ భుజా
పాలిత మేది న్యర్ధము
బాలిక పసపున కొసంగ ♦ భావించె నృపా. 46

46. ఆత్మభుజాపాలిత=తనభుజముచే నేలఁబడుచున్న మేదిని. భూమియొక్క అర్ధము = సగముభాగము.

గీ. పంచమిని రాత్రి లగ్నంబు ♦ మంచి దనుచు
జెప్పిరిట యత్నమొనరించు ♦ టొప్పు నన్న
నాస్య పంకజమున హాస ♦ మంకురింప
నృపతి కడకంటిచూపుచే ♦ నియ్యకొనియె. 47

47. కడకంటిచూపుచేన్ = కటాక్షదృష్టిచేత. ఇయ్యకొనియెన్=అంగీకరించెను.

క. ఇయ్యకొని యయ్యమాత్యుల
వెయ్యా రుడుగరలొసంగి ♦ వెస విభుఁ డనుపన్
వియ్యము గతి మాళవపతి
లియ్యంబున విని వినిర్మ ♦ లిత హృదయుండై. 48

48. ఉడుగరలు - కట్నములు. లియ్యంబునన్ - సమ్మతచేత.

క. ఆ సమయమున మహీశుఁడు
రైసేయం బనుపఁ గనక ♦ కౌశేయమణి
న్యాస ప్రాసాదంబై
వాసవ పురి నయ్యవంతి ♦ వాదున కొరసెన్. 49

49. రైసేయన్ - అలంకరించుటకు. న్యాస - విస్తారము.

క. మేరువుల తీరు కరుజుల
సౌరు వితాన ప్రతాన ♦ చతుర పతాకా

చారు విపణి గారుడమణి
తోరణ ఘృణి యేమిచెప్ప ♦ దుం బురిలోనన్. 50

50. కురుజూలు - కోటగురుజులు, వితాన - చాదినీలయొక్క.

ఉ. అత్తరి మానసార వసు
ధాధిప చంద్రుఁడు సాంద్ర వైభవో
దాత్తత నేగి యాత్మ పురి
కమ్మగధాధిపుఁ దోడి తెచ్చి త
చ్చిత్తము రంజిలన్ విడిదిఁ
జేసి నిజాప్తులఁ గాంచి యవ్విభుం
బ్రోత్త మనోజుఁ బెండ్లికొడు
కున్ రహిఁ జేయుఁ డటంచుఁ బల్కెనన్. 51

మ. ధవళాంశూజ్జ్వల పీఠిపై నునిచి యం
తం జోడుగాఁ గూడుచున్
ధవళం బింపుగఁ బాడుచున్ జయరమా
దాంపత్య నిశ్శంకునిం
గువలాక్షీ మకరాంకుఁ గుంకుమ నలుం
గుల్ వెట్టుచుం బాయపుం
జవ్వరుం బోడుల పిండు పెండ్లికొడుకుం
జేసెం బ్రమోదంబునన్. 52

52. ధవళంబు - మంగళపుపాట. జయరమా - జయలక్ష్మి తోడ. దాంపత్య - భార్యాభర్తలాటయందు. పాయపు జవ్వరం బోడలు - యౌవనవతులు.

చ. జిలుగు మడుంగు కొంగుఁ గటిఁ
జిక్కఁగ జెక్కి సమంబుగా నిజాం

ఘుళిలు ఘటియించి పెన్నెరుల
గుంపిను వాయఁగ గోరఁ దీర్చి తా
బలితపు తావి నూనెఁ దల
పై నిడి వెంటుకల ల్లుగ్గఁ బెట్టి తో
య్యాలి రతనం బొకర్తు తల
యంటె ధరాతల వజ్రపాణికిన్. 53

53 ఇరువాయు = రెండుపాయలు. ఉగ్గఁబెట్టి = ముడతలు వేసి

క. ఆట గలికి యొకతె గంధపు
టటకలికిం బసిడి గిన్ని ♦ యలఁ బన్నీరం
తటఁ జిలికె యలకవికలత
నటపలికి వసుంధరాధి ♦ నాథున కిడియెన్. 54

54 అటకలికిన్=తలనద్దునట్టి సీకాయపొందలగు పులుసునకు.

చ. ఇల నిజసామ్యవర్తుల ప
యిం దమ వారిఁగదల్పు నాత్మహ
స్త లలిత భర్మ కుంభముల
దంభ మణంపఁగ వంతు వొక య
న్యుల గతి నీవు నీవనుచు
నొంటక గుబ్బలు రాయిడింపఁగా
జలకము దేల్చి రిద్ద రలి
జాల కచాలకచా శిరోమణుల్. 55

చ. ఒకతె లికుచ స్తనీమణి మ
హాశోన్నతిమై జలకంబు వంచ గో

ప్ప కనక పాత్రికం జిలుగు
పావడఁ బెన్నెరులంటఁ జుట్టె నొ
క్క కలికి పెట్టెఁబెట్టిన స
కంచుక మేచక భోగిఁ దెల్పఁగా
నొక వికచాంబుజాక్షి తడి
యొత్తె నృపోత్తము వాళి కత్తఱిన్. 56

56 జిలుగుపావడ = సన్నమైన గాగరా (ఇది బట్టను నుపల క్షణము.) పెట్టె = గుండ్రముగా పాము పరుండుట. మేచక భోగి = నల్లత్రాచు.

చ. ముకుర కపోల యోర్తు నృపు
ముందర దర్పణ ముంచె బంభరీ
చికుర యొకర్తు దీర్చె నెరి
చిక్కు లొకానొక మందహాసయున్
సిక ముడి పూలు జుట్టె నొయిఁ
జేర్చె సువర్ణ సువర్ణ భూషణ
ప్రకర మొకర్తు కుంకుమము
పంకజ గంధి యొకర్తు పూయఁగన్. 57

57 బంభరీ = ఆడుతుమ్మెదలవంటి. సువర్ణ = మంచిరంగుగలస్త్రీ.

క. ఆరతి యిచ్చిరి గుణవతు
లారతి పతిఁ బ్రతికిఁ బెనఁగు నధిపతికిఁ గళా
భారతికి దోరతి మహా
దూర తిరస్కృత విరోధి తుండద్యుతికిన్. 58

58. ప్రతీకిన్ = సామ్యమునకు. కళాభారతికిన్ = విద్యలకు సరస్వతియైనవాఁడు. దోః = భుజములయొక్క. అతిమహః = గొప్పతేజస్సుచేత. దూర = మిక్కిలి. తుండ = ముఖములయొక్క.

ఉ. అంత దినాంత మింత చను
నప్పుడు విప్రుఁడు లగ్న మెంతయుం
జెంతకు నేగుదెంచె నని
చెప్పినఁ బెండ్లి దొరల్ గురుల్ హరుల్
దంతురి తాపపత్ర బిరు
ద ధ్వజ దుందుభి ముఖ్య చిహ్నముల్
వింతలుగాఁగ నేర్పరచి
వేడుకఁ జూపిరి పౌర కోటికిన్. 59

క. పాణవ రవంబు పాటహ
ధాణంధణ్యము మృదంగ ♦ తమ్మర ఢక్కా
శ్రేణి ధ్వని వీరణములు
రాణంబులు భూ నభోంత ♦ రంబులు నిండెన్. 60

60. పాణవ = చిన్నతప్పెటల సంబంధమైన. పాటహ = పెద్దతప్పెటల సంబంధమైన. తమ్మర = తమ్మట. ఢక్కా = ఢమణము. రాణంబులు = ధ్వనులు.

క. కొమ్ముల నినదమ్ములు శం
ఖమ్ముల శబ్దములు సన్న ♦ గాణెల సంరా
వమ్ములు నాగస్వర నా
దమ్ములు నపిరీ రవంబు ♦ దరులం బర్వెన్. 61

61. కొమ్ములు = వంకబూరలు. సన్నగాణెలు = సన్నాయిలు. నాగస్వరములు = ఊదునట్టివాద్యవిశేషములు. నపిరీలు = బూరాలలోభేదము.

క. పంజులును పగలు వత్తుల
పుంజము లాకాశబాణ ♦ ములు చేబిసుల్
పింజామర కోపుల చా
లుం జెలువు వహించె లోఁగ ♦ లోచనములకున్. 62

62. పంజులు= దివిటీలు. పగలువత్తులు = మహతాబువత్తులు. ఆకాశబాణములు=తారాజువ్వలు. చేబిసుల్ = సిసింద్రీలనితోఁచుచున్నది. పింజామరకోపులు=పింజామరవత్తులు.

మ. చెవి కేపానిన పల్కు పల్కు నొక రా
జీవాక్షి పూర్వాద్రిపై
రవికే జోడగు చంద్రకావి రవికెం
రాజిల్లగా బూని వా
సవికే యీడదు రాజుఁ జూచి మఱి పె
చ్చున్ మట్టుగాకున్న నా
రవికే కాదిది యేడదో యని సఖిన్
రారాపుఁ జేసెం గడున్. 63

63. ఏపానిన=ఆనందముఁ గలుగఁజేయు. చెంద్రకావి=సిందూరపు పెరుపుఁదల, మట్టుగాకున్నన్=సరిపడకుండఁగా.

మ. కలకంఠీ మణి సౌధ జాలములఁ గాం
క్షుంజూడ నమ్మక్క చు
క్కల రాజద్దిరకాడుగా సురనదీ
కంజాత మోహాహా పురే
యలఘు స్వర్ణ శిరోగృహైక ముకురం
బంచుం బురీవాసు ల

గ్గలము బందెము వైచి చూచిరపు డా
కాంతా ముఖాంభోజమున్. 64

64. పురే=ఆశ్చర్యార్థమైన యవ్యయము.

శా. రాఁడంటే యదె వువ్వులంగడికిఁజే
రగా వచ్చె సింగారముల్
నేఁడే కావలె నెంత వేగిరమె యిం
తీ కూడిరా నీవె పూ
బోడీ యాతఁడు నిన్నె యన్యులఁ గనం
బోడే పయిన్ వ్రాలకే
వీడే చాటమెమేన నీ వలన పో
పెక్కేటి కంచుం బురిన్. 65

సీ. సెట్టిచేతం గోని ♦ చే తడియారదే
ముక్కెర పదిలమే ♦ ముకుర వదన
యరవుల సొమ్మువా♦రెరువది వళుకింత
యిటుల చే వీచకే ♦ చటులనయన
నీమీఁది చూపె మ ♦ న్నెకొమాళ్ళ కొకవింత
గుట్టుతోనుండవే ♦ కుందరదన
తోఁద్రో పులకును బో ♦ దురకొె యొఱుంగవా
వలపుక త్తియ లుఁట ♦ కలువకంటి

గీ. చెంతకై వచ్చి వీడెంబు ♦ చేతి కిచ్చి
రమణుఁ డనుమాట విన వయో ♦ రాజుఁ జూచి
మగని మరువంగఁ దగునటే ♦ యిగురుబోణి
యనుచు నుత్సవ మీక్షించి ♦ రబ్జముఖులు. 66

66. సెట్టి=నగలమ్మెకోమటి. చేతడియారదు=కొద్ది కాలమయ్యె ననుట. వలుకు=వదులు. గుట్టు=ధైర్యము.

క. అచ్చటి యిరువంకల మే
ల్మచ్చుల పై బాదురీ ♦ మగువల మొగముల్
నిచ్చలపు మేలుకట్లం
గుఱిచ్చిన యద్దంబులని త ♦ గుల్పడు జగముల్. 67

67 మచ్చులు = డాబాలు.

చ. తమతమ యింటిముందటికిఁ
దామర తోరణముల్ ప్రవాళముల్
సుమములుఁ జామరోచ్ఛ్రయము
సోఁగ యరంటులుఁ గట్టి నట్టికా
గుమిఁగొని రాజుఁ జూచు లత
కూనల యంగములుం బుఱే యనుం
భ్రమదము నొంది యారెకుల
బాములఁ జెందక వైశ్యబృందముల్. 68

68 అరెకులు = పట్టణమును గాచువారు.

సీ. పెండ్లికొడుకును నైల ♦ బిలసూనుఁడని చూచి
చిరునవ్వుతో రంభ ♦ సిగ్గు గులుక
కృత శుభ్రదంతి నీ ♦ క్షించిన కంచుకుల్
మన గజంబని మహేం ♦ ద్రునికిఁదెల్ప
హాల్లీసకోల్లాసి ♦ వల్లీ తనులఁ గాంచి
యచ్చరలని వజ్రి ♦ మెచ్చు లోనఁగఁ
జెవిసోకఁ బాడు మా ♦ నవులఁ గిన్నరులని
ధననాథుఁ డొక్క ని ♦ ధాన మొసఁగ

గీ. నగర సౌభాగ్య మీక్షించి ♦ నాక శంక
విబుధ చయ మాత్మసౌధముల్ ♦ వెనుకఁ బోవఁ
బ్రజ విలోకించె నుత్సాహ ♦ పరత రాజ
వాహనేంద్ర వివాహ స ♦ న్నాహ మపుడు. 69

69 ఐలబిలసూనుఁడు = కుబేరుని కొడుకైన నలకూబరుఁడు. హల్లీసక = మండలాకార నాట్యమందు, వల్లీతనులన్ = స్త్రీలను.

మ. కటకంబుల్ గల యుత్కట ద్విపఘటల్
ఘంటాపద ప్రస్ఫుట
త్కటకంబుల్ మొరయంగ జక్కదన వా
ద్య ధ్వాన శ క్తిన్ మహా
కటకంబుల్ ప్రతినాద మీన విభవో
త్కంఠల్ దిశాభూమి భృ
త్కటకంబుల్ గనరాఁగ రాజు చనియెం
దన్మందిరాళిందమున్. 70

70 కటకంబుల్ గల = దంతపుకట్లుగల. ఘటల్ = సమూహములు. ఘంటా = ఘంటలును. పద ప్రస్ఫుటత్ = పాదములయందు స్ఫుటముగానున్న. కటకంబుల్ = కడియములు. మహాకటకంబుల్ = గొప్ప కొండచరియలు. విభవోత్కంఠల్ = వైభవముచేతనైన వేడుకలు. దిశా...కంబుల్ = దిక్కులయందైన రాజుల పట్టణములు. లక్షణచేఁ బట్టణములందలి జనులు. అళిందము = ద్వారప్రాంతము.

వ. అంత నచ్చట. 71

క. అల మాళవ మేచక కచ
కెలమిం దలయంటి యటక ♦ లిడి పన్నీటం
జలకంబారిచి వలువం
జెలువుగఁ దడియొత్తి హత్తి ♦ శిర సార్చి తగన్. 72

సీ. జవ్వాది పదనిచ్చి ♦ చందురా దువ్వెన
మువ్వ సాపిటఁదీర్చి ♦ తురుముఁ జేర్చి
ముడిపూలు జుట్టి కెం ♦ పుల బొట్టు సవరించి
చెవుల ముత్తెపు పువ్వు ♦ లవణుపరచి
తళుకు వజ్రపు డాలు ♦ బెళుకు కమ్మలమర్చి
యరిది నీలంపు ము ♦ క్కెరఘటించి
గొప్ప మేల్కట్టాణి ♦ కుతికంటుతోఁ గూడ
జాతి పచ్చల బన్న ♦ సరము నిల్పి
గీ. సందె దండల దండఁబొం ♦ జాతిమొగ్గ
లుంచి చెంగావి నెరికపై ♦ వాంచికూర్చి
యంఘ్రి కటకంబు రవ మట్టె ♦ యలును బెట్టి
సఖులు దెచ్చిరి సతిఁ బెండ్లి ♦ చవికె కపుడు. 7

72 చందురాదువ్వెన = చంద్రకాంత మాణిక్యపు వన్నె. కమ్మలు = కర్ణపువ్వులు, ముక్కెర = అడ్డబాస. కట్టాణి = మిక్కిలి ప్రశస్తమైన. బన్నసరము = హారవిశేషము. సందెదండలు = దండకడియములు. పొంజాతిమొగ్గలు = బంగారపు జాజిమొగ్గలు. చెంగావి= ఎఱ్ఱబట్ట. నెరిక = గాగరా.

సీ. అట మున్నె వాకిటి ♦ కరుదెంచి ముద దంతి
డిగ్గి పాదములపై ♦ మొగ్గి నట్టి
రాజహంసునిఁ బట్టె ♦ నోజ మాళవ భర్త
యెత్తి దీవించి కే ♦ లిగురు వట్టి
ఘనత రాభ్యంతరా ♦ గారంబునకుఁ దోడు
కొని పోవు వేళ భా ♦ మినులొసంగు
నీరాజ నాద్యుప ♦ చారముల్ గైకొని
ద్వార భూములల శుభా ♦ ర్ణముగ నిడిన

గీ. పూర్ణ ఘట దర్పణములు సౌ ♦ వర్ణ చేల
చమర వాల వితాన జా ♦ లములు గనుచు
మామ యనుమతి మగధరా ♦ ణ్మణి వివాహ
వేదికా పీఠిపై నుండె ♦ విభవమెసఁగ. 73

73. కేలిగురు = చిగురువంటి హస్తము. చమరవాల = వింజామరలు.

క. మధురతిపతి మధురంజిత
మధురత్వ విలాస ఖనికి ♦ మగధేంద్రునకున్
మధుమధన భజన ధనునికి
మధుపర్కం బప్పు డొసగ ♦ మామ యొసంగెన్. 74

74. మధురతిపతి = వసంతమన్మథులయొక్క. మధు=రుచిచేత మధురత్వ = సౌందర్యమునకున్ను, మధుమధన = విష్ణువుయొక్క. భజన = సేవ. ధనునికిన్ = ధనముగాగల.

మ. జననాథాగ్రణి థారవోసె మగధ
క్ష్మాభర్తకుం బుత్త్రికం
దనచుట్టంబులు ప్రాలపుట్టికల మ
ధ్యక్షోణి నేపథ్య శా
టి నటించన్ మగ ధాధినాథుని వధూ
టిం డాయఁగాఁ జేసినం
గని రన్యోన్యకటాక్ష సూక్ష్మతను వీ
క్షాపర్వమై యిర్వురున్. 75

75. ప్రాలపుట్టికల = తలబ్రాలబుట్టలయొక్క. నేపథ్యశాటి= తెరబట్ట.

మ. వలిగుబ్బల్ వెలిగుబ్బఁ గుప్పసముఁ దో
వం గక్షు కాంతుల్ దటి
త్కులముం దోరణఁగట్టఁ గల్వగమిచూ
డ్కుల్ చుట్టిరా నేర్మికిం
దళుకుం గంకణముల్ ఝణంఝణ నినా
దం బెత్తఁ గొమ్మొత్తెపుం
దలఁబ్రాల్ జేరిచె మత్తకాశిని నృపో
త్తంసో త్తమాంగంబునన్. 76

76. కుప్పసమున్ = రవికెను. కక్షు = భుజమూలములయొక్క. నేర్మికిన్ = నేర్పునకు. మత్తకాశిని = అవంతి. ఉత్తమాంగంబునన్ = తలయందు.

క. జలజాక్షి చేర్చు తలఁబ్రాల్
జనపతి మూర్ధమున నుండి ♦ జల్లున రాలెం
దన తలఁ గర మీఁడ మును తల
మునుకల యగు మదన బాణ♦ములు జారు క్రియన్. 77

77. కరమిడన్ = అవంతి. నీకుభయములేదని హస్తముంచఁగాఁ.

శా. కట్టె న్మంగళసూత్ర మబ్జకులరా
డ్గంధేభమాపూర్ణిమా
నిట్టీకోదుముఖీ వతంస కలకం
ఠీ కంఠ పీఠం బికీ
కుట్టాక ధ్వని పుష్పదామ బిసదం
గుందాభహారక్ లగ
ద్ఘోట్టాణక మృగీమదక్ స్మరకరా
ఘుదాంబుజ దావికక్. 78

77. పూర్ణిమానిట్=పున్నమనాఁటిరాత్రియందు. టీక = సంచరించుచున్న. ఇందు=చంద్రునివంటి=ముఖీ=ముఖముగలస్త్రీలకు, వతంస=అలంకారమైన. పికీ=ఆడుకోయిలను. కుట్టాక=లెంపదెబ్బలుగొట్టుచున్న ధ్వని = స్వరముగలదియైన. పుష్పదామ = పువ్వులదండయనెడు. బిరుదన్ = బిరుదుగల. ఘోట్టాణ = దేశవిశేషమందలి. ఏక = ముఖ్యముగు. మృగీమదన్ = కస్తూరిగలిగిన. స్మరకర = మన్మథహస్తమందలి. అక్షుద్ర = శ్రేష్ఠమైన. అంబుజ = శంఖమునకు, ద్రావికన్ = పారిపోవునట్టుగాఁ జేయునట్టి. (పికీత్యాది కంఠమునకు విశేషణములు.)

గీ. హోమ ధూమంబుచే రక్త ♦ యుక్త నేత్రుఁ
డగుచు నృపుఁడొప్పె నంతజా ♦ యా శిరోజ
బంధమున కుల్కెడు పయోద ♦ పఙ్క్తిఁబోద్రి
సేయు పొగమీఁదఁ గన్నెఱ్ఱఁ ♦ జేసె ననఁగ. 79

79 బోద్రిదిసేయు (లక్షణచే) పుట్టించుచున్న.

సీ. మేలుకుళ్ళాయితో ♦ డాలొందు ముత్యాల
బాసికంబు లలాట ♦ పట్టిఁ బెరయఁ
గరకంకణంబుతోఁ ♦ గంబళ తంతు సం
యుత హరిద్రాకంద ♦ మొరపు నెరప
కట్టాణి పూసల ♦ కంఠమాలికలతోఁ
బిత్తరి పిరిదండ ♦ తత్తరింప
గటి తటీ హాటక ♦ పటముతోఁ బచ్చ చె
రంగు వల్పెపు దోవి ♦ రంగు నిలుపఁ
గీ. దలపఁ బొలుపారె జోకనా ♦ ధరణి నాథ
పాక మదభేది స్థాపిక ♦ పాకవేళఁ
గాకలీ నైకలీలాక ♦ లాక లీన
తాన మానోన్నతుల సతుల్ ♦ ధవళ మనఁగ. 80

80. హారిద్రాకందము = పసపుదుంప. పచ్చచెరంగు = పచ్చనియంచుగల. వల్పెపుదోవి = సన్నబట్ట. ధరణినాథ,పాకమద భేది = రాజేంద్రునియొక్క. కాకలీ = సూక్ష్మమధురధ్వనియొక్క నైకలీలా = అనేకవిలాసములయొక్క. కలాక = విద్యలుగల. లీన = అణఁగిన, తాన - స్వరవిశేషముయొక్క. మాన = ప్రమాణము యొక్క.

సీ. సకలాగమజ్ఞకా ♦ వ్య కళానిధుల్ వసు
  వ్రజము గాంచిరి ముహూ ♦ ర్తంబునాఁడు
గ్రంథత్రయీ విధుల్ ♦ ఘన సువర్ణక్రమా
  భ్యున్నతిఁ గనిరి పా ♦ కెన్ననాఁడు
బంధువుల్ కాంచనాం ♦ బరములు చదివించి
  వన్నెఁ జెందిరి నాగ ♦ వల్లినాఁడు
యాజ్ఞికుల్ దక్షిణ ♦ లర్పింప రాజు నై
  రల్లసద్గతిఁ గంబ ♦ వల్లినాఁడు
గీ. ఆర్య లయ్యారె యనిరి పుం ♦ ఖానుపుంఖ
  జవనకంఖాణరవశంఖ ♦ సంఘ ఘుంఘు
మంఘుమ ద్విషఘంటా ఘ ♦ ణం ఘణాది
  భిన్న భూభృద్బిల బేగుఁ ♦ బెళ్ళినాఁడు. 81

81. వసువ్రజము = ధనసమూహము. గ్రంథత్రయీ = వేద -శాస్త్ర శ్రౌతములు. కంబవల్లి = వివాహాంతదినమందుఁజేయు స్తంభపూజ. పుంఖానుపుంఖ = ఎడతెరపిలేని. జవన = వేగము గల. కంఖాణ = గుఱ్ఱములయొక్క. ఏగుఁబెళ్ళి = ఊరేగింపు -ఉత్సవము.

క. యశోధ్యక్షుఁడు వింశతి
  లక్షల కమ్మైన ప్రదక్షి ♦ లక్షణ రూక్ష

స్సక్షత్ర కంఠమాలిక
లక్షోణీ భర్త యవ్వ ♦ డల్లున కొసంగెన్. 82

82. ప్రశస్త = మిక్కిలి సమర్థములైన. లక్షణ = చిహ్నములచేత. రూక్షన్ = అతిశయించిన, నక్షత్రకంఠమాలిక = ఇరువదియేడు ముత్యములుగల మాలిక.

గీ. కొండ్రఁ వేల్పండు పంటల ♦ కును కొటార్లు
పాడి ప్రేపల్లెలెల్ల సం ♦ పదల యిండ్లు
స్వర్గ ఖండంబులగు గ్రామ ♦ వర్గకములు
వసుమతీభర్త పసపున ♦ కొసంగె సుతకు. 83

83. కొండ్ర = దున్నునపుడేర్పరచిన భాగము. కొండ్రను చేయిచొప్పున పండునట్టివి.

మ. నును బంగారపు చెక్కడంపు సొబగు
లూన్నలొల్కన్న దంతంపు దే
వ నటీ కోటి ఘటిల్లుపార్శ్వఫలక
ద్వంద్వంబుతో జాళువా
పని చూపట్టిన పట్టుబట్ట తెరతో
ఇల్ముత్యపుం గుచ్చు లొం
దిన పన్నాగముతోఁ జెలంగు నృప పు
త్రీ పల్లకిం బొల్చుచున్. 84

84. దేవనటీ = అప్సరస్త్రీలయొక్క. పన్నాగము = పల్లకీ దండె.

శా. చేటీకోటి కటీ తటీ పట సమా
శ్లిష్ట స్ఫుట ద్వీటికా

చేటీ హస్త కలాచికా వ్యజనముల్
పెంపార నేతేరఁగా
శాటీ భూషణ పేటికా కనక చం
చన్మంచపాటీర ధా
ర్వాటీకంబుల మాగధుండు నిజగే
హంబుం బ్రవేశింపుచున్. 85

85. చేటీకోటి=దాసీసమూహము. కటీ తటీ పటసమాశ్లిష్ట = ఒడియందుంచఁబడిన. పేటికాపేటీ - పాందానులు. కలాచికా - తమ్మపడిగ. ఆటీకంబునన్ - అతిశయముచేత.

సీ. పగడంపు ముక్కులఁ ♦ బచ్చ రెక్కల నిక్క
చిలుకల మదనచే ♦ తుల ఘటిల్లు
పటికంపు గుండు గం ♦ బము తళత్తళ రుచుల్
దరిఁజేర్చు దంతంపు ♦ దంతె లింపు
పొసఁగు రాజావర్త ♦ పుం బారువములకు
బొంచు వైదూర్యంబు ♦ మించు గన్న
మగఱా గొనబు వెల్లి ♦ నిగనిగల్ గనుపట్టు
పగచుట్టుఁ జుట్టుఁ బ ♦ వంతిలోనఁ
గీ. పద్మరాగంపు బోదెల ♦ పడక టొంటి
సన్న సున్నంపుఁ దిన్నియ ♦ చందుచుట్టు
మెట్టుకల నీలపుం గేలు ♦ మొకము దోయి
పరఁగి యొప్పారు గొప్ప యు ♦ ప్పరిగ కరిగి. 86

86. మదనచేతులు - మిద్దెకడ్డీలు. గుండుబంగరము - గుండ్రముగానున్న స్తంభము. దంతెలు - స్తంభపీఠములు. రాజావర్తము - మణివిశేషము. పారువములు - పావురములు. పొంచు - పట్టుకొనుటకుఁ గాచియున్న. వైదూర్యంబుమించు - వైదూర్యకాంతిగల.

కన్ను - నేత్రములుగల పిల్లి. బవంతి - రాజగృహము. బోదెలు - అరుగులు. మెట్టుకలు - మెట్లు. కేలుమెకము - ఏనుఁగులయొక్క. దోయి - జోడు. ఉప్పరిగ - చప్పరము.

సీ. పసిమి బంగరు తీగె ♦ పచులచేఁ దీరిన
తావు సూర్యపటంబు ♦ దగు కురాళ
మింత పైకెక్కిన ♦ యెకరంగి పరుపలు
పైకుంకుమ పుటంబు ♦ పటపుదోయి
మురువొప్ప గొప్ప చ ♦ ప్పర కోళ్ళ మంచంబు
వలప్రక్క వక్కలా ♦ కులుఁ జెలంగ
జాళువా జలపోత ♦ జాలవల్లిక తూర్పు
చెంగటఁ గొరలు ప ♦ రంగిపీట
గీ, దఁడ జముకాణమునఁ జేర్చు ♦ దండెయును బ
సిండి బురుసా మిసిమి గవి ♦ సెన సడలుచు
నిద్దపు విపంచియును నిల్వ ♦ టద్ద మమర
ఒడకయిలుజొచ్చె నప్పు డ ♦ ప్పూసమితేఁడు. 87

87. సూర్యపటము = మేలుతరమైన మొకముఖ. కురాళము చప్పరము. ఎకరంగి - చిత్రపు రంగుగలది. పరుపలు - పరుపుదగ్గలు. చప్పరకోళ్ళు - తరుమణికోళ్ళు. జలపోత - మలామా. జాలవల్లిక తమలపాకులతట్ట. పరంగిపీట - హూణదేశపుపీట. జముకాణము — జంబుఖానా. దండె - కిన్నెర. బురుసా - ఎల్లిపట్టు గవిసెః - గుడ్డ తొడుగు. విపంచి - వీణ.

క. అచ్చటి కయ్యెడ వచ్చిన
నెచ్చెలు లచ్చెలువఁ దెచ్చి ♦ నృపుతోఁ జదురుల్
పచ్చిగ నాడుచుఁ బాడుచు
మచ్చిక నొక రొకరె పనుల ♦ మరుగున జరుగన్. 88

88. చదురుల్ - చతురవాక్యములు.

క. పడఁతుల వెంటనె ప్రియసతి
వడిఁ జనఁ బడవైవఁ గాఁగ ♦ వాటము సందిం
బడి యొక్కతె జడ జిక్కం
గడు విభు నెద నాటు మదన ♦ ఖడ్గముఁ బోలెన్. 89

క. రమణీరత్నం బయ్యెడ
రమణుఁడు చేయంటి లాఁగ ♦ రాకమణి స్తం
భము వట్టి పెనఁగి తరువ
ల్లిమతల్లిక చెల్వొనఁ గద ♦ లెను దమకమునన్. 90

మ. కులుకుం దోరపు గుబ్బలంటుదునొ త
ళ్కుం బెన్నెరుల్ వట్టి కెం
దలిరుం దేనియ మోవి యానుదునొ యం
దంపుం దనూవల్లికన్
సొలయం గౌఁగిటఁ జేర్తునో కనుగవం
జుంబింతునో యంచు నిం
చొలయన్ రాజు మనం బపూర్వ కృతి కి
ట్లుఁజ్జాత లోఁగెం గడున్. 91

క. ధరణీరమణుఁడు పయ్యెద
సరవిం గొని తివియ మగువ ♦ స్వస్తిక బంధో
ద్ధుర బాహాంతర యగుచో
స్మర సంగరమునకు మల్ల ♦ చరుచుటఁ దెల్పెన్. 92

92. స్వస్తికబంధ - చేతులొండొంటితో దండచేతులు బట్టుట. బాహా - భుజములయొక్క, స్మరసంగరమునకున్ - మన్మథ

యుద్ధమునకు. మల్లపంచుట - ఎడమచెయ్యి బిగ్గకునంచి కుడి చేతితో దండమైఁజరచుట.

సీ. ప్రార్థనా దృతవధూ ♦ వదన ఖండిత నాగ
వల్లీ దళార్ధ చ ♦ ర్వణ చణుండు
ఘనహార మణి పరీ ♦ క్షా మిషాంబును హేక్షు
ణా పయోధర బోధ ♦ నక్షముండు
తరుణీ మణీ కారి ♦ త స్వాంగ పరిరంభ
ణౌద్ధత్య కృచ్ఛివ ♦ దాంకపాళి
ఘనసార వీటికా ♦ గంధ గ్రహణ దంభ
మాని న్యధర సుధా ♦ పాన రతుఁడు
గీ. కాంచికా స్థల వైకృత్య ♦ గళన కటక
యవతి నీవి విమోచనో ♦ ద్యుక్తుఁడగుచు
నవరతానందుఁడైన మా ♦ నవ పతీంద్రుఁ
డాతఁ డనవరతానందుఁ ♦ డయ్యె నపుడు. 93

93. ప్రార్థనా - బ్రతిమాలుకొనుటచేత. అదృత - అదరించఁబడిన. వధూ - అవాలియొక్క, వదన - ముఖముచేత. ఖండిత - కొరకఁబడిన. నాగవల్లీదళ - తమలపాకుయొక్క. అర్ధ - ముక్కయొక్క. చర్వణచణుండు - నమలుటతోఁ గూడినవాఁడు. కారిత చేయించఁబడిన. స్వాంగపరిరంభణౌద్ధత్యకృత్ - తన శరీరాలింగనమందలి దురుసుతనమును జేయునట్టి, శివద - సుఖమునిచ్చునట్టి. అంకపాళి - ఆలింగనముగలవాఁడు. కాంచికా - మొలనూలుయొక్క. (అనఁగా నొడ్డాణముయొక్క.) స్థలవైకృత్య - స్థలభేదముచేత. గళన - జాఱుటగల. కటక - పిరుఁదుగల. నవరత - నూతనసంభోగమందు. - అనవరత - ఎడతెగని.

చ. తిలకినిభ రక్తదెల్పఁ జవిఁ
దేలి రతిం బతిఁ బూరుషాకృతిం

గలసెం గరాబ్జ కృత్య కృత
కంకణ ఝుంఝుణ నిక్వణాంకమై
గలదల కాంచితాళికము
ఘర్మ కణమ్ములు గ్రమ్మెనెం గళల్
దళముగ రా నసర్గళ గ
ళధ్వను లగ్గల మగ్గడింపుచున్. 94

94. గలదలక - జారుచున్న ముంగురులచేత - అంచిత - ఒప్పుచున్న. అళికము - లలాటము, అగ్గలము - అతిశయముగా. ఉగ్గడింపుచున్ - పలుకుచు.

శా. కించి త్కుంచిత నేత్రకోణము రణ
ద్గ్రీవంబు కూజత్కన
త్కాంచీకంబు నటత్కటీరము గళ
ద్ధమ్మిల్లమాస్యోల్లస
చ్చంచద్ఘర్మము పాణిస క్తపతికే
శంబన్య హాస్తక్రియా
ప్రాంచ త్కంకణ నిక్వణం బలరుఁ బుం
భావ్యంబు సంభావ్యమై. 95

95. కించిత్కుంచిత - కొంచెము ముణచఁబడిన. రణత్ — ధ్వనిచేయుచున్న. గ్రీవంబు - కంఠముగలది. కూజత్ - ధ్వనించుచున్న. కసత్ - ప్రకాశించుచున్న. కాంచీకంబు - ఒడ్డాణముగలది. నటత్ - కదలుచున్న. కటీరము - పిరుదుగలది. గళత్ - జారుచున్న ధమ్మిల్లము - కొప్పుగలది. ఆస్యోల్లసత్ = ముఖమందుఁ బ్రకాశించుచున్న, చంచత్ - అతిశయించుచున్న. ఘర్మము - చెమటగలది. పుంభావ్యంబు - పురుషాయితము. సంభావ్యమై గౌరవించఁదగినదియై.

సీ. గిలిగింతఁ జనుగుబ్బ ♦ లలమనీవి వధూటి
యెదనాని కుచపాళి ♦ నదమ నేర్చె
మోవిపై మొగమాని ♦ ముదిత వీడెపు వీడు
తోడు దంతక్షతో ♦ ద్ధురత నేర్చె
నెలవంక శంకఁ బైఁ ♦ బలువంకఁ జనుజోటి
కొనగోర నిక్కువల్ ♦ చెనక నేర్చె
రతికూరు సంయుక్తి ♦ తతిఁ బెనంగు లతాంగి
పుంభావ బహుబంధ ♦ పూర్తి నేర్చె
గీ. మణిత రవ మప్డుఁ జెవియాని ♦ మధురవాణి
కలరవారవ కలకల ♦ గళరవముల
గాఢరతిఁ బతిఁ దేల్పన ♦ వోఢతాని
రూఢి దిగనాడి సమయ వా ♦ క్ప్రౌఢి దనరి. 96

96. గిలిగింతన్ = కితకితలచేతను, అదమన్ = నొక్కుటకు. వీడెపువీడు = తాంబూలమిచ్చుట. నెలవంక శంకన్ = నఖక్షతభయము చేత. పలువంకన్ = అనేకదిక్కులకు. జోటి = స్త్రీ. ఇక్కువలు = కళాస్థానములు. ఊరు = తొడయొక్క. సంయుక్తి=కలియుటయొక్క. తతిన్ = సమయమందు. పెనంగు = పెనఁగులాడునట్టి మణిత రవము= సంభోగకాలమందుఁ గంఠమందుఁబుట్టు చప్పుడు. కలరవ=పావురముల యొక్క. నవోఢతా = క్రొత్తగా వివాహమౌటయొక్క. దిగనాడి=విడచి పెట్టి. సమయవాక్=సమయోచితములగుయుక్తులయందు. ప్రౌఢిన్= నేర్పుచేత.

సీ. అపుడింపు కపురంపు ♦ విపులంపు దిన్నెలఁ
జలిగుప్పు లలినొప్పు ♦ చప్పరములఁ
దలకట్టు వెలవెట్టు ♦ నెలచట్టు చవికెలఁ
బారావతారావ ♦ భవన మనుల

శుకపోత నికరేత ♦ శికతాతలంబుల
ఘనమహా వనరుహా ♦ కరతలములఁ
సమరందతమ కుంద ♦ సుమ బృంద కుంజాళి
గతభాద్రి కృతకాద్రి ♦ కందరముల
గీ. స్తోత్ర బల పాత్ర జలసూత్రి ♦ గోత్రి సదలి
కదలికలఁ బొల్చు కదలికా ♦ గమనవాటి
భాసురములైన నైదాఘ ♦ వాసరముల
మగువతోఁగూడఁ గ్రీడించె ♦ మగధ నృపతి. 97

97. విపులంపు = విస్తారములగు. గుప్పు=విసరునట్టి. చప్పరములన్=పందిరులయందు. తలకట్టు=ముఖ్యమైన. వెలవెట్టు=ఖరీదుపెట్టునట్టి. నెలచట్టు = చంద్రకాంతములయొక్క. చవికెలన్=చిన్నయిండ్లయందు. పారావత=పావురములయొక్క. శుకపోత=చిలుకపిల్లలయొక్క. నికర=సమూహముచేత. ఇత = పొందఁబడిన. వనరుహ=పద్మములకు. ఆకర = స్థానములైన. సమరందతమ=మిక్కిలి మకరందములతోఁగూడిన. కుంద సుమ = మల్లెపువ్వులయొక్క. బృంద = సమూహముగల. కుంజాళి = పొదలపఙ్క్తిని. గత = పొందిన. భా = శోభతోఁగూడిన అద్రి = చెట్లుగల.కృతకాద్రి=కృత్రిమపర్వతములయొక్క. కందరములన్=గుహలయందు. స్తోత్రి=పొగడికయొక్క. బల = అతిశయమునకు. పాత్రి=అర్హములైన. జలసూత్ర = నీటినాళములుగల. గోత్రి = పర్వతములయందైన. సత్ = యోగ్యములైన. అలి=తుమ్మెదలుగల. కదలికలన్=అరటిచెట్లచేత. కదలికా=లేళ్లలోని భేదములయొక్క. గమన=సంచారముగల. వాటిన్=వృక్షముల, ఆవరణయందు. నైదాఘ = గ్రీష్మర్తు సంబంధమైన.

క. ఆసవి సుమ వసదలి తతి
వాస విఘన ఫల రసాల ♦ వాస వి గహన

వ్యాస విదాహన వాసవి
వేసని తానంత జెలఁగె ♦ వే సవిజయుమై. 98

98. ఆసవి = మకరందములుగల. సుమ = పుష్పములయందు. వసత్ = ఉంచున్న. అలి తతి = తుమ్మెదగుంపుయొక్క. వాస=నివాసముగల. విఘన = మిక్కిలిగొప్పవైన. ఫలములుగల. రసాల = తియ్యమామిడిచెట్లయందు. వాస = నివాసముగల. వి=పక్షులుగల. గహన - అరణ్యముయొక్క. వ్యాస - విస్తారముయొక్క, విదాహన - దహింపఁజేయుటయందు, వాసవి - అర్జునుఁడైన. (ఇతఁడు ఖాండవవనముఁగాల్పించెను.) వే - త్వరగా. సవిజయుమై - జయముతోఁగూడినవాఁడై.

క. పెటపెటపెట గాసెన్ రవి
పటపటపటమనుచు గిరులు ♦ పగిలెన్ రగిలెం
జిటచిట చిటమనుచున్ వని
గిటగిట గిటమనుచు జనము ♦ కృశియించె సెగన్. 99

99. కాసెన్ - ఎండఁగాసెను. రగిలెన్ - కాలెను.

గీ. ఏమిచెప్పెద నయ్యెండ ♦ దామరస భ
వాండభాండంబులెల్ల ను ♦ ద్దండసాల
జాలక ప్రాశన కరాళ ♦ కీల గ్రాల
గుమ్మరావము కరణి జ ♦ గమ్ము దొరసె. 100

100 ఉద్దండ - అతిశయించిన. సాల - చెట్లయొక్క. జాలక - సమూహముయొక్క. ప్రాశన - తినుటచేత. కరాళ - భయంకరమైన. కీలన్ - అగ్నిజ్వాలచేత.

సీ. సికతాతలాధ్వగుల్ ♦ తెకతెక నడుగింట
దుప్పట్లుద్రొక్కి పా ♦ దుకలు దలఁప
వెసఁ బాదుకాధ్వన్యు ♦ లిసుము లూష్మములునిండ
నిట్లటువిడఁదన్ని ♦ యిల్లుగోర

నిలుచేరు నధ్వనీ ♦ నులు పెల్లువడచల్లఁ
జల్లని గుజ్జుమా ♦ మిళ్ళుగోర
గుజ్జు మామిడిమోకఁ ♦ గూర్చుపాంథులు చూత
పటలికిఁ జలువ చ ♦ ప్పరము లనఁగఁ
గీ. జప్పరంబుల పథికాళి ♦ యప్పుడెల్ల
చాయ పన్నిటి కాల్వ కా ♦ సలు ఘటింప
జంట వడ గుప్పెఁ బంకకా ♦ సారమగ్న
కాసరములైన నైదాఘ ♦ వాసరములు. 101

101 సికతాతలాధ్వగుల్ - ఇసుకనేలత్రోవనడచువారు. పాదుకాధ్వన్యులు - చెప్పులతోడఁగినమార్గస్థులు. ఊద్పులు-చెప్పులు అధ్వనీనులు - మార్గస్థులు. జంటవడ - జమిలివేడిగాలి. పంకకాసారబురదగలమడుగులయందు. మగ్న - మునిఁగిన. కాసారములు - దున్నపోతులుగలవి.

సీ. గతిచెడు రాయంచ ♦ గలఁగించి క్రౌంచాద్రి
కంచి మయూరి మ ♦ న్నించు కించు
మేల్జూపు జిగిమించు ♦ మించుశాఖాళిం బు
ట్టించి నెత్తమ్ముల ♦ నొంచుదంటఁ
చలువఁజల్లి కదంబ ♦ ములకుఁదావియొసంగు
తేట మైదీగనం ♦ దిన మిటారి
గేదంగిక్రొవ్విరుల్ ♦జాదిక్రొన్ననచాలు
నెరివేణిభరియించి ♦ మెరయుమేటి
గీ. ఇంద్రగోపంబు పరపుల ♦ నెరయుజాణ
గురుపయోధరపాళియం ♦ బరములోనఁ

దళుకు గులుకంగఁ దగువర్ష ♦ దగిలె నేని
యడుగిడఁగ నీదు నిజపురీ ♦ యాత్రికనుచు. 102

102 ఈపద్యమందు స్త్రీయొక్కతె ధ్వనించుచున్నది. వర్షాకాలమందు హంసలు క్రౌంచపర్వతరంధ్రములోనుంచి మానససరస్సునకుఁబోవునని ప్రసిద్ధి. నడకచేత హంసను జయించినదనియును. కించు - పట్టుపిలకలది. మేల్మాపు - శోభనుబుట్టించునట్టి. జిగిన్ - తళుకుచేత - మేలైనమాపుల నెడు శోభచేత, నొప్పుచున్న తళుకుగల బాణపఙ్క్తిని బుట్టించి పద్మములను జయించినదనియును. కదంబములకున్ - కడిమిట్లకు. చలువకలిగినట్టియు, ననేక పరిమళద్రవ్యములుగల మైపూఁతకుఁ - పరిమళముఁగలిగించు శరీరముగలదియనియును. గేదంగిక్రొవ్విరుల్ - మొగలిపువ్వులు. జాదిక్రొన్ననలు - జాతిపువ్వులు. వేణి - జలప్రవాహము అర్థాంతరము స్పష్టము. పరపులన్ - విశాలస్థలములయందు. ఎరయు - ఎఱుపెక్కిన, ఎఱ్ఱని పరపుమీఁదఁబరుండునది యనియును. పయోధరపాళి = మేఘపఙ్క్తి, అంబరములోనన్ = ఆకాశములోన. గొప్ప కుచప్రదేశము పైటబట్టలోఁ బ్రకాశించునది యనియును. వర్ష = వర్షర్తువు. ఇది నిత్యబహువచనమైనను ధ్వన్యర్థానురోధముచే నేకవచనముగాఁ బ్రయోగింపఁబడినది. స్త్రీలింగమువల్ల నొకస్త్రీయనియును. అడుగిడఁగనీదు = నీటివల్లను బాడివల్లను ప్రయాణము సాగనీదు. స్త్రీ లభించిన యెడల విడచిపోవుటకుఁ గాలు సాఁగనీదనియును.

శా. అంభోధిప్రియసంభవాన్వయుఁడతం
డత్యుగ్రుఁడంతం జయ
స్తంభం బుత్తరవార్ధి నిల్పి నిజకాం
తాసైన్య సంయుక్తుఁడై
జంభారి క్రియఁ జేరి యాత్మపురి ని
చ్చల్ దల్లిదండ్రుల్ ప్రజల్

సంభూషింప సమస్తరాజ్యపదవీ
సౌఖ్యంబుఁ జెందెం దగన్. 103

103 అంభోధి ప్రియసంభవ = సముద్రుని యిష్టపుత్రుఁడైన చంద్రునియొక్క. అన్వయుఁడు = వంశముగలవాఁడు. జంభారి క్రియన్ = ఇంద్రునివలె.

ఆశ్వాసాంతము

శా. ఆధి వ్యాధి విరోధి కీర్తన తరం
గాధారగాధా రమా
స్వాధీన స్తుతి ధీర వాగమృతధా
రా ధార రాధా రసీ
కాధైర్య చ్యుతి కృద్ధృతీ క్షత మహీ
యోధార యోధారథీ
మాధుర్య స్తవ యుక్త రంగపురసీ
మా ధారమాధారకా. 104

104 ఆధి = మనోవ్యధకును. వ్యాధి = రోగమునకును. విరోధి = పోఁగొట్టునట్టి, కీర్తనతరంగ = తరంగములవంటి స్తోత్రములకు. ఆధార = ఆధారమైనవాఁడా. గాధారమా = ప్రతిష్ఠాలక్ష్మికి. స్వాధీన = స్వాధీనమైన. స్తుతి = స్తోత్రముగల. ధీర - విద్వాంసుల యొక్క, వాక్యామృతధారను ధరించువాఁడా, రాధా - రాధాదేవి యొక్క. రసీకాః - మిక్కిలి రసముగల. ధైర్యముయొక్క. జారడ మును జేయునట్టి సంతోషముగలవాఁడా. క్షత - కొట్టఁబడిన. మహీయః - మిక్కిలి విస్తారమైన. ధార - కత్తియంచులుగల. యోధా -

రోాథులుగలవాఁడా. రథీ - రథికుఁడైనవాఁడా, మా - జయలక్ష్మి యొక్క. ధుర్య - భారమునువహించిన. స్తవ - స్తోత్రిముతోడ. యుక్తకూడినవాఁడా. రంగపురసీమా - శ్రీరంగస్థలము. ఆధార - నివాసముగలవాఁడా. మా - లక్ష్మిని. ధారకా - ధరించినవాఁడా.

క. అలమేల్మంగాపాంగా
చలచంచచ్చంచలాభి ♦ జనన సముద్య
త్కలికాశ్రు వర్ష హర్షిత
పులకాంకుర సస్య కృష్ణ ♦ భూ సదృశాంగా. 105

105. అలమేల్మంగయొక్క- అపాంగ - క్రేఁగంటిచూపనెడు. అచల - అంతటను గదులుచున్న. చంచత్ - ప్రకాశించుచున్న. చంచలా - మెఱుపుయొక్క. అభిజనన - పుట్టువుచేత. సముద్యత్ - పుట్టుచున్న. కలికా - మొగ్గలవంటి; అశ్రు - ఆనందబాష్పములయొక్క. వర్షముచేత. హర్షిత - గగుర్పాడిచిన. పులకాంకురములనెడు, సస్య - చేనికి. కృష్ణభూసదృశ - నల్లనేలతో సమానమైన. అంగా - శరీరముగలవాఁడా.

పృథ్వీవృత్తము.

ధరాధరధనుర్ధను ♦ ర్దళనలబ్ధసీతారుణా
ధరాధరధరాధరా ♦ ధరణధన్యబాహావితా
పరాధరహితాఖిల ♦ ప్రభలభూసురాగ్రేసరా
సరాధరవినందనాం ♦ చలవిహారపారాయణా 106

106. ధరాధర - పర్వతమే ధనుః = విల్లుగల శివునియొక్క ధనుః-వింటియొక్క. దళన-విరచుటచేత. లబ్ధ - పొందఁబడిన. సీతా-సీతాదేవి యనునట్టి. అరుణాధర - స్త్రీగలవాఁడా, ధరధరా - గోవర్ధన పర్వతమును ధరించినవాఁడా. ధరా-భూమియొక్క. ధరణ= ధరించుట

చేత. ధన్య - కృతార్థమైన. బాహా - భుజముచేత. అవిత - రక్షింపఁబడిన. అపరాధరహిత - నేరములేని. సరాధ - రాధతోఁ గూడినవాఁడా. రవినందనాంచల - యమునాతీరమందు విహార - క్రీడించుటయందు. పారాయణా - ఆసక్తుఁడా.

ఇది శ్రీరామభద్రభజనముద్రకవి పట్టభద్రకాద్రవేయాధిప
వరసమాగత సరస సారస్వతలహరీ పరిపాక కాకమానిమూర్తి
ప్రబోధబుధకవి సార్వభౌమపౌత్త్ర రామలింగభట్ట
పుత్త్ర కౌండిన్యగోత్త్ర భాగధేయమూర్తి
నామధేయప్రణీతంబైన రాజవాహన విజ
యంబను మహాప్రబంధంబు నందు
సర్వంబును పంచమాశ్వాసము.
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ

---